# ఆంధ్రమహిళ

(1)




పదిహేనవ వార్షిక సంచిక

| | | |
|---|---|---|
| విళంబి | జనవరి | నూరు పేజీలు |
| సంక్రాంతి | 1959 | ఒకరూపాయి |

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ కాశీవిశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఆంధ్ర మెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ.

పారిశ్రామిక విద్యాలయము : కుట్టు, ఎంబ్రాయిడరీ ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

పారిశ్రామిక శిక్షణ కేంద్రము : 7-వ రోజరీ చర్చిరోడ్డులో ఆంధ్ర మహిళాసభ పారిశ్రామిక భవనములో వస్త్రములపై అద్దకపుపని, మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత, బుక్ బైండింగు, ఎంబ్రాయిడరీ మొదలగు పరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడుచున్నది.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ : స్త్రీలకు టైపు.—గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము : స్త్రీ విద్యార్థినులకు వసతి గృహము.

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక

నర్సింగ్ హోమ్ : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాఖ— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వ బడుచున్నది.

ముద్రణాలయము : ఆంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూఫు రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును.

నాగేశ్వర శిశువిహార్ : పిల్లల విద్యా వినోద కేంద్రం.

వనితా బాలవిహార్ : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం.



నేడే చూడండి
అన్నపూర్ణా వారి
మాంగల్య బలం
నిర్మాత:
D. మధుసూదనరావు B.A.
దర్శకుడు:
ఆదుర్తి సుబ్బారావు
మాటలు:
ఆత్రేయ.
పాటలు:
కొసరాజు · శ్రీశ్రీ.
సెల్వరాజ్.
వేణు
కృష్ణారావు · సుబ్బారావు.
సంజీవి.
నవయుగ రిలీజ్




# ఆంధ్రమహిళ

సంపుటి 15 :: జనవరి 59' :: సంచిక 1

వ్యవస్థాపకురాలు :
శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపాదకురాలు :
కె. లక్ష్మీరఘురామ్.

సంయుక్త సంపాదకురాలు
రామలక్ష్మీఆరుద్ర.



## విషయసూచిక








సంపుటి 15 :: జనవరి 59' :: సంచిక 1

# సేవాదీక్ష

చెన్నపురి పట్టణమున ఆంధ్రమహిళలు ఆరంభించిన యాగము నిర్విఘ్నముగా సాగింది. దేవతల వంటి వారికి సైతము ఏదైన యాగము తమంతట తామే చేసుకొనలేక బలవంతుల రక్షణ కోరేవారని పురాణములయందు విందుము. కాని ఆంధ్రమహిళలు సాగించిన యాగమునకు ఎవరి రక్షణ కావలెనని కోరలేదు. కోరకయే దేవతలు రక్షించిరేమో మనకు తెలియదు. కాని నిరంతర సేవా పరాయణులైన కొందరి మహిళామణుల సేవాదీక్ష కార్య దక్షత ఈ యాగమునకు రామరక్షయే. ఈ యాగఫలమున ఒక కల్ప వృక్షము జనించి ఆంధ్రమహిళల కోరికల యీడేర్చవలయునని మా ఆశయము. అట్లు ఆశించుట ఆత్మ వంచన కాజాలదు.

ఈ మహాయజ్ఞమందు 'ఆంధ్రమహిళ' ప్రచురణ ఒక క్రతువు. ఈ కార్యములేవైన ఏఒక్కరూ చేయగలిగిన కార్యము కాదు— ఎందరి సహకారముతోనో, ఎందరి ఆదర అభిమానములతోనో చేయదగిన కార్యము. నిరంతర సేవాదీక్షా పరాయణులైన మహిళల సహాయముతో అనేక ఇక్కట్లు ఎదుర్కొంటూ నిర్విఘ్నముగా ఒకటిన్నర దశాబ్దము ఈ క్రతువును సాగించాము. బలవంతుల రక్షణ కోరలేదు గాని దక్షత కోరితిమి— అర్థమునకై ఆశ్రయించలేదు. గాని ఆదర అభిమానములకై అవస్థ పడితిమి. అధికారుని దైన్యమున యాచించలేదు గాని, స్థలము సహకారము సహాయములనెల్ల అడిగి తీసికొంటిమి. ఈ సత్కార్యము సాగించుటకు సహాయపడ్డ స్నేహితులకందరకూ ఇవియే మా కృతజ్ఞతాభివందనములు.

♦ ♦ ♦ ♦

మొన్ననే హెచ్చరించాము— గతజల సేతు బంధనము వలన లాభములేదని త్వరలో ఆంధ్రదేశమంతటా తిరిగి పంచాయితీ ఎన్నికలు, జిల్లా పరిషత్తుల సరిక్రొత్త నిర్మాణము జరుగనున్నది. సోదరీమణులను అప్రమత్తగా యుండవలయునని ఇదేయే మేము సమయోచితంగా హెచ్చరించుచున్నాము. పంచాయితీలలో స్త్రీల ప్రశంసనీయమైన కార్య నిర్వహణ ఉదహరణతో మేము ఈ విషయము ఎక్కువగా విస్తరించి చెప్పనవసరములేదు. ఇవి పూర్వపు జిల్లాబోర్డులవలె పరిణామము పొందకుండ వీటిలో జాగరూకతతో ధైర్యముతో ప్రవేశించి ఈ జిల్లా స్థాయిలోని ప్రభుత్వ నిర్వహణా పద్ధతులను ప్రక్షాళనము గావించి పవిత్రము చేయుట ఆంధ్రమహిళకిప్పటి ధర్మము.

# టిక్కెట్టు లేకుండా చేసే ప్రయాణాన్ని అరికట్టాలి...

## టిక్కెట్లు లేకుండా ప్రయాణం చేయడం గౌరవకరమైన విషయం కాదు.



ప్రయాణీకులకు సుఖప్రయాణం చేకూర్చడం కోసం టిక్కెట్లు లేకుండా చేస్తున్న ప్రయాణాలను పూర్తిగా అరికట్టాలి.

అట్లా చేయడానికి, దయచేసి మాకు సాయపడండి! టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్న వ్యక్తి మీ కంటబడిన ప్రతిసారి, టిక్కెట్లను పరీక్షచేసే ఉద్యోగికి అతనిని చూపించండి! ఈ అసౌకర్య కారణాన్ని, దేశానికి వాటిల్లుతున్న నష్టాన్ని నివారించడం నిమిత్తం, అందరి హృదయపూర్వక సహకారం అవసరం.

— దక్షిణ రైల్వేచే ప్రకటించబడినది



# ప్రపంచశాంతి: మిత్రరాజ్య సమితి

శ్రీమతి డాక్టర్ వి. యశోదాదేవి

ప్రపంచంలో యేకాలమందును మానవ స్వభావ మందలి క్రోధ, మద, మాత్సర్యముల ఫలితముగా సమరములు సంభవించుచునే యున్నవి. ఆ సమర భీభత్సముల నడచి శాంతిస్థాపనకై మహాపురుషులు యవతరించి యుండిరి. ప్రపంచంలో అశాంతికి, కలతలకు, క్షోభలకు ముఖ్య కారణము రాజ్య అధినేతల తీవ్ర కాంక్షయే. ఒక్క యుద్ధముతో పశ్చాత్తప్తుడై అశోక చక్రవర్తి తన జీవితాంతం మరల యుద్ధము రాకుండ పరిపాలించెను; ధర్మవిజయమే వాంఛనీయమని ఘోషి పర్చెను. "అహింసా పరమో ధర్మః," అని బౌద్ధ ధర్మము ఆనాడు ప్రపంచ మంతటా వ్యాపించినది.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము రాజ్యములు తారుమారై, అశేష ప్రాణ నష్టము గల్గిన ప్రపంచములో నానారాజ్య సమితి (League of Nations) దాసోహమనిన రాజ్యములకన్యాయము జరుగకుండుటకు, మరల నట్టి యుద్ధము రాకుండ చేయుటకున్నై సృష్టింపబడినది. కాని ఈ సమితి అగ్ర రాజ్యములమధ్య శాంతి నెలకొల్పలేకపోయెను. కొన్ని రాజ్యముల తటస్థ వైఖరి వలన పెద్ద రాజ్యములు విజృంభించినవి. తత్ఫలితమే రెండవ ప్రపంచ యుద్ధము. ఇది ముగిసిన వెంటనే ప్రపంచ శాంతి స్థాపనయే ఆదర్శముగ మిత్ర రాజ్య సమితి (United Nations) యేర్పడినది. అదియే ఐక్య రాజ్య సమితి.

1941లో ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్, ప్రధాని చర్చిల్ మధ్య శాంతికొరకైన అట్లాంటిక్ చార్టరు సందర్భంలో అంతర్జాతీయ వ్యవస్థ ప్రశంస కాగితము పై బడలేదు. తదుపరి అమెరికాలో అట్టి సంస్థ యవసరమును గురించి ప్రచారము జరిగెను. డల్లెస్ అధ్యక్షతక్రింద శాంతి స్థాపనకై యేర్పాటైన కమిషను శాంతిస్థాపనకు అవసరమైన సప్త సూత్రములు తయారు చేసిరి. అటుపిమ్మట 1943 మాస్కోలో అమెరికా, బ్రిటను, చైనా, రష్యాలు అంతర్జాతీయ సంస్థకై ఒక ప్రకటన చేసిరి. 1944 లో Dum-barton Oaks సమావేశములో అగ్రరాజ్యాలు తమ యభిమతము ననుసరించి ప్రపంచశాంతిని ప్రపంచములో స్థాపింపదలంచిరి. San Francisco సమావేశములో అంతర్జాతీయ వ్యవస్థ- అదియే మిత్రరాజ్య సమితి- అధికారము ప్రాబల్యము హెచ్చినది.

మిత్రరాజ్య సమితి ప్రపంచములోని వివిధ జాతులయొక్క సమిష్టి చిహ్నము. మానవ కోటిలో తాల్మి, జాలి, దయాగుణములు పెంపొంది ఆశక్తతకు చిన్నెలుగ పరిగణింప బడని నాడు, ఐక్యరాజ్యసమితి, శాంతిసాధనకు మెండైన యవకాశముగలదు. వ్యక్తిత్వమును, వ్యక్తి హక్కులను, స్వాతంత్ర్యమును అభివృద్ధి చేయుటకై అంతర్జాతీయ సహకారమును సంపాదించుట సమితి యాదర్శము. ఈ విషయంలో కుల,

మత, భాషావిచక్షణాలు యడ్డురావు. మిత్రరాజ్య సమితి రెండు వుమ్మడి భద్రతా సంఘములను Pact of America 2 North Atlantic సంధి యేర్పాటు చేసినది.

శాంతికొరకే Nato యేర్పాటైనది. కాని యందు సభ్యత్వములేని రాజ్యములు భయపడి వేరొక యొడంబడిక చేసికొన్నవి. అటులకాక మిత్రరాజ్య సమితి ప్రపంచములోని ముఖ్య సమస్యలను ప్రజాదృష్టికి దెచ్చుచున్నది. సామరస్యత, సంధి, ఐక్యతలకు సమితి కేంద్రము దీనికి సంబంధించిన ముఖ్యభాగములు–1. జనరల్ అసెంబ్లీ 2. భద్రతామండలి. 3. ట్రస్టీలకౌన్సిల్ 4. E.C.O.S.O.C.

ప్రపంచ దృష్టిని యవసరమైన విషయములపై కేంద్రీకృత మొనర్చి ప్రభుత్వముల పరిపాలనా పద్ధతులను మార్చగలదు ఈ సమితి. ఐక్యరాజ్య సమితిని ప్రపంచ శాసన సభ యనవచ్చును, ఇందు ప్రతినిధులు నిర్భయంగా, స్వతంత్రంగా చర్చించుటకు యధికారముగలదు కొన్ని రాజకీయ భద్రతా సందర్భములలో సమితి విజయములను గాంచినది. సమితి తీర్మానములలో కొన్ని నూతన రాజ్యముల స్థాపించినవి మరికొన్ని ప్రాతరాజ్యముల రక్షించినవి. రాబో

వు యుద్ధముల నరికట్టినవి. ఇరానునుండి రష్యను సైనికదళముల నిష్క్రమణ విషయంలో సమితి గెలుపొందినది. 1946 మే నెలలో ఇరాను సమితికి అప్పీలు చేసింది, మే మాసంలో సైన్యములు తరలిపోయినవి. గ్రీసు విషయంలో కమ్యూనిష్టు బాధలనుండి రక్షణకై గ్రీసు బ్రిటిషు సైనిక దళముల సహాయమపేక్షించిందని భద్రతామండలి తీర్మానించెను. కొరియా విషయంలోను, ఇజరల్ రాజ్యస్థాపన, ఇండోనేసియా సంయుక్తరాజ్య నిర్మాణములలో సమితి ముఖ్యపాత్ర వహించినది. బెర్లిన్ బ్లాకేడ్ తగాయిదాలో అగ్రరాజ్యాల మధ్య రాయబారాల మూలంగా సమితి యుద్ధము రాకుండా ఆపినది ఇటలీవలస రాజ్యములు- సోమలీలాండ్ ఎరిట్రియా లిబియాలకు సమితి స్వతంత్ర మిచ్చినది వీటన్నిటివల్ల అంతర్జాతీయ సమస్యల పరిష్కారంలో సమితి గల సామర్థ్యము వెల్లడియగుచున్నది. కాని మన కాశ్మీరు సమస్య తీరకపోవుట చంద్రునకు వలె సమితికి కళంకమగునేమో !

ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగములందును సమితి విశిష్టత గడించియున్నది "సమితి సమావేశములలో ప్రతినిధులు జాతిమత భేదములపాటింపరు; కలసిమెలసి చరింతురు, సమితి యని చెప్పబడినది చార్టరులో, సమితి కపటమును బయలు పర్చును, చర్చలు, ప్రసంగాల మూలంగ ప్రతినిధులు యొండొరుల భావముల సక్రమముగ నవగాహన మొనర్చుకొందురు" సమావేశంలో సమితి సభ్యులలో పెద్ద రాజ్యాలు 5; చిన్న రాజ్యములు 45. ఇప్పుడు చిన్న రాజ్యముల సంఖ్య 54 కు పెరిగినది. చిన్న రాజ్యములు శాంతి, న్యాయము, ధర్మములకు విలువనిచ్చును. వాటికి సైనిక బలం కంటె నైతిక బలమే యెక్కువ. సమితిలో పెద్ద రాజ్యములకు చిన్న రాజ్యముల సహకారం అవసరం, అందువల్ల సమితి సామరస్య కేంద్ర మగుచున్నది.

కమ్యూనిష్టుల, తదితరుల మధ్య భేదములను మిత్ర రాజ్యసమితి భేదింప జాలకున్నది. అగ్రరాజ్యముల పరస్పరవైషమ్యముల వలన ప్రపంచంలో వ్యక్తిస్వాతంత్ర్యము నశించుచున్నది. మరొక యుద్ధము సంభవించిన ఆటం, హైడ్రోజన్ బాంబులు ప్రేల్చబడవచ్చును, మొదటి ప్రపంచ యుద్ధము తర్వాత సంధి ఫలితంగా అన్ని రాజ్యములు తమ భేదములను శాంతియుతముగ పరిష్కరించుకొని, యుద్ధమునకు బోకుండుటకు నిశ్చయించినవి. తత్ఫలితముగ కొన్ని అమాయక రాజ్యాలు ఆయుధముల యభివృద్ధిని యశ్రద్ధచేసినవి; ఈ అవకాశం చూచుకొని హిట్లరు, ముస్సోలినీలు రెండవ ప్రపంచ సంగ్రామమునకు దారితీసిరి.

జనాభిప్రాయానుసారము న్యాయము, ధర్మములపై శాంతి యాధారపడి యుండును, కాని ప్రెసిడెంటు విల్సను అన్నట్లు వ్యక్తులు శాంతికి కంటె హక్కులకు విలువ యిచ్చెదరు. హక్కుల నిర్ణయంలో మిత్ర రాజ్యసమితిలో యేకీభావము గలదు, సమితిలో అన్ని రాజ్యముల ప్రాతినిధ్యములేమి, సమితి అంతర్జాతీయతకు కొరతయే, క్రొత్త రాజ్యముల సభ్యత్వమునకు అసెంబ్లీ, భద్రతామండలి యొక్క యేకీభావము అవసరము, కాని అది కష్టతరము. అసెంబ్లీలో ప్రపంచ రాజ్యముల ప్రాతినిధ్యము పరిపూర్ణమైన, సమితిశాంతిని స్థాపింప గలదు, అసెంబ్లీ

నడుచుటలో కొంత మార్పు కలుగవలసి యున్నది. అసెంబ్లీ, భద్రతామండలి ఓటింగు పద్ధతులలో మార్పులో, సర్వసభ్యత్వము సిద్ధించిన, సమితి ప్రాబల్యము యినుమడించును. ఇందుకై క్రొత్త సమావేశం యేర్పాటు చేసి శాంతి, న్యాయము, వ్యక్తి స్వాతంత్రము, ఆయుధముల నిర్ణయముల విమర్శింప వచ్చును.

శాంతికి భంగకరమనితోచిన పట్ల భద్రతామండలి సమయానుకూలముగ నడచుటకు యధికారము గల్గియున్నది. కాని అగ్రరాజ్యముల బలవంత పెట్టగల స్తోమత సమితికిలేదు. అంతర్జాతీయ తగాదాలను అంతర్జాతీయ ధర్మానుసారం తీర్చుట సమితి బాధ్యత.

సమితి చార్టరులో నిర్వచింప బడిన యాదర్శములను, ముఖ్యముగ ప్రపంచ శాంతిని పరిపూర్ణముగ స్థాపింప లేకుండుటకు కారణం అగ్రరాజ్యముల సత్వము, స్వార్థపరత్వమే. సమితి యసెంబ్లీలో అన్ని రాజ్యములకు ఒక్కొక్క వోటు గలదు, ప్రతి దేశపు ప్రతినిధియు తన రాజ్యము యొక్క స్వార్థమును ఆలోచించునే గాని, ప్రపంచ శాంతి కొరకై యే విధమైన త్యాగమును జేయజాలడు. అటుల చేసిన ఫలితమున తన పదవినే విరమింపవలసి వచ్చును, అసెంబ్లీలో పెద్ద రాజ్యములకు మాత్రము హక్కు గలదు. సమితిలో సర్వాంగీకారమున్న గాని యే తీర్మానము నెగ్గదు. ఇప్పటివరకు రష్యా 43 మార్లు వుపయోగించినది, తమ స్వార్థమునకు భంగం రాకుండా ప్రపంచ శాంతి స్థాపింపవలెను అగ్రరాజ్యముల ప్రయత్నం నెగ్గుట యసంభవము. చిన్న రాజ్యములు వారి చేతి క్రిందనుండు రోజులు మారినవి. కాబట్టి అగ్రరాజ్యములు తమ స్వార్థమును తగ్గించుకొనిన, మిత్రరాజ్య సమితి ప్రపంచ శాంతిని స్థాపింప గలదు. ★




యుద్ధభూమిలో విజయుని శంఖారావముకాదు. కురుక్షేత్రములో వీరుల శంఖావినోదముకాదు. చెవిటివాని చెవిలో శంఖారావము కాదు. ఇది మా శంఖారావము. ఇది స్త్రీల శంఖారావము. ఇది మహిళాభ్యుదయ శ్రేయోభిలాషుల శంఖారావము. ఇది దేశాభ్యుదయ హితుల శంఖారావము.

ఏమాత్రము ఆలోచనాశక్తి, విచక్షణా జ్ఞానము, సంస్కారమున్న వ్యక్తికైనా తెలుసు ఈ సత్యము భారత సంస్కృతీ సంరక్షకురాలు భారతనారని. ప్రపంచమంతా ఈనాడు భారతదేశాన్ని గౌరవిస్తున్నది ఎందుచేత? ఆమె నాయకులను చూచికాదు. ఆమె సిరి సంపదలను చూచి కాదు. ఆమె అంద చందములను చూచికాదు, ఆమె విద్యా విభవములను చూచికాదు. ఆమె వేదాంత కళా నైపుణ్యములను చూచికాదు. కాని భారత మహిళల సతీత్వము ప్రపంచాన్నంతా ఆకర్షిస్తోంది. ఆ పూజ్యులైన భారతస్త్రీలకే ప్రపంచము జోహారు చేయుచున్నది. ఆ ప్రాచీన సాంస్కృతి సంరక్షకులకే ప్రపంచము అంజలి ఘటించు చున్నది. ఆ శీలసంపన్నులకే సమస్త మానవాళి పుష్పాంజలి ఘటించు చున్నది.

ప్రపంచమంతా మానవత్వముఒకటే. మరి సతీత్వము మాత్రము కాదా? సంశయమునకు అవకాశము లేక పోలేదు. భారత మహిళ ఆ సంశయమును తన నిత్య జీవిత విధానముతో పటాపంచలు చేయుచున్నది. ఆమె స్వార్థరహిత నియమబద్ధ జీవితమె ఆ సంశయమునకు అవకాశము లేకుండ చేయుచున్నది, ఆమె శీల సంపదే ఆమెను అగ్రస్థానమున అధిష్టింప చేయు చున్నది. శాంతము, సౌమ్యము, ఓర్పే ఆమెను పూజ్యురాలుగా చేయుచున్నది. ఆమెను బోలిన స్త్రీ ప్రపంచములో మరెచ్చట నున్నది?

లేదు లేదు. ముల్లోకములలేదు. స్వర్గమునలేదు. నరకమునలేదు. ఈ భారతభూమిలోనేపుట్టిరి. పుట్టుచున్నారు. పుట్టనున్నారు. స్వామి వివేకానంద గాలమువేసి వెతికినా ఆయనకు అట్టిపూజ్యురాలు భారత దేశములో తప్ప వేరే కనబడలేదు. ఆయన గురువు రామకృష్ణ పరమహంసకూ కనబడకనే తన భార్య శారదామణినే షోడశీపూజ చేసి భారతసతిని గౌరవించాడు. పండిత నెహ్రూనూ పదేపదే భారత మహిళల ఓర్పు, సౌమ్యత, దీక్ష, స్వార్థరహిత సేవను ప్రశంసించు చున్నాడు. ఔరా! భారతనారి పవిత్రత. ఆమె గుణ విశేషంబులు మాకు చెల్లదు. ఆమె యందలిగల విశేషములెవ్వి? సిగ్గు సింగారము. ధరించునది ధర్మపు పట్టు పీతాంబరములు. ఎంత అందమైన చీరె. నీతి సంపదల చెమికీ పువ్వులు మెరియుచున్నవి. తలపైనున్నది శీలపు రతనాల మకుటము. అలంకరించు కున్నది. సౌశీల్యాభరణములు ముఖమున దిద్దినది. ఆత్మశక్తియను చక్కటి కుంకుమ బొట్టు — ఇట్టి అపూర్వ సౌందర్యములతో శోభించుచున్న భారత మహిళ మన సంస్కృతీ సంరక్షకురాలవడంలో సందేహమేమున్నది!

అయితే ఇప్పుడు వచ్చిన ఆపద ఏమి? అదేమనము నేడు విచారించు చున్న విషయము. దేశములో అవినీతి ప్రబలి పోయింది అరాజకం పెరగిపోయింది, ఆధ్యాత్మిక

ఆశక్తి క్షీణించి పోయింది — నైతికంగా దేశము పతనమై పోవుచున్నది. కారణము కొందరి భారతీయ రమణీమణుల అజాగ్రత్తయే వారి జాగ్రదావస్థే. వారి విదేశ అనుకరణా వ్యామోహమే. పరదేశ పరిపాలన వలన ఏర్పడిన దాస్యము నేటికి స్వతంత్ర భారతములోనూ అంటారానై నిలచియున్నది. ఆ దేశము, భాష, ఈ దేశము వేషము, మరియొక దేశము మతము, ఇంకొక దేశము జీవిత విధానము నేడు మనకు అనుకరణీయములైనవి. స్వార్ధము మానవ హృదయములో పుట్టి వికృతంగాపెరిగి ప్రపంచమంతా వికటాట్టహాసముతో భయంకర నృత్యము చేయుచున్నది. ఆ నాట్యానికి భ్రమసి, భయపడి. రివ్వపడి, భారత మహిళలు శతాబ్దాలనుంచి అధిష్టించిన అగ్రస్థానములనుండి దిగజారుచున్నారు.

నన్నుజూడు, నా అందము జూడని తమ దేహములను అందరికీ ప్రదర్శించుచూ, కామక్రోధ మదమాత్సర్యములలోకి తమతోపాటు పురుషులను బిడ్డలను కూల ద్రోయుచున్నారు. అసంతృప్తితో. పేరాశతో విలాసజీవితాపేక్షతో ధనకాంక్ష పెరిగి, సప్త వ్యసనములకు దారి చూపుచున్నారు. విజయ గర్వముతో కన్ను మిన్ను గానక దైవభక్తి నశింప నాస్తికులై వ్యర్ధులగుచున్నారు. ఈ అనుకరణ ప్రభావముచే భారత మహిళలు తమకు పరంపరంగాసి ద్ధించిన పవిత్రతను త్యజించి స్వలాభాపేక్షతో స్వార్ధముతో అనుకరణా భ్యాసములో పడిపోయరేని వారికిగాని, దేశానికిగాని, మానవాళికిగాని క్షేమముకాదు.

ఇప్పటికైనా భారత మహిళలు తమ సోదరీమణులు కొందరు వేస్తున్న తప్పటడుగులు గుర్తించి అధోగతిని పడిన వారికి చేయూతనిచ్చి వున్నత శీలసంపద కౌస్తుభ హారము ధరించి భారత మహిళ పవిత్రత కాపాడుట అవసరము.

ఈ విషయము పూజ్యగాంధీ మహాత్ముడు అనేక సారులు హెచ్చరించాడు. నేడు సజీవులైవున్న పండితులు, రాజకీయ నీతిశాస్త్రవేత్తలు, మతగురులు. వేదాంత కోవిదులు, ఈ విషయాన్ని మనకు అనేకసార్లు అనేక విధముల హెచ్చరించుచున్నారు. అసంతృప్తి జీవితములు గడపుచూ, కృత్రిమాలంకరణలద్వారా అందరినీ ఆకర్షింప నెంచుచూ. పాశ్చాత్య ఆలోచనాభ్యాసములోబడి విచక్షణా జ్ఞానము నశింప చేసుకుంటూ సక్రమ ప్రవర్తనవీడి స్వార్ధ పూరితమైన జీవనము గడపుటకు మన సోదరీమణులను తయారైనారు. ఈ విధముగా ఈ రోగము అవిచ్ఛిన్నముగా కొనసాగునేని, మనజాతి, మన సంస్కృతి, మన దేశము నశింప గలదు.

కావుననే మా శంఖారావము తమ ప్రవర్తన వలన దేశాన్ని కాపాడేశక్తి మహిళలో యున్నదిగనుక ఆమె జాగ్రత్త పడాలి. నైతికంగా దేశాన్ని రక్షించాలి. తప్పటడుగు వేస్తున్న వారికి తప్పు చూపించి జాగ్రత్తగాముందడుగు వేయునట్లు చేయాలి. శుభమంటూ కుడికాలు ముందు పెట్టించి పవిత్రమైన ప్రదేశాలలో. అంటినదల్లా పవిత్రముచెయ్యాలి. బిడ్డలకు. పురుషులకు త్రోవ చూపాలి శరీర మాద్యం ఖలుధర్మ సాధనము. ధర్మ సాధనకే శరీరము, పుట్టుట గిట్టుట కొరకే. పుట్టలోని చదలు మాత్రము పుట్టదో గిట్టదో? "ఏపూర్వ పుణ్యమో ఏయోగ బలమో" వలన జన్మించినాము మీ భారతదేశములో పుట్టినందుకు మన జీవితము సార్ధకము చేసుకోవాలి. అదే సర్వ వేదాంతసారము. అదే మతముల మతము, లేనిచో అట్టివారు జీవన్మృతులే యని నేను నేర్చిన విద్య చెప్పుచున్నది.

స్వరాజ్యము సిద్ధించింది. నైతిక పతాకము భారత మహిళలు ఎగురవేయాలి. ఆంధ్రమహిళలది ఎప్పుడూ ముందడుగే!



# పిలుపు

(For whom the bell tolls అనే John Donne రచించిన ఆంగ్ల గేయానికి స్వేచ్ఛానువాదం)

గణ గణ ఘంటా మ్రోగిందంటే
పిలుపౌక పూజారికే కాదంటా!!
గురుసందేశము విన జనమంతా
చెర చెర వత్తురు తెరువులవెంటా!!—గణ గణ!!

ఎన్నడు మ్రోగునొ ఏమోగానీ
ఎవరిని పిలుచునొ ఎరుగముగానీ
గణ గణమ్రోగే ఘంటారావము
విని సాగని మనుజుని కనబోవము!!—గణ గణ!!

జగతి వీడు మానవతాలేశం
నిలుప నెవ్వరికి లేదవకాశం
సమష్టి మానవ సాగరమందు
వ్యష్టిలంక యెవ్వడు కాడెందు!!—గణ గణ!!

ఏ మనుజుడు చనినా నానాశం
ఏను మానవతలో ఒక లేశం
గణ గణ ఘంటా మ్రోగిందంటే
మానవతకె రమ్మని పిలుపంటా!!—గణ గణ!!

—రజని

ఇన్‌డస్ట్రియల్  ఇన్‌స్టిట్యూట్

తోలు సంచీ

# హైదరాబాదు

గత సంవత్సరం జూన్ మాసమునుండీ ఆంధ్ర మహిళా సభ, హైద్రాబాదులో కూడా తన కార్యకలాపాలకి నాందిపల్కింది. ట్రస్ట్‌బోర్డు వారి ఆధిపత్యం కింద పనిచేసే ఒక కమిటీ రూపొందించబడింది. శ్రీమతి కె. సుగుణమణి, శ్రీమతి లీలాబాజీ, జాయెంట్ సెక్రటరీలు గానూ, ఎన్నిక కాబడ్డారు. ఈ హైదరాబాదు శాఖ క్రింద, హాండీక్రాఫ్ట్ టీచర్లకు తర్ఫీదు నిచ్చేందుకు ఒక ఇన్‌స్టిట్యూట్ ప్రారంభం అయింది. ఈ సంస్థ మేనేజింగు బోర్డులో పారిశ్రామిక శాఖ తరఫున సభ్యులుగా శ్రీ రాజ్యాధ్యక్ష, శ్రీ మధుర్ వున్నారు. ఈ సంస్థలో తర్ఫీదు నందుతున్న విద్యార్థి ఉపాధ్యాయులకు వసతి గృహ సదుపాయాలు సమకూర్చడమే కాకుండా హైదరాబాదులో యితర సంక్షేమ కార్యక్రమాలను కూడా నిర్వహిస్తూంది - సభ. వయోజన విద్యా తరగతులను ప్రారంభించడానికి సంసిద్ధం అవుతూంది.

రీజినల్ ఇన్‌స్టిట్యూట్‌లో దక్షిణాది రాష్ట్రాలైన ఆంధ్ర, మైసూరు, కేరళ, పాండిచేరీలనుండి తర్ఫీదు కోసం విద్యార్థులు వచ్చారు. ఈ సంస్థకు ఆర్థిక సహాయం ఆలిండియా హాండిక్రాఫ్ట్స్ బోర్డు చేసింది. 1958, 9, జూలైనాడు యీ సంస్థకు రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ ప్రారంభోత్సవం గావించారు. ప్రస్తుతం యిక్కడ నలభై ముగ్గురు తర్ఫీదు నందుతున్నారు. వారిలో పన్నెండుగురు, బొమ్మల తయారీలోనూ, పదిమంది పేము, కర్ర పనిలోనూ పని చేస్తూన్నారు. అట్ట పని, ఛార్టులూ మొదలైనవి తయారుచేయడం నేర్పిస్తున్నారు.

ఇక్కడి విద్యార్థులు తయారుచేసిన చేతిపనులు పదర్శనలలో పెట్టబడ్డాయి. వాటిని తిలకించిన ప్రేక్షకులు వాటి పనివాటి తనానికి అచ్చెరువందారు.



కార్డుబోర్డు పని నేర్చుకుంటున్నారు

# కొత్త పుస్తకాలు

## కాలాతీత వ్యక్తులు

రచయిత్రి : పి. శ్రీదేవి
ప్రాప్తిస్థానం : స్వతంత్ర పబ్లిషర్స్,
ఛాదర్‌ఘాట్, హైదరాబాదు
మూల్యం : ఐదు రూపాయిలు

'పిచ్చి తుగ్లక్' కాలాతీత వ్యక్తి. నిజంగాచూస్తే వర్తమానానికి అతీతంగారచించిన రచయితా, చిత్రం గీసిన చిత్రకారుడూ-ప్రవర్తించిన మానవమాత్రుడూ-అందరూ కాలాతీత వ్యక్తులే. తను వసించే వర్తమానానికి అతీతం కనుక అర్థరహితం అయాయి తుగ్లక్ తలపెట్టిన సంస్కరణలూ; ఆజ్ఞాపించిన చేతలూ. అలాగే యీ వర్తమానంలో అర్థంగాని వ్యక్తులు. విపరీతంగా గోచరించే వ్యక్తులు వుంటారు. అలాంటి వాళ్ళనే చిత్రించిన శ్రీదేవి వారికి రక్తమాంసాలు ప్రసాదించింది. నిండు రూపులిచ్చింది. నవల చదివి, ఇందులో కథ ఏమిటి ? అని ప్రశ్నించుకోము. ఇందలి పాత్రలూ, వారి మాటలూ చేతలు లీలగానూ ప్రస్ఫుటంగానూ కూడా మనని వెన్నంటి వుంటాయి. ఫలితంగా కథేమిటి అన్న ఆలోచనకన్న యీపాత్రల మన స్తత్వాలనీ, ఇవివాస్తవ ప్రపంచంలో దృగ్గోచరం అవుతాయా అనీ ఆలోచిస్తాం.

సినిమా చూస్తే కథేమిటి ? అన్నట్లే నవల అనే సరికి కథ వుండాలనిపిస్తుంది. కాలాతీత వ్యక్తులలో కథ స్వల్పం. కాని మనుష్య జీవిత చక్రాల శీఘ్రగమనం, వాటి చక్రపుటిరుసుల నలిగిన బాధా వ్యథిత హృదయాల మూగ. ఆక్రందనాలు-అన్నీ విస్తృతం,

నేనీ నవల చదివి ఎవరు హీరో, ఎవతె నాయక! అని యోచించాను. కాని దీనిలో ముఖ్య పాత్రలన్నీ తమ తమ జీవితాలని - విధివశానా, ఇచ్ఛికంగానూ కూడా ముప్పేటగా అల్లుకొని. ముందుకు సాగి పోయాయి.

కృష్ణమూర్తి విలాసపురుషునిలా కన్పించే వ్యక్తి, చిన్నవాడు ; అందగాడు ; సరదాలంటే కర్చుకి లెక్క చెయ్యడు. అతనికి తారసపడిన కాలాతీత వ్యక్తి ఇందిర. చదువు సంధ్యలకి స్వస్తి చెప్పి తండ్రి పోషణార్థం ఉద్యోగం చేసే గుండె దిటవుగల అమ్మాయి ఇందిర. ఈ వర్తమానపు కష్టసుఖాలు గాలివాలుని పట్టి దాటుకుంటూ లోలోన దుఃఖాన్ని గూడు కట్టుకుంటూ, బ్రతుకీడుస్తున్న వింత వ్యక్తి ఇందిర. యీ సంఘపు కట్టుబాట్లు, ఆచారాలూ ఛాదస్తం అంటూ కొట్టిపారేస్తుంది ; వ్యక్తినీ వ్యక్తి హృదయాన్ని గౌరవించి అతని చుట్టూ వాతావరణాన్ని లెక్క చేయనంత సునిశిత దృష్టికల వ్యక్తి యిందిర. ఈమ యింట రూములో మకాంవేసి ముక్కు మూసుకు చదువు ముగించడానికి వస్తాడు ప్రకాశం. ప్రకాశం వెన్నుఎముకలేని శరత్ హీరోలాంటివాడు. అయ్యో ఏమనుకుంటారు ! అని గట్టిగా ఊపిరి పీల్చుకుందుక్కూడా భయపడే తత్వం. ఇతన్ని ప్రేమించిన కళ్యాణి విద్యార్థిని. మల్లెలకి సౌరభాన్ని, కలువలకి సౌమ్యాన్ని అందివ్వగల మంచి పిల్ల కళ్యాణి. ఈ కళ్యాణి ఆ ప్రకాశాన్ని ప్రేమించడం సహజమే, కాని ఇందిరకూడ ప్రకాశాన్ని ప్రేమిస్తుంది. ప్రకాశం తత్వం ఇందిరకి మొదట్లో అర్థం కాదు. కాని అర్థం అయాక అతన్ని తనచెంత వుండనిచ్చే, తత్వం అసలు కాదు ఇందిరది. ప్రకాశాన్ని దూరం చేసుకొని యిందిర కృష్ణమూర్తికి సన్నిహితం అవుతుంది.

'కోటనందూరు' అనే పల్లెలో పుట్టి విశాఖపట్నంలో చదువ వచ్చిన కళ్యాణికి పుట్టెడు కష్టాలు వస్తాయి, తండ్రి పోతాడు. స్వంత కూతురిలాగా చూసుకొస్తున్న రామినాయుడు హఠాత్తుగా చనిపోతాడు. రామినాయుడు తుదిఘడియల్లో పిలిపించిన డాక్టర్ చక్రవర్తి కృష్ణమూర్తి స్నేహితుడు. జీవిత పోరాటంలో దగాపడ్డ తమ్ముడు. కళ్యాణిని చూడగానే

ఎక్కడో చూశాను అనుకుంటాడు. అది పూర్వజన్మ స్మృతితో ; అన్నట్లు ప్రకాశం దగా చేశాడని బాధ పడ్డ కళ్యాణి చక్రవర్తికి సన్నిహితం అవుతుంది. ఇద్దరూ జీవితంలో గాయపడ్డవారే అవడంతో వారి మధ్యన అల్లుకొన్నది — రాగబంధమో విధి వ్రాతో తెలియనంత సన్నిహితంగా అల్లుకుంటుంది.

అన్యాయపు ప్రపంచపు బంతి ఆటలో యిష్టం వచ్చినవాళ్ళు యిష్టం వచ్చినట్లు విసిరేస్తే పడ్డ ఖేదాన్ని పడిన కృష్ణమూర్తి ఒక తుణికపు బలహీనతకు గురి అయి ఇందిరని హృదయంలో దాచుకుంటాడు. అదే టైమ్‌లో నికృష్టంగా లోకంమీద కక్షతో బాధ పడిన ఇందిర కృష్ణమూర్తి సాన్నిహిత్యాన్ని కోరింది. కాని దానికి ఫలితంగా అతన్ని కట్టేసుకో దలచలేదు. నీవు జరిగిన దానికేం బాధ్యుడవు కావు 'నీ దారి నీది నా దారి నాది' అన్నట్లు చెప్పేస్తుంది ; కాని జల్సా వ్యక్తిగా, లోతులేని బలహీనునిగా కన్పించిన కృష్ణమూర్తిలో ఎంత కారెక్టరు వుందో, ఎంత మృదువైన హృదయం వుందో తెలుస్తుంది అతని నిశ్చయం చూస్తే. ఇందిరను ప్రపంచం తలక్రిందులైనా సరే చేపట్ట దలిచాడు. తాగుబోతు, ఉట్టి జులాయి మనిషి అయిన తండ్రి స్థానే ఇందిర కృష్ణమూర్తిని వూహించుకుని కొండంత ధైర్యంగా వుంటుంది. 'నేనున్నాను. ఏం ఫరవాలేదు' అనగల వ్యక్తి కావాలనుకున్న ఇందిర కోరిక తీరుతుంది.

కళ్యాణీ డాక్టరూ, ఇందిరా కృష్ణమూర్తీ కొద్ది స్నేహితులతో తిరుపతికి ప్రయాణం కట్టుతారు. అనేక కష్టాలని నెట్టుకుంటూవచ్చినా కళ్యాణి యింకా తాను దురదృష్టవంతురాలననీ అందుకే కష్టాలు వెన్నంటి వస్తున్నాయనీ బాధపడుతుంది. కాని 'నా అదృష్టంకంటే నీ అదృష్టం గొప్పది. అందుకే యీ మాత్రం ప్రాణాలతోనైనా బయట పడ్డాం' అన్న ధైర్యాన్ని యిస్తాడు చక్రవర్తి.

కాందిశీకుల్లాగా కొండచేరిన వారి కార్యం కాస్తా పూర్తయాక యిక సమస్యలు ప్రారంభం అవుతాయని దిగాలు పడ్డవాళ్ళకి హెచ్చరిక యిస్తుంది యిందిర. బ్రతికి ఉన్నవాళ్ళకి కాక చచ్చినవాళ్ళకా సమస్యలు వుంటాయి ? నిజం. బ్రతికి ఉండబట్టేగదా సమస్యలు!!

నవల చదువుతున్నంతసేపూ ప్రతి పేజీని ఇందిర ఆక్రమించుకుంటుంది. నవలలో ఇందిర ఎంత హాయిగా ప్రవేశిస్తుందో, అంత హాయిగానూ చివరి దాకా నడిచింది. 'నాన్నా బ్రాందీలాంటి కాఫీ పట్టా' అని శాశించకలదు. అద్దంలో చూసుకొని 'యిరవై రెండేళ్ళకే ముసలిదాన్ని అయిపోతున్నాను కాబోలు' అని వాపోకలదు ; 'వెర్రివాడా యిందులో మిస్టరీ ఏం లేదు' అంటూ మంత్రముగ్ధులైన మగవారికి రెండూ రెండూ నాలుగు అని గుణితం చెప్పేస్తుంది...రచయిత్రి చెప్పినట్లు : ఇందిర లాంటివాళ్ళు రాజసం అడ్డు వచ్చి మరింత హాయిగా వున్నట్లు పళ్ళు గిట్టగించి నటిస్తారు. ఇలాంటివాళ్ళు లోలోపల మరింత కుమిలిపోతూవుంటారు ; కాని, "నేనున్నానులే ఫరవాలేదు, నీ బాధ్యతలన్నీ నా మీద వేసి నువ్వు నిశ్చింతగా వుండు" అనకల్గేవాని అన్వేషణతో అందరూ మరుగుజ్జులే కన్పించారు యిందిరకి. కృష్ణమూర్తి కన్పించాడు చివరకి. దిగాక యీదక తప్పదన్న ధైర్యంతో యిద్దరూ వున్నప్పుడు గొడవే లేదు. ఏ కాకిలాగా దారం తెగిన గాలిపటంలాగా కన్పించిన కృష్ణమూర్తిలో యింత సాహసం కన్పించేసరికి కృష్ణమూర్తిమీద కూడా పఠితలకి గౌరవం పెరుగుతుంది. ప్రకాశం నిజంగా మరుగుజ్జులాగే కన్పిస్తాడు ! జీవిత కాలంలో నిండుగా బ్రతకడం ఆశయంగా, యిద్దరూ వివాహంచేసుకుంటారు. "మై డియర్ కృష్ణమూర్తీ, రోజుకి పదిసార్లు చావకు ఇంకొకళ్ళని చంపకు. నీకు తారసిల్లిన మనుషులలో అణగి మణిగి ఎక్కడైనా మానవత్వం వుంటే దాన్ని పైకి తీసే ప్రయత్నం చెయ్యి. మానవత్వం వుండడం సిగ్గు పడవలసిన నేరమేమికాదు...ఏనాడో కరిగిపోయిన కలలు విరిగిపోయిన అనురాగాలూ అటకలోంచి తీసి అవతల పారేయ్. మనస్సు తేలిగా వుంటుంది. ఆయుర్దాయం వున్ననాళ్ళు బ్రతుదాం కృష్ణమూర్తీ ! కాబట్టి రేపటి సమస్యలు తలచుకొని బరువెక్కిపోకు. తెల్లవారితే యింకొకరోజు!" అంటుంది ఇందిర. ఇంతటి సహృదయని అర్ధాంగిగా ఏ కృష్ణమూర్తి కోరడు?

కాలాతీత వ్యక్తులు చక్కటి నవల. ఇటువంటి నవలలు విరివిగా వస్తేనేగాని మన సాహితీ స్రవంతి మోకాటి ప్రమాణంగానే ప్రవహించి పోతుంది. చక్కటి ముద్రణా, బైడింగు పుస్తకపు గౌరవాన్ని యినుమడింప చేస్తున్నాయి. ముఖచిత్రం లేమికూడా కాలాతీతం అని రుజువు చేసుకుంది ! (అవునుమరి !

ముఖచిత్రం చూసి పుస్తకాలు కొనేరోజులివి!) ఈవిషయంలో స్వతంత్ర పబ్లికేషన్సువారు నిజంగా ధైర్యం చేశారనే చెప్పాలి.

కె. రామలక్ష్మి.

◆ ◆ ◆

మనలో మనమాట

(వ్యాస సంపుటి)

రచయిత్రి కె. లక్ష్మీరఘురామ్

ప్రాప్తిస్థానం: ఆంధ్రమహిళాప్రెస్, మద్రాసు 4

వెల: ఒకరూపాయి

శ్రీమతి కొత్త లక్ష్మీరఘురామ్‌గారు ఇదే శీర్షికతో ఆమధ్య అప్పుడప్పుడూ పత్రికలలో ప్రచురిస్తూ వచ్చిన వ్యంగ్య రచనల సంపుటీకరణమే ఈ పుస్తకం. నేటి మహిళల పాలిటికి ఈ మనలో మనమాట మంచి మంచి మాటల మూట. సాంఘికంగా రాజకీయంగా, ఆర్థికంగా, విద్యావిషయకంగా స్త్రీలకు ఎదురవుతూ ఉన్న. స్త్రీలు ఎదుర్కోవలసి వస్తూఉన్న అనేక సమస్యలను గురించి సోదర మహిళామణులందరూ అడపా తడపాచేరి మన సిచ్చి మాటలాడుకొన్న బాతాఖానీలనే శ్రీమతి లక్ష్మీ రఘురామ్‌గారు తమ రచనల్లో పొందికగా గుదిగుచ్చి, రసవంతంగా సంకలించి, పాఠకులకు ఈ రూపేణా అందించారు.

ఇందుతో వారికి ఎవరినిగాని అనవసరంగా దుమ్మెత్తి పోయాలని, ఎత్తి పొడవాలని ఎంతమాత్రమూ లేదనేది నిజం, మహిళాభ్యుదయానికి దోహదమిచ్చే ఏకైక పరమార్థంతోనే ఈ రచనలు యావత్తూ జరిగిన వనుటకు సందేహం లేదు. అరమరలు లేకుండా మాట్లాడుకోవడానికి వీలైన ప్రాంగణంలో, ఆయినవారు నలుగురూ కలిసి, తమ సంఘానికి చెందిన నాలుగు విషయాలనూ గురించి మంచి చెడ్డా చర్చించుకొని, సాధక బాధకాలు పరామర్శించుకొని, కర్తవ్యమేమిటో కూడబలుకుకొని, ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిన తరువాత సావకాశంగా ఈ విషయాలు నెమరువేసుకొని ఇదమిద్ధంగా ఏవో నిర్ణయాలు చేసుకోడానికి వీలుగా మాట్లాడుకొన్న విషయాలే ఇందలి వస్తువు.

సంకలించింది పిచ్చాపాటి కబుర్లే అయినా, ఈ రచనలలో శ్రీమతి లక్ష్మీరమరామ్‌గారి బహుముఖ ప్రజ్ఞా, విషయ విమర్శలో ఆవిడకుగల నిశితధీశక్తి, ఎంతటి కటు విషయమైనా, నొప్పించక? తానొవ్వక, కమ్మ కమ్మగా చెప్పగల రచనాపటిమా, మాటల కూర్పుతో మంచి మంచి చమక్కులు విసరడంలో ఆవిడకుగల చాతుర్యమూ, అన్నిటీమించి సంఘాభ్యుదయమందు ఆవిడకుగల గాఢకాంక్ష అనేకవిధాలుగా ద్యోతకమవు న్నాయి. సరసహాస్యరచనలో కూడ ఈవిడ సిద్ధహస్తురాలని ఇందలి ఒక్కొక్క రచనా, ఒక్కొక్క పంక్తి ఘంటాపదంగా చాటుతున్నాయి. ఇందులోని ఇరవై రెండు రచనలకూ పెట్టిన చదువుకొన్న వానికంటె చాకలి మేలు, పాపం, మగవాడు, పొరుగింటి పుల్లకూరరుచి, కలడుకలండనెడివాడు కలడోలేడో, దొంగలుపడ్డ అరు నెలలకు కుక్కలు మొరిగినవట. నేర్చుకొనవే నీరజాక్షి, ఖబడ్దార్, వంటి శీర్షికలు కూడ ముఖావంగా ఉన్న పాఠకులను సైతం చదవడానికి కవ్వించేవిగా ఉండి రచయిత్రి కవితాధోరని చాటుతున్నాయి.

ఇందలి ఒక్కొక్క రచనా స్త్రీజాతి కంతటికి ఎంతో ఉద్బోధకంగా, ఆత్మ విమర్శనకు మార్గదర్శకంగా, కర్తవ్యాలకు కనువిప్పుగా ఉంది. విషయగ్రహణకూ విమర్శకేకాక విజ్ఞానానికీ వినోదానికీ కూడ సహాయపడ గలిగి ఉండడం ఇందలి హాస్యరచనలలోని మరొక విశేషం. స్త్రీలను గురించి స్త్రీలు చెప్పుకొన్న విషయాలే అయినప్పటికీ ఈ రచనలు మగవారికి సైతం ఆత్మవిమర్శనావశ్యకతనూ, స్త్రీల విషయమై బూజు పట్టి పోయిన తమ దృక్పథాలను కాలానుగుణంగా మార్చుకోవలసిన ఆవశ్యకతనూ, పనిలో పని ఆనందాన్ని సమకూర్చేవిగానూ కూడ అయి ఉన్నాయి, ఈ రచనలలో మగవారికి గూడా చల్లచల్లగానే కొన్ని చురకలు తగిలాయి.

ఇందు విమర్శింపబడిన విషయాలలో కొన్ని మహిళాభ్యుదయానికి తోడుపడేవి. కొన్ని అక్రమ ప్రవర్తనలకు అలవాటుపడిన పురుషులకు ములుకుల వంటివి, కొన్ని ప్రస్తుత సంఘానికి కనువిప్పు నిచ్చేవి, కొన్ని సర్వసామాన్యంగా స్త్రీ పురుషుల చిత్తప్రవృత్తులను నిరూపించేవి. కొన్ని నీతిని బోధించేవి, కొన్ని కేవలం పరిహాస ప్రధానాలు.

మొత్తంమీద, ఇది ఆదీ అని కాకుండా, అన్నిరచనలూకూడ హాయిగా చదువుటకూ, చదివి మనసారా ఆనందించుటకూ, ఆనందించడమేకాక మరిమరి మననం చేసుకొని మానసికంగా ముందుకు వెళ్ళుటకూ తోడ్పడ గలవిగానే ఉన్నాయని నిష్కర్షగా చెప్పవచ్చు.

ఆంధ్ర మహిళాలోకమూ, ఆంధ్ర మహాజనులుకూడా, ఈ పుస్తకాన్ని తప్పకుండా ఆదరించి తీరుతారు, సందేహమేమీలేదు.

రచయిత్రి యిలాగే ఇంకా కొన్ని గ్రంథాలు పాఠక లోకానికి అందించి సంఘానికీ, సాహిత్యానికీ, ఇతోధికంగా సేవచేయగలదని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని చెన్నపురి —మైలాపూరులోని ఆంధ్ర మహిళా సభవారు ప్రచురించారు.

(ఆల్ ఇండియా రేడియో ప్రసారితం)



# మాతృమూర్తి



మాతా శిశువులు ప్రకృతిలో, జీవన ప్రవంతిలో అంతర్వాహినులు. కాలాలు మారినా వీరి గాథలు శాశ్వతాలు.

మాతాశిశు సంక్షేమ పథకాలకి సాంఘిక సంక్షేమ సంస్థలన్నీ ప్రాముఖ్యాన్నిస్తున్నాయంటే అందులో అతిశయోక్తిలేదు. పిల్లలక్షేమం ముందు మిగిలినవన్నీ అంత ముఖ్యమైనవి కావు. ఈనాటి బాలలు రేపటి పౌరులుకదా? వారిని రూపుదిద్దడం మనవిధి.

ఈ చిత్రంలో గ్రామసేవిక మాతృమూర్తికి సలహా లివ్వడాన్ని చూడవచ్చు.

## కన్నుల పండువ చేసే

# చిత్ర లేఖనము

కుమారి కె. దివ్యజ్ఞాన సరోజనీదేవి

'కళ' అను పదమును మనలో పెక్కురు నిత్యము వింటున్నను దానిని సర్వ సామాన్యముగా చిత్రకళను నిర్దేశించటానికే వాడుదురు. కాని సంగీత, నృత్య, సాహిత్య, నాటకాదులన్నియు కళలె! ఈ భ్రమ కేవలము 'కళ, అను పదమునందేగాక 'చిత్రకళ'ను పదమునందును తరుచూ సంభవించుచుండును. చిత్రకళ నిన రూప చిత్రములు. కుడ్య చిత్తరువులు శిల్పములు మాత్రమే కావు. చక్కటి పాత్రలు. ధూళి, పుష్ప చిత్రములు నేత, కడకు గృహాలంకరణ దేహాలంకరణ యివన్నియు 'చిత్రకళ'నే వ్యక్తపరుచును. ఇవన్నియు మనకు హృదయానందము కలిగించి, తద్మూలమున వాటి యందు గల చిత్రకళను వెల్లడి చేయును. వీటిని ఆంగ్లమున, 'ఆబ్‌స్ట్రాక్ట్ ఆర్ట్' అందురు.

మృణ్మయ పాత్రలు అనాది నుండి యున్నవే. మానవుడు మతలిపి సాహిత్యాది విషయముల గూర్చి తెలుసుకొనక పూర్వమే ఈ పాత్రలను సృష్టించెను. ఈ పాత్రలు మానవుని చిత్రకళా నైపుణ్యమునకు, ఇంద్రియ జ్ఞానమునకు మృదు హృదయమునకు, శీఘ్రగ్రహణమునకు నిదర్శనములు. ప్రాచీన చిత్రకళలకు ఆటపట్టయిన, గ్రీస్, చైనా, భారత దేశములందు ఈ మృణ్మయ పాత్రలంటే ప్రప్రథమముగా చిత్రకళకు స్థానము లభించెను. ఈ పాత్రలను మొట్టమొదట మానవుడు గోమయములో చేసి ఎండబెట్టెడివాడట. నిప్పు, కుమ్మరి చక్రము మొదలగునవి కనుగొనిన పిమ్మట మట్టిలో చేసి గట్టిగా నుండుటకై నిప్పుపై కాల్చబడినవి. కానీ మృణ్మయ పాత్రలందు చిత్రకళందు కలదను సందేహము కలుగుట సహజము. పాత్రలు తిరిగిన వంపులలోను, ఆకృతిలోను, వాటిపై. చిత్రింపడిన, ఈ బొమ్మలలోను చిత్రకళ గలదు. ఇట్టి చిత్రకళ కొన్ని లోహపు పాత్రల యందును కలదు ధూళి, పుష్ప చిత్రములందును అత్యున్నత చిత్రకళ వ్యక్తపరచ బడుచున్నది. అనేక ర్ణముల చూర్ణముతో వేసిన రంగవల్లులే ఈ ధూళి చిత్రములు: పుష్పాలంకరణములు పుష్ప చిత్రములన బడుచున్నవి. దీనికే జపాను దేశములో ప్రత్యేక పాఠశాలలు గలవు. నేతకు చైనా, భారత, జపాను దేశములు ఎంత ప్రసిద్ధములో అందరకి తెలిసినది. ఆ వస్త్రములందలి వృక్ష, పశు, పక్షిరూపములు ప్రత్యేక నిదర్శనములు.

చిత్రకళందు మూడుస్థాయిలు కలవు. ఈ మొదటిది మన ఇంద్రియములకావస్తువు, దాని ఆకృతి వర్ణములు గోచరించుట. మన ఇందియములు ప్రపంచ యందున్న సర్వ వస్తువులపైననూ మక్కువ చూపించవు కొన్నిటపైనే వాటికి మక్కువ కలగవచ్చును. ఈ మక్కువ కేవలమూ అవును ఆకృతిపైనే గాక, వాటి వర్ణముల మీదను అవి అమర్చబడిన విధానము మీదను ఆధారపడి యుండును. ఒక



బహుశా క్రీస్తు పూర్వం 2 వ శతాబ్దికి చెందిన చైనీయుల బంగారు సింహం.



ప్రాచీన మృణ్మయ పాత్రలు.

మన ఇంద్రియములకొక వస్తువు ఆకృతిపై మక్కువ కలిగినను, అది యితర వస్తువులతో అమర్మ్బడిన బడిన విధానము నచ్చకపోయిననూ, దాని వర్ణములు నచ్చకపోయిననూ, మనకా వస్తువుపై కలగజాలదు. కావున మన ఇంద్రియ జ్ఞానము 'చిత్రకళకు' నాంది ప్రస్తావన చేయును. ద్వితీయ స్థాయిలో మన ఇంద్రియములకు ఈ విధముగా మక్కువ కలిగిన వాటిని మనకు హృదయానందము కలిగించు ఆకృతులలోను. రీతులలోను చిత్రించుట. తృతీయము భావ చిత్రీకరణ. ఈ మొదట రెండు స్థాయిలలో 'సుందర' మను పదము అంతమగును. దానికి మూడవ స్థాయిలో స్థానములేదు. భావము సౌందర్యమునకు. అతీతము. పలువురీ విషయము స్పష్టముగా తెలుసుకొనక పోవుటచేతనే అనేక భ్రమలకు అవకాశము కలుగుచున్నది.

ఇందు ప్రథమ సోపానమైన ఇంద్రియ జ్ఞానము గూర్చి యింతకన్నను చెప్పవలసిన దేమియులేదు. కాని రెండవదైన 'ఆకృతి' గూర్చి ఎంతైనా కలదు. ప్రప్రథమముగా మనము 'ఆకృతి' అనగానేమి? అవెన్ని రీతులు?, ఏయే వస్తువులా ఆకృతిని కలుగచేయుటకు దోహదమిచ్చును అని తెలుసుకొన వలసియున్నది. వస్తువు యొక్క పరిమాణ, రూపములూ, అది చిత్రపటమునందు యితర వస్తువులతో అమర్చబడిన రీతిరేం 'ఆకృతి' యని సర్వసామాన్యముగా అనుచున్నప్పటికిని' ఆకృతి యనునది కేవలము మన సహజ జ్ఞానమువలదే తెలుసుకొనగలమనుట సరైన వ్యాఖ్యానమనిపించుకోగలదు. ఈ 'సాపేక్ష' 'ఆకృతి' 'స్వతంత్ర ఆకృతి' అని రెండు విధములైన ఆకృతులు గలవు, సాపేక్ష ఆకృతి' ప్రకారము చిత్రకారుడు ప్రకృతిలోనున్న వస్తువు యొక్క విభాగముల పాళ్ళను గ్రహించి ఆ పాళ్లకనురూపముగా ఆ వస్తులను తన చిత్రమునందు చిత్రించును 'స్వతంత్రాకృతి' ప్రకారము చిత్రకారుడు స్వతంత్రించి ప్రకృతిలోనున్న వస్తువుకు అనురూపముగా గాక సాంకేతికముగా చిత్రించును. మానవుని యందు సహావుండు ఇంద్రియ అంతర జ్ఞానములు, బాహ్యావస్తువులచే మానవునిలో ప్రేరేపింపబడి ఆలోచనా లోకస్థమైన భావము ఈ 'ఆకృతి' చిత్రీకరణకు దోహదమిచ్చు చున్నవి.

గ్రీకులు ఈ ఆకృతి సూత్రము నాధారము చేసుకొని తమ చిత్రశిల్పములందు 'రేఖాగణితమును' ప్రవేశపెట్టిరి. సరైన ఆకృతులు చిత్రమునందు ఏకస్వనము కలిగించును గావున అట్టి ఏకస్వనము కలిగించు ఆకృతులేవో వారు నిర్ణయించిరి. ఇదియే చిత్రరచనందలి 'రేఖాగణితము' ఈ సూత్రములనేకముగా నున్నవి. వాటిలో వొక సూత్రమైన సమకోణ చతురస్రమమునందు చదరముగా చిత్రించుట పాశ్చాత్య చిత్రములందూ తరుచు అగుపడుచునే యున్నది. కాని అందరు ఈ సూత్రములనే పాటించి ఏకరీతిన చిత్రించిననూ, అదీ విసుగే కలిగించును, అందుచే కొందరు చిత్రకారులీ సూత్రములను వ్యతిరేకింతురు. ఇట్టి వ్యతిరేకమునందు అందము, ఆనందమునూ కలవు. ఇట్టివ్యతిరేకమెట్టి హద్దువరకు జరగవచ్చునన్నది మన జ్ఞానము చేతనే నిర్ణయింపబడుచున్నది. విరూపము యిట్టిదే. కేవలమీ "రేఖాగణిత" సూత్రములను వ్యతిరేకించుటయే గాక, ప్రకృతి యందలి వస్తువుల విభాగముల రూపములకు విరూపములు కూడ అనేక చిత్రకారులు చేయుచున్నారు. ఈ విరూపములు కలుగ రెండు విధములగా నుండును. (1) విరూపము కలుగ చేసినను, ఆ వస్తువు సహజముగా నున్నదని మనకు భ్రమ కలిగించుట. గ్రీకు శిల్పములిట్టివే, (2) విరూపము కలుగచేయుటచే మొదటిదానివలె యిదీ హృదయానందము కలిగించినను ఆ వస్తువందలి సహజత్వలోపము స్పష్టముగా కనబడుట. ఇందు మొదటి విరూపముకెవ్వరు ఎట్టి అభ్యంతరము చెప్పరు. రెండవ విరూపము గూర్చే పలువురు విమర్శించుటకు వెనుదీయరు. ఇందులకు పైనిచ్చిన చిత్రమునందుగల చైనీయుల సింహము ఒక ఉదహరణ-అది ఒక గొప్ప కళాఖండం. ప్రతి వంపులోను భావము తొంగిచూచునే యున్నది. కానిప్రకృతిలోనున్న సింహము మనస్సులో మెదిలివప్పుడు అది సింహమె గాని గుఱ్ఱము కాదని ఎవరు అనగలము! ఇట్టి విరూపము కేవలమంతర జ్ఞాన, భావముల చేతనేగాక. ఐహిక, పరమార్థిక విషయముల చేతను ప్రేరిపింప బడుచున్నది. ఒక చిత్రపటమునందు ఐహిక పరమార్థిక చింతనలను చిహ్నరూపముగా చిత్రించుటకు ఆ చిత్రములందలి వస్తువుల రూపములు 'విరూపము' చేయుట తప్పనిసరి.

'ఆకృతి' గూర్చి సంపూర్ణముగా తెలుసుకొనవలయునన్న ఒక చిత్రపటము నందుగల వస్తువుల యొక్కగాని, వర్ణముల యొక్కగాని పరస్పర బాంధవ్యరీతి గూర్చి కూడ

తెలుసుకొనవలసియున్నది. ఇది సమభాగ రూపత్వము 'విభాగరూపత్వము' అను రెండు విధములగానుండును. ఇందు మొదటి విధానము ప్రకారము చిత్రమునందు ప్రతిమలనుగాని వర్ణములనుగాని సమానాంతరముగాచిత్రింతురు. రెండవ విధానము ఇందుకు వ్యతిరిక్తము. దీని ప్రకారము చిత్రపటమునందు ప్రతిమలు వర్ణములు సమానాంతరముగా కాక చిత్రపటము నందంతటను అచ్చటచ్చ పరచినట్లు చిత్రింతురు. ఈ విధానము వలన కూడ చిత్రమునందు చక్కటి సమత్వము గలుగును.

చిత్రపటమునందు వివిధ వస్తువుల పరస్పరరీతిగా అవియా చిత్రమందు అమర్చబడిన రీతులు కూడ మిగుల ముఖ్యము. ఈ రీతుల ప్రకారము చిత్రములను 'అంతమగు చిత్రములు' 'అనంతమగు చిత్రములు' అని రెండు విధములగా విభాజించవచ్చును. మొదటి దాని ప్రకారము చిత్రమునందు చిత్రింప దలుచుకొన్న వస్తువులను సంపూర్తిగా చిత్రింపవలయును. రెండవ విధానము ప్రకారము చిత్రమందు చిత్రింపదలుచుకొన్న వస్తువులందలి కొన్నిటి విభాగములను (కొన్ని మాత్రమే యనునది గమనించవలయును) సంపూర్తిగా కాక సగమో, ముప్పాతికో చిత్రించును. ఉదహారణకు చిత్రకారుడొక కుటీరము, దాని ప్రక్కన సొంపుగా వంగియున్న ఓ వృక్షమును చిత్రింప దలుచుకొన్నాడనుకొందుము, అప్పుడాతడు ప్రథమ విధానము ననుసరించిన ఆ కుటీర వృక్షములు రెండింటిని సంపూర్ణముగా చిత్రించును. కాని రెండవ విధానమవలంభించిన ఆ కుటీర వృక్షములలో నేదోనొక దానిని మాత్రము సంపూర్ణముగా చిత్రించి రెండవదానిని సగము మాత్రమో, లేక పాతిక భాగము మాత్రమో చిత్రించును.

ఈ విధముగా చిత్రమునందు 'ఆకృతి' యనునది ముఖ్యాంశమైననూ, భావ రహితమైన ఆకృతి చిత్రకళ నిపించుకోలేదు. ఏదో ఒక ఆకారమును గీసినంతనే అది చిత్రమవదు. అందు రూపత్వ సమత్వములెగాక భావము కూడవుండి తీరవలలోను. గృహనిర్మాణ చిత్రమునందు కూడ అకృతులు గలవు. కాని అందులో భావమెచ్చటగలదు. అందుచేతనే దానిని 'చిత్రకళని' ఎవ్వరు అనరు. ఈ భావమనగానేమో వివరముగా పాశ్చాత్యుల కైనా చెప్పవలయునేమో గాని మనవారికది కొట్టినపిండే! భావమును చిత్రించుటకు ఆకృతి యొక మార్గమే. కానంత మాత్రముచే భావము కేవలమాకృతిలోనే యిమిడి యున్నదనుటకు వీలులేదు. వర్ణములు ఆనందము. కొన్ని మన స్తాపము, కొన్ని మనశాంతి మరికొన్ని ఉత్తేజము, రోషము కలుగచేయును. ఆ విధముగనే చిత్రకారుడు కూడ వర్ణముల ద్వార తన భావములను చిత్రీకరించగలడు. కానిచ్చట ఒక్క నియమము గమనించదగినది- కేవలమొక రంగు ద్వారానే ఏ భావము చూపించలేరు. అది మరి కొన్ని వర్ణములలో కలిసియున్నప్పుడే దానికర్థము కలుగును.

చిత్రరచనందు రేఖలు మిగుల ముఖ్యము. అనాదినుండి అనగా మొట్టమొదట గృహలందు నివసించుచున్న మానవుడు చిత్రించుట మొదలిడిన నాటినుంచి ఈ లేఖా చిత్రములు వాడుకలోనున్నవి. ఇదే ఆకృతి చిత్రణలో ప్రధాన సిద్ధాంతము. అందుచేతనే బాలబాలికలు ప్రప్రథమముగా బొమ్మలు గీయునప్పుడు ఈ విధానమునే అవలంభింతురు. ఈ రేఖల మందమును హెచ్చించుట. తగ్గించుట వలననూ; దృఢముగానో, తేలికగానో గీయుటవలననూ, చిత్రకారుడు చిత్రమునందు వస్తువునకు రూపము, ప్రమాణము, ఘనపరిమాణమేగాక, ఆ చిత్రమునందు ఆ వస్తువునకు గల విలువ, భావము మొదలగునవి కూడ వ్యక్తిపరచగలడు. చిత్రమునందలి ప్రతిమ యొక్క కదలికను సైతము కేవలమీ రేఖలతోనే తెలియపర్చవచ్చును. ఈ విధానము ప్రాచీన చిత్రములన్నిటియందును అవలంభింపబడినది ప్రాచీన గ్రీకు శిల్పములందె యివి స్పష్టమే. జపాను, చైనా చిత్రకారులీ నాటికి ఉ విధానమునే అవలంభించుచున్నారు. మన దేశ చిత్రకారులు సైతము ప్రాచీన చిత్ర, శిల్పములందును ఈ విధానమునే అవలంభించిరి. అజంతా కుడ్యములందు ఈ విధానమునకు ఒక విశిష్ట స్థానము కలదు. అందు ఈ రేఖలనుపయోగించి నంత నేర్పరితనముతో మరియెచ్చట నుపయోగించబడలేదనియే చెప్పవచ్చును. ఇందులకు మొదటి గృహందు గల అవలోకితేశ్వరుని విగ్రహము చక్కటి ఉదహారణ.

ఇట్టి ఈ రేఖా చిత్రములను పాశ్చాత్యులు కూడ శ్లాఘించియున్నారు. 'పికాసో' వంటి ఆధునిక చిత్ర



జపనీయుల మానుపై చెక్కిన చిత్రము,

కారులు కూడ రేఖా చిత్రములందు నిపుణత్వము సాధించిన పిదపే ఆధునిక చిత్రములు మొదలిడిరి.

కేవలమీ రేఖల మందమును హెచ్చించుట తగ్గించుట చిత్రకారుడు కొంతవరకు చిత్రపటమునందలి వస్తువందుగల వెలుగునీడలను చిత్రింపగలిగినప్పటికి నల్లని వర్ణములోగాని, వేరు వర్ణములలోగాని చూపినంత స్పష్టముగా చూపలేదు. వెలుగునీడలను చూపు ఈ విధానము పాశ్చాత్య దేములలో నెక్కువున్నది. తూర్పు దేవములందును ఈ పద్ధతి అవలంభించపడినప్పటికి, అది అత మితముగా ననుసరించిరి.

రేఖల, వెలుగునీడలు ద్వారా చిత్రపటమునందలి వస్తువు కాకృతి తేగలిగిననూ, వర్ణముల వాడుట ఆ ప్రతిమ యొక్క ఆకృతిని మరింత స్పష్టము చేయును. ఈ వర్ణములు 'సహజ వర్ణములు, 'దూత వర్ణములు' 'ఏకస్వన వర్ణములు' 'స్వచ్ఛ వర్ణములు' అని నాలుగు విధములగానున్నవి. ఇందు 'సహజ వర్ణముల'నగా చిత్రమునందలి వస్తువులకు వాటికి ప్రకృతిలో సహజముగానుండు వర్ణములనే వేయుట. ఈ విధానము ఎక్కువుగా వాడుకలో లేదు. గుహలందు నివసించుచున్న మానవుడు ప్రప్రథమముగా చిత్రకళ ప్రారంభించినప్పుడు సైతము ఈ విధానమును వాడలేదు. పాశ్చాత్య చిత్రకారులు కొందరు మాత్రము 'స్టిల్ లైఫ్' చిత్రములు చిత్రించునప్పుడు, ఈ విధానమునే వాడిరి. కానిది ఎక్కువుగా వాడుకలో నుండకపోవుటకు కారణము, మనకు ప్రకృతందలి వర్ణములు సహజముగా వున్నప్పటికి అవి సహజముగా లేవను భ్రమ కలుగుటయే. ఇందువలనే రెండవ విధానమైన 'ఘూత వర్ణములు' ఎక్కువ వాడుకలో నున్నవి. ఈ పద్ధతినే మానవుడు ప్రప్రథమముగా తన చిత్రకళందు అవలంభించెను. ఈ పద్ధతినే యిప్పటికిని బాలబాలికలు తమ చిత్రములందు అవలంభింతురు. ఈ విధానము ప్రకారము వర్ణములు సాంకేతికముగా వాడబడును.

ఇవన్నియు చిత్రకళందలి ముఖ్యాంశములే అయినప్పటికి వీటిని, మేళవించి చిత్రమునకు పరిపూర్ణత తేగల అంశమొక్కటి యున్నది. ఏ చిత్రపటమునందైనను ఈ వివిధ మూలపదార్థములకు ఆవ్యయవానుసంబంధము కలుగచేయని యెడల ఆ చిత్రము పరిపూర్ణత పొందలేదనియే యిప్పటికి చిత్రకారులు ధృఢముగా నమ్ముచున్నారు. చిత్రరచనందు యిట్టి విశిష్టస్థానమును పొందినది చిత్రకారుని 'వ్యక్తిత్వమే' చిత్రమునందు వుండవలసిన లక్షణములన్ని యున్నను, అందు చిత్రకారుని వ్యక్తిత్వము ప్రతిబింబింపని యెడల ఆ చిత్రము రాణింపదు. బౌద్ధ, గోల్ ల చిత్రకళ నాటికి చిత్రరచనందు ఈ అంశము లేదని అభిప్రాయపడుచున్నారు. కాని ఈ వ్యక్తిత్వము యొక్క ప్రాముఖ్యత "రినైసాన్స్" కాలమునుండి రానురాను పెరుగుచున్నది. ఇచ్చటొక్క విషయము చెప్పవలసి యున్నది. ఈ వ్యాసమందు చిత్రకళందలి ముఖ్యాంసములను పేర్కొనునప్పుడు తరుచు చిత్రపటములనే ఉదాహరణగాగైకొన్నాను. ఇందులకు కారణము, నేను 'చిత్రకళ' అనిన కేవలము చిత్రిపటములే అను భ్రమలో పడుటయూగాదూ, యితర చిత్రకళలందు ఈ అంశములు లోపించుటయూ కాదు. చిత్రపటములందు ఈ అంశములను వివరించుట సులభమగుటయే దీనికి కారణము. ఇతర కళలందీవిధముగా వివరించుటయు కష్టమే. వివరించిననూ చిత్రకళందు ప్రవేశములేనివారికి దానిని గ్రహించుటయూ కష్టమే. కావున ఈ అంశములు కేవలము చిత్రపటములందేగాక, అన్ని చిత్రకళలందును వున్నవని గ్రహించవలయును.

'చిత్రకళ' గూర్చి ఈ వ్యాసము ముగించుబోపల మరియొక్క విషయము చెప్పక తప్పదు. 'కళ'లను దానిని గాని 'చిత్రకళ' అను దానినిగాని ఎంత ప్రయత్నించినను మాటలలో వివరించి చెప్పలేము. ఒకవేళ చెప్ప ప్రయత్నించిననూ ఎంతవరకు సఫలీకృతులము కాగలమను నది ప్రశ్నే మన అంతరజ్ఞానము చేతనే ఈ విషయము గూర్చి యింకను స్పష్టముగా తెలుసుకొనగలము. ఒక చక్కటి చిత్తరువును చూసిన తక్షణమే 'ఆహా' ఏమి కళాఖండ' అనుకొందుము. కాని వెంటనే ఎవరైన 'ఎందుచేత' అని ప్రశ్నించిన యెడల ఎంత కళాకారులైన కొన్ని నిముషములు ఆలోచించి, తమ మనస్సులందు వాటిపై తర్జనభర్జనలు గావించుకొని గాని సమాధానమీయలేదు. అదేవిధముగ చిత్రకారుడు చిత్రమును చిత్రించునప్పుడు అందులో ముఖ్యాంశములన్ని వున్నవా, ఏవైన జారిపోలేదుగ దాని శోధించి ఆలోచించి చిత్రించుడు! అతను తన అంతరజ్ఞాన ఆజ్ఞలనే పాలించును. అదే కళాపుంజము. ఆ చిత్తరువునందు చిత్రకారుని ఆలోచనా ప్రమేయము లేకుండగనే చిత్రరచనందలి ముఖ్యాంశములు కలిగియుండును. అది యెట్లు సంభవమన్న ప్రశ్నకు మనము ఆలోచనా శక్తితో జవాబీయలేము. దానికి సమాధానము మన అంతరజ్ఞానముకే తెలియును. ఏ భాషలోని మాటలు ఆ విషయమును గూర్చి అంతకన్నను విపులముగా చెప్పలేవు. కావున పై చెప్పిన చిత్రకళాంశములన్ని కేవలము మాటలలో చెప్పగలిగినవే. అట్లు వ్యక్తపరచలేని అంశములు చిత్రకళల ఎన్నో కలవు. అట్టివాటిని ఎవరికి వారు తమ అంతరజ్ఞానమువలననే తెలుసుకొనవలసియున్నది.

ఈ విధముగా చిత్రకళో మహార్ణవమువంటిది. అందు ప్రవేశించిన వస్తు సముదాయమునకంతులేదు. అందు చొచ్చుకొనిపోయిన వారికి తుదియనునది యింతవరకు కానరాలేదు, యికముందు కానరాబోదు. ★

ద్విపద కావ్యం :

# లంకాయాగం

**మానవ హృదయాధి దేవతలు సీతారాములు**
**వారి వియోగానికి పరితపించని స్త్రీ హృదయం ఉండదు**
**వారి సంతోషాన్ని పంచుకోని హృదయమూ వుండదు——**

భాషయావత్తూ, సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము, అను మూడు తరగతుల క్రింద విభజింపబడినది. కావ్యములకు చెందినది 'సాహిత్యమనియు', శాస్త్రాదులకు చరిత్రములకు సంబంధించినది సారస్వతమనియు, తదితర వ్యావహారికములకును, సంభాషణములకును చెందిన భాషయావత్తూ వాఙ్మయమనియు వ్యవహరించుచున్నాము. అసలు భాషకు భావముకదా ప్రధానము. అట్టి ప్రధాన లక్షణము గలిగిన భాషతో నేర్పడిన ద్విపదలే "లంకాయాగము" "కుచ్చలకధ" "లక్షణదేవరమూర్ఛ" మొదలగునవి. ఈ వాఙ్మయము యిప్పుడు వాడుకలో లేకపోవచ్చునుగాని అది జీవము ఉట్టిపడు వాఙ్మయము.

స్త్రీకి సృష్టిలో ప్రత్యేక స్థానమున్నట్లే, వారు పాడిన పాటలలో ఆడిన మాటలలో ఒక విశిష్టతకూడ ఎప్పుడూ ఉంటూవచ్చింది. అక్షర జ్ఞానములేని కాలములో స్త్రీలకు అనువైన వాఙ్మయముకు నిర్ణయించి సులభశైలిలో రసవంతముగా భావోద్రేక ప్రధాన లక్షణముగల భాషను సృష్టించియున్నారు. చదువను వ్రాయను తెలియకపోయినను, పలువిధములగు గాధలను, పాటలుగాను, ద్విపదలుగాను, ఒకరినుండి ఒకరు నేర్చుకొని పాడుకొనుచుండెడివారు. ఈ పాటలకు భావమే ప్రధానమనియు భాష సామాన్యమనియు రసోత్పత్తియే పరమావధియనియు చెప్పవలసియున్నది. ఎన్నియో సాంఘిక ధర్మములు, సాంప్రదాయములు, నీతులు, శాస్త్ర విషయములు వాడుక భాషతో చక్కగా పొదుగబడి, వినసొంపుగా నుండుటయేగాక కవి జ్ఞానముకూడ నిచ్చునట్టి వాఙ్మయమును సృష్టించి స్త్రీల కందచేసినారు.

లంకాయాగము యీకోవకు చెందినదే. ఇందులోని కధ అందరికీ తెలిసిన రామాయణము సీతా రామ లక్ష్మణులు పదునాలు గేడులు వనవాసము చేయుటకై బయలువెడలుట మొదలు రామరావణయుద్ధము, రావణ సంహారము వరకూ గల కధ యిందు పొందుపరుచబడినది. హనుమంతుడు లంకను దగ్ధమొనరించుట ప్రధాన విషయమగుటచే దీనికి "లంకాయాగమని" పేరు వచ్చినది.

శ్రీరాముడు వనమునకు ప్రయాణమై తల్లివద్ద సెలవు తీసుకొనుటకు వస్తాడు—వచ్చి

అమ్మ మన బ్రతుకులు అడవిలో తపసులు ఆయెనని
విన్నవించె
పదునాలుగూ యేండ్లు తల్లిచే తన్నమ్ముతగు మోక్ష
మని పలుకగా

అమ్మా! నీ చేతి అన్నం పదునాలుగేండ్లు తినే భాగ్యం నాకు లేకపోతోంది. తాపసి వేషంలో అడవులలో సంచరించవలసిందని తండ్రిగారి ఆజ్ఞ! వెళ్ళివస్తానంటాడు.

అప్పుడు కౌశల్య తాను కూడా వస్తానంటుంది. దానికి శ్రీరాముడు

పతిని విడిచీ తల్లిసుతుల వెంటావస్తె! లోకులేమందురమ్మా
లోక దూషణ నీవు చాల పొందెదు తల్లి తగదు యిట్లని
పల్కెను

వెంట వస్తానన్న తమ్ముణ్ణి కాదనలేక, లక్ష్మణునితో

తన వెనుక తమ్ముణ్ణితా తిరిగి చూచియో అనుజుడా అని
పిలిచెను

శ్రీమతి జి. సుందరీశంకరం

ఒప్పుగా మీ తల్లి సుమిత్రతో బోయి ఒక మారు జెప్పి
రమ్మి

లక్ష్మణుడు అన్నగారి ఆజ్ఞ ప్రకారం తల్లియైన సుమిత్ర దగ్గర సెలవు తీసుకోడానికి వెళ్ళినప్పుడు ఆమె తనకు మారుణ్ణి యిలా దీవిస్తుంది !

శ్రీరాము తండ్రిగా సీతమ్మ తల్లిగా భావించు లక్షుమన్నా
ప్రొద్దు ప్రొద్దున లేచి వదిన పాదంబులకు దండమైనా
బెట్టుమీ
తోటల్ల పండ్లన్ని దొన్నెల్ల వెట్టుకొని ముందుగా దెచ్చి
యిమ్మీ
పదునాలుగూ యేండ్లు తల్లి పోగా మీరు కలయరమ్మని
పలికెను.

ఇక సీతాదేవి దగ్గరకు రాముడు వెళ్ళినప్పుడు ఆమెతనతో రాక తప్పదని చెప్తుతూ :

మానుపారినతీగ మాను దప్పినవెనుక మరియెట్లు నిలువ
గలదూ
చమురులేని దివ్వె యెంతకాలము రామ వెలిగేది యని
పలికె
ఆ పలుకులూ విని రాముడతివేగాన వనములకు పయిన
మాయె
ముందరా శ్రీరాము వెనుకనూ లక్ష్మన్న నడుమ జానకి
దేవియు.

ముగ్గురు బయలుదేరి చిత్రకూట పర్వతం దగ్గర పర్ణశాల నిర్మించుకొని కాలక్షేపంచేస్తూంటే చుప్పనాతియనే రాక్షసిరావడం, దాని ముక్కూ చెవులూ కోసి లక్ష్మణుడు పరాభవించడం జరుగుతుంది. అది భరించలేక అన్నయైన రావణుని దగ్గరకు వెళ్ళి, అన్నా !

మండోదరీకన్న మరిచక్కనీకన్య లోకానలేదురన్నా
ఇందరీస్త్రీలలో వెదకి చూచినగాని అటువంటికన్యలేదు
ప్రొద్దునాపోదురు మాపిటికివత్తు మరిదిక్కులేదురన్న
ఏవిధంబుననైన వాని సతిని నీవు తెచ్చుకొమ్మని పలికెను.

అప్పుడు రావణుడు ఒక పన్నాగం పన్నుతాడు- సీతను అపహరింప నిశ్చయిస్తాడు. అప్పుడు మారీచుడు బంగారు లేడి రూపంలో సీతారామలక్ష్మణులుండే పర్ణశాలకు వస్తాడు. ఆ లేడిని తెచ్చిపెట్టమని రాముని వేడుకుంటుంది. ఆ మాయలేడిని తరుముకుంటూ రాముడు వెళ్ళిపోతాడు. రామబాణానికి తాళలేక "హా లక్ష్మణా" "హా సీతా" యని అరుస్తూ ఆలేడి చనిపోయింది. పర్ణశాలలో వున్న సీతా లక్ష్మణులు యీ కేకను వింటారు- గుండె ఝల్లుమంటుంది- సీత విలపిస్తుంది. అన్నగారి సహాయార్థం తమ్ముడు లక్ష్మణుని వెళ్ళమంటుంది. లక్ష్మణుడు ధీరుడు- వీరుడు. ఆగతానాగతములు తెలుసుకొనగల సమర్థుడు. ఇది రాక్షస మాయగా తెలుసుకొని, సీతను వంటరిగా విడిచి వెళ్ళుటకు సందేహిస్తాడు. అపుడు సీత స్త్రీ సహజమైన భావోద్రేకానికి లోనై దూషిస్తుంది. అపుడు లక్ష్మణుడు మాటలను సహించలేక

తాటాకుమంటవలె పలికెనులక్ష్మన్న ఏమగిరులేవ్రాసెను
ఎంతపనిసీకున్న అమ్మగోసీవైన రాగిరులుదాటవద్దు
అనిచెప్పిసౌమిత్రియేగెనూ. తనయన్న వెళ్ళినాజాడబట్టి

నిశాచరుల కాలవాలమైన ఆ అడవిలో నిస్సహాయంగా సీత వుండిపోతుంది. విధి విలాసాన్ని ఎవరు తప్పించగలరు? పదునాలుగేండ్లు భర్తను విడిచి అహోరాత్రములు అశోకవనంక్రిదంశోకిస్తూ పరపురుషుని చెరలో వుండవలసిన ఆమె విధిని యెవరు తప్పించగలరు?

ఉగ్గంబుముంతకు ఉగ్గంబుగట్టుకొని పచ్చబెత్తము పట్టుకు-
పేదవులూదడుపుచూ పేదబ్రాహ్మణునివలె వారభిక్షులు
అడిగెను
కటకటా యిదియెంత కర్మమొచ్చిందని పళ్ళుదోసిట
బట్టెను
పాపిష్టిరావణుడు పదితలలుచూపితే పడిమూర్ఛపాయె.

ఆమెను రావణాసురుడు లంకకు తీసుకొనిపోయాడు. దారిలో వైనతేయుడైన గరుత్మంతుడు అడ్డగించి లాభం లేకపోతుంది. తన భర్తకుగాని, తన మరదికిగాని, తన దురవస్థ తెలపటానికి కూడా ఆమెకు అవకాశంలేకపోతుంది. చివరకు గరుత్మంతుడు ఎటులైన ప్రాణాలు నిలబెట్టుకొని తన భర్తయైన శ్రీరామునకు ఈ వార్తను అందజేయమని ప్రాధేయపడుతుంది. తన శరీరంమీద మిగిలివున్న నగలు దారిపొడుగునా గుర్తుకోసం పడవేస్తూ వెళ్లిపోతుంది.

రాముడు లక్ష్మణు పర్ణశాలకు తిరిగి వస్తారు— సీత కనబడలేదు— జాడ తెలియలేదు. రాముడు ఎంతో దుఃఖిస్తాడు, లక్ష్మణుడు అన్నగారికి ధైర్యం చెబుతాడు— సీత యెక్కడ వున్నా వెతుకటానికే కృత నిశ్చయుడై కార్యదీక్షకు పూనుకుంటాడు. అన్నగారి శోకభారాన్ని ఉపశమింప జేసి జగమంతా గాలించియైనా జానకి జాడను తెలుసుకోడానికి బయలుదేరుతారు- సుగ్రీవునితో మైత్రి- వాలి సంహారం, సుగ్రీవ

పట్టాభిషేకం మొదలైన ఘట్టాలన్నీ సవ్యంగా గడిచిపోయిన తరువాత శ్రీరామచంద్రుడు తన ముద్రికను హనుమంతుని చేతికిచ్చి సీతను వెదుక సప్త సముద్రాలు దాటి యైనా పదునాలుగు భువనాలు గాలించియైనా ఆమె జాడను తెలుసుకొని రమ్మంటాడు.

హనుమంతుడు సముద్రం దాటి లంకను చేరుకుంటాడు. ఆ లంకాపురిలో సీతామహాదేవి ఉనికికోసం గాలిస్తున్నాడు.

భద్రంపు సావిళ్ళుబలు వైన మేడలు పంచెటరుగులు చూచెను
చిత్రపు సావిళ్ళు సరిమల్లెశాలలు వాసటీళ్ళ జూచెను
వున్న తావులు జూచి మిద్దెలన్నీ జూచివూరంత జూచివచ్చె
రావణుడు వుండేటి రత్నమేడలు జూచి రాజ్యమంతా
జూచెను.

చివరకి సీతమ్మను అశోక వనంలో చూచి రామచంద్రుని ముద్రిక అనవాలుగా యిచ్చి;

రఘురాము బంపిన ముద్రికా దెచ్చితి సీతమ్మ అందవమ్మా
అందుకొని ముద్రికా అనుమానమూదీరె అన్నా నీవెవ్వరనెను
వెనుకటికెన్నడూ అయోధ్యనెఱుగవు ఏలాగు వస్తివన్న
అనవాలూ నాకు గురుతు జూపితివి అన్న నీ పేరు ఎవరు?
వాలి సుగ్రీవులకు మేనల్లుడా నేను వల్లభుని బంటున్నమ్మా

అని చెప్పి హనుమంతుడు సీతాదేవి దగ్గర చూడామణిని అనవాలుగా దీసుకొని రాముని వద్దకు బయలుదేరుతాడు. అసలే కోతి. అందులో బ్రహచారి- ఇక చెప్పవలసిన దేముంది? చూచిరమ్మంటే కాల్చి వచ్చాడన్న సామెతను సార్ధకంచేస్తాడు — లంకాపట్నాన్ని దగ్ధంచేసి వదిలిపెట్టాడు - రావణునితో శ్రీరాముని ప్రాగల్భ్యాన్ని ఉగ్గడించి. ఆయన చేతిలో నీకు మరణం తప్పదన్నాడు. ఇదీ లంకాయాగము - హనుమంతుడు దీనికి సోమయాజి. ★

## సాహిత్య సింహావలోకనం :

# కొందరు మహిళల కొత్త రచనలు

**శ్రీ వాత్సవ**

ఒకప్పుడు తెనుగు మహిళ రచన చేసిందంటే విచిత్రంగా ఉండేది. మొల్ల, ముద్దుపళనివంటి రచయిత్రులు కావ్యగానం చేసినప్పటికీ సమకాలికులు వారిని అంత గౌరవ భావంతో చూచినట్లు తోచదు. అలాగే ఆంధ్ర నాయక రాజుల కాలంలో రామభద్రాంబ, మధురవాణి, రంగాజమ్మ, మున్నగువారు చక్కని రచనలు చేశారు. రాజాదరణ తప్ప పండిత ప్రజాదరణ వారు పొందలేక పోయారు. ఆధునిక యుగంలో ఈ శతాబ్ది ఆరంభం వరకు స్త్రీలు చదువుకోవడమే ఒక దోషంక్రింద పరిగణించారు. కందుకూరి వీరేశలింగం, రఘుపతి వేంకటరత్నం నాయుడు యాభైఅరవై సంవత్సరాల క్రితం స్త్రీ విద్యాభివృద్ధి కోసం పడినపాటులు చూస్తే ఈ కాలం వారికి స్వప్న వృత్తాంతాలులాగ గోచరిస్తాయి. స్త్రీలు విద్యాభివృద్ధి పొందిన తర్వాత స్వయంగా రచనలు చేయడం ఈ పాతిక ముప్పై సంవత్సరాల నుండి మాత్రం ప్రారంభమయింది. ఆకాలంలో కేసరిగారు "గృహలక్ష్మి" పత్రిక "సంపాదించి" స్త్రీలరచనలే ప్రాముఖ్యమిచ్చి చాలమంది అజ్ఞాత మహిళల రచనలు ప్రకటిం చారు. తరువాత గృహలక్ష్మి కంకణ ప్రదానంచేసి ఎందరో రచయిత్రులకు గౌరవసన్మానాలు చేశారు.

అదిగాక ఆంధ్ర మహిళలే కొందరు స్త్రీలకోసం పత్రికలు స్థాపించి స్త్రీ రచనలను ప్రోత్సహించారు. కాని అవి అంతగా రాణించలేక పోయినవి. అలాగ వచ్చిన పత్రికలలో హిందూసుందరి, హిందూసంస్కారిణి, అనసూయ, పత్రికలు ముఖ్యమైనవి, అవన్నీ కాలగర్భంలో దాగిపోయాయి. ఇటీవల ఒక ఆంధ్రమహిళ తన ప్రత్యేక కృషిఫలితంగా ఒకపత్రిక స్థాపించి అందు సంపాదకులుగా స్త్రీలనే నియమించి, స్త్రీలకే ముద్రణాది కార్యాలు నేర్పించి దినదిన ప్రవర్ధమానంగా నడిపి ఎందరో రచయిత్రులకు ప్రోత్సాహమిచ్చిగౌరవించారు. ఆపత్రికే 'ఆంధ్రమహిళ' ఇదిగాక అనేక వారపత్రికలు, దినపత్రికలూ, మహిళలకు ప్రత్యేక శీర్షికపెట్టి ఎక్కువమంది మహిళా లేఖకులను ఆహ్వానిస్తున్నారు. ఈ నాడు వారపత్రికల పాఠకులలో ఎక్కువమంది స్త్రీలు. వారిని ఆకర్షించాలీ అంటే వారికి సంబంధించిన సమస్యలు చర్చించాలి. వారి రచనలు ప్రకటించాలి. వారికి అభిరుచిగల విషయాలు ప్రకటించాలి. అందుకేవనితావాణి, ప్రమదావనం, పేరంటంవంటిశీర్షికలు నారీలోకాన్ని ఎక్కువగా ఆకర్షించాయి. వంటలగురించి చర్చించినా, కుట్టుపనుల సలహాలు చెప్పినా, సంసార సమస్యలు తర్కించినా స్త్రీలు ఈ చర్చలలో పాల్గొంటున్నారు. ముందు చిన్న లేఖలుగా ప్రారంభం చేసిన రచనలు కథలుగా, నవలలుగా, వ్యాసాలుగా రూపొందించుకుంటున్నారు. ఇలాంటి ప్రోత్సాహం స్త్రీలలో కలగడానికి దారితీసిన శీర్షిక శ్రీమతి మాలతీచందూర్ నిర్వహిస్తున్న ప్రమదావనం అని ఒప్పుకొని తీరాలి. దీనిని అనుసరించి వివిధ పత్రికలూ విభిన్న శీర్షికలు పెట్టాయి. తమతమ హోదాలకు తగిన పాఠకలోకాన్ని ఆకర్షిస్తున్నవి. ఈ పత్రికల ప్రయత్నం పాఠకులసంఖ్య పెంచడం. ఈ పందెంలో ఒకరితో ఒకరికి పోటీ. ఈ పోటీ పందెంలో అన్ని పత్రికలలోనూ స్త్రీల పేరులు ఎక్కువగా కనిపిస్తున్నాయి. అచ్చులో పేరు పడితే ఆనందించాలనే అభిలాషతో ప్రారంభించి అత్యుత్తమ రచయిత్రిని కావాలనే ఆదర్శం వరకు చాల మంచి ఆశయాలతో ఆంధ్రమహిళా మణులు అనేకులు రకరకాలరచనలు సాగిస్తున్నారు. ఈ రచనలలో చాలా ఉత్తమశ్రేణికి చెందినవి కొన్ని ఉన్నవి. అదిగాక స్త్రీ పేరు రచన కుండడం ఒక ప్రత్యేకార్షణగా ఉంది. ఆకారణంచేత ఆడపేరు వెనుక కొందరు మగవారు తమ రచనలు ప్రకటించి పేరుప్రఖ్యాతులు గడిస్తున్నారు. మరి కొందరు తమకు తెలిసిన స్త్రీల పేరున రచనలు ప్రకటించి ఒక తృణం లాభంకూడా పొందుతున్నారు. ఇటువంటి బ్లాక్ రచనలమాట అటుంచి, నిజంగా స్త్రీ దృక్పథంతో తాము అనుభవించిన అనుభవాలు చక్కగా తమ దృక్కోణంతో చూసి రచించే ఉత్తమ రచయిత్రుల రచనలను కొంచెం పరీక్ష చెయ్యాలనే ఈ వ్యాసం ఉద్దేశం.

ఇటీవల రచనలుగావించి ప్రసిద్ధిసంపాదించిన మహిళలు అనేకులున్నారు, వారి రచనలలో ఈ సంవత్సర కాలపరిమితిలో వచ్చిన గ్రంథ రచనలనే ఈ వ్యాసంలో సమీక్ష చేసుకొందాం. ఈ దృష్టితో పరిశీలన చేస్తే పది పుస్తకా

లవరకు నాకు దృగ్గోచర మయ్యాయి. ఇవిగాక యింకా ఎన్నో పుస్తకాలున్నవి. పుస్తకాల కెక్కని విశిష్టరచనలు అనేకం పత్రికాముఖంగా వెలువడ్డాయి. వాటి నన్నిటినీ ఈ వ్యాసంలో పేర్కొనడానికి వ్యవధీ వీలు లేదు.

అందుచేత మా సమీక్షలో ఒక్క పది గ్రంథాలు మాత్రమే పర్యావలోకన చేస్తున్నాం. తెలుగు సాహిత్యంలో నవలా రచన అంత పరిపుష్టంగా వృద్ధికాలేదనే వదంతి యున్నది. ఆ వదంతి పోగొట్టడానికి ఇటీవల చాల నవలలు, స్వతంత్ర నవలలు వస్తున్నవి. ఇవి పత్రికలలో సీరియల్సుగానే కాక గ్రంథ రూపంలో కూడ వస్తున్నది. అలాగ వచ్చిన నవలలలో అగ్రగణ్యమైనది డాక్టరు పి. శ్రీదేవిగారి "కాలాతీత వ్యక్తులు" ఈ నవల సుమారు ఒక సంవత్సరం పాటు స్వతంత్ర వారపత్రికలో సీరియలుగా వచ్చింది. ధారావాహికంగా ప్రకటితమవుతూ ఉన్నంత సేపు తరువాత ఏమి జరుగుతుందనే ఒక ఉత్కంఠ పాఠకులలో తెచ్చింది. ఇందులో పాత్రలందరూ విద్యావంతులయినా, మెడికల్ కాలేజీ విద్యార్థుల జీవితం ప్రత్యేకంగా చిత్రించబడింది. ఇందులోని పాత్రలలో ఇందిర అనే విద్యావతీ ఆమె ముసలి తండ్రీ, ఆమె జీవన సరళీ ఇవన్నీ పరిశీలించితే ఒక విచిత్ర సృష్టి మనకి ప్రత్యక్షమవుతుంది. విశాపట్టణం ఈ నవలలో చాల ప్రాధాన్యం వాహించింది. ఇందులో పాత్రలన్నీ చిత్రవిచిత్రంగా కనిపిస్తారు. కథా గమనమూ, పాత్ర చిత్రణంతో పాటు, సంభాషణల ధోరణీ, భాషాశైలీ ఒక చమత్కారమైన హాస్యంతో మిళితమైన గాంభీర్యాన్ని సిద్ధింప చేసుకొన్నది. ఇది తెలుగు జీవితంలో కొత్తదనాన్ని ఉన్నదున్నట్లు చిత్రిస్తున్న కొద్ది నవలలలో ఉత్తమమైనది.

మరొక నవల- "లత" ఆ యా పత్రికలలో అసంపూర్తిగా ప్రకటించి ఇప్పుడు గ్రంథ రూపంలో తెచ్చిన "మిగిలిందేమిటి?" అనే నవల. ఇదీ విద్యావతులయిన స్త్రీల జీవితాలనే చిత్రిస్తుంది. అయితే కథా నాయికి విద్యాదేవి కళావంతుల కులంలో ఒక భాగ్యవంతురాలయిన ఒక దేవదాసికి పుట్టిన బిడ్డ. ఆమెకు రకరకాల క్లాసుమేట్సు. ఈమె పతిత- అయిదారు ప్రియతములను చూచి, బహు పత్నీత్వాన్ని సమర్థించే యువతీ, తన పతిత జీవిత ఫలితంగా వెండితెరకెక్కి అక్కడ నుండి నైతికంగా దిగజారి మదనపల్లి శానిటోరియమ్‌లో క్షయరోగిణిగా మృత్యువు నెదుర్కొన్న స్త్రీ. ఇందులో వెగటుకలిగించే వర్ణనలూ, స్త్రీపురుషస్వేచ్ఛావిలాసాలూ. అసందర్భ ప్రవచనాలూ అక్కడక్కడ కనిపిస్తాయి. వ్యభిచారాన్ని ఉగ్గడినూ "ప్రేమ ఏకవంకి పరమైతే పవిత్రమూ బహువంకి పరివ్యాప్తమైతే అపవిత్రమనీ అనుకోవడం పొరపాటు, జీవితాలగానే ప్రేమ కూడా రకరకాలుగా ఉంటుంది. ఇష్టమైన ప్రేమ అయితే ఉన్నత శృంగారమనీ, ఇష్టంగానిదైతే వ్యభిచారమనీ నిర్ణయిస్తారు మానవులు" ఇలాంటి బాధలతో పెరిగిన ఈ స్త్రీ ఒకరిని ప్రేమించి మరొకరి కోసం ప్రాణాలు విడుస్తుంది. ఈ త్యాగంలో ఒక విశిష్టత కనిపించదు. ఒక భ్రష్టురాలు కనిపిస్తుంది. ఇలాంటి రచనలలో నీతికీ అవినీతికీ సరిహద్దు తేల్చడం కష్టం, 'చలం' ప్రభావం వల్ల ప్రేరేపితులై ఇటువంటి రచనలు చేసే వారు చాల మంది ఉన్నారు. అయితే 'చలం' ఎటువంటి భావాలు ప్రతిపాదించినా వాటికి శిల్పమూ సౌందర్యమూ సమకూర్చి పంచదార పూత చేస్తారు. అది అందరికీ చేత కాదు. ఇలాంటి రచనలు, యువక పాఠకులలో ఉద్రేకాలు రెచ్చకొట్టే "పోర్నోగ్రఫీ" తప్ప సాహిత్యం కాదు.

బెంగాలీలో, నవలలు వ్రాసే స్త్రీలు అనేకులున్నారు. ఆశాపూర్ణాదేవి, సరస్వతీదేవి, సీతాదేవి మొదలయిన వారి రచనలు అనేక పాఠకుల గౌరవాదరాలు పొందడమే కాక, వెండి తెరమీదకు కూడ ఎక్కి చాల జయప్రదమైనవి. ఈ నవలలలో కూడ కొందరు పతిత స్త్రీలు కనిపించినా వారు నగ్నంగా ఎదురు పడరు. కుటుంబాల్లో, సమాజంలో తిరిగే కుటుంబీనులుగా కులీనులుగా ఎదురవుతారు. సమాజం వారిని పెట్టిన కష్ట నిష్ఠురాలను ఎదిరించి తమ స్త్రీ సాహానాన్ని నిరూపించుకొని బయటపడిన వీరవనితలుగా గోచరిస్తారు. సంఘంలో పాపపుణ్యాలు రెండూ ఉన్నవి. కుళ్లూ మంచీ పెనవేసుకొని ఉన్నవి. రచయిత సంఘాన్ని చిత్రించేటప్పుడు పాప నిర్మూలనాన్నీ పుణ్య విజయాన్నీ ప్రతిష్ఠాపన చెయ్యాలి. కుళ్ళునూ, పాప కూపాల్నీ సమర్థించకూడదు. ప్రపంచ ప్రఖ్యాతలందరూ చేసిన పనియిదే. నికృష్ట జీవితాల్ని చిత్రించుతూన్నప్పుడు, చీకటి కోణాలలో ప్రకాశించే చిరువెలుగులు కూడ పరికించాలి. విశ్వశ్రేయస్సు కాంక్షించకపోతే సాహిత్యమే లేదు. భారతీయ సంస్కృతి పాప పంకిలాన్ని దాచుకోదు. కాని ఆ పాప పంకిలాన్ని పవిత్రంచేసే పంకజాలను ప్రసవిస్తుంది. పాప కూపాల్ని పద్మాకరాలుగా చేస్తుంది. మన రచయిత్రులు ఈ పరమ సత్యాన్ని గుర్తించి సంఘాన్ని పవిత్రంచేసే పావన జీవితాల్ని ఉగ్గడించాలి. అంతేకాని పాప కృత్యాలను బలపరచకూడదు. ఉత్తమ సాహితీకర్త నీతిబోధకుడు కాడు. ఉన్నజీవితాన్ని యథాతథంగా చిత్రిస్తాడు. దానిలోని గుణపాఠాలు కోవిదులైన పాఠకులే గ్రహిస్తారు.

మహిళా దృక్పథంతో సంఘాల్ని చూచిన మరి రెండు మూడు నవలలు వచ్చాయి. ఇవి చాలా చిన్నవి. పత్రికల

తర్వాత అంత ప్రాముఖ్యాన్నీ పొందిన రేడియోలో సీరియల్సుగా వెలువడ్డాయి. ఇందులో ఒకటి కె. రామలక్ష్మి రచించిన 'మెరుపుతీగె' అనే సీరియల్ నవల. ఇందులోకూడ ఒక విద్యావతి అయిన యువతి జీవితమే కథావస్తువు. పల్లెటిసీమలలో పెరిగి విద్యావంతుని వివాహం చేసుకుని సుఖజీవనం చేసుకోవాలని ఆశిస్తూఉంటే మధ్యసంసారంలో వచ్చే సాధక బాధకాలూ, సోదరితో కలిగిన అభిప్రాయ భేదాలూ ఈ నవలలో కథకురాలు చక్కగా చిత్రించారు. పట్టణ వాసానికి అలవాటుపడిన విద్యావతి తిరిగీ పల్లెలో జీవిస్తే ఎదుర్కొనే సమస్యలూ ఇందు కనిపిస్తాయి. ఈమె రచించిన తొలినవల "ఆవతలి గట్టు" కంటె ఇందులో ప్రాతలు రాటుదేరాయి. కథ చక్కగా రూపు కట్టింది. సన్నివేశాలు సహజంగా ఉన్నవి. ఇందులోని మగపాత్రలు సజీవంగా కష్టసుఖాలను, హృదయాలను అర్థంచేసుకునే వారిలా కనిపిస్తారు. ఇదొక మంచి నవల.

ఇంతకంటె చిన్న నవలయినా నారీ హృదయాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించిన మరొక పెద్దకథ. పి. సరళా దేవిగారి "కుంకుమ రేఖలు" ఇది ముందు రేడియోలో వెలువడి తరవాత 'స్వతంత్ర' వార పత్రికలో ధారావాహికంగా ప్రకటనపొందింది. సరళాదేవి తనరచనలలో వనితా జీవితంలోని సహజ వాతావరణాన్ని స్వభావ సిద్ధంగా చిత్రించడంలో నేర్పరి. ఈ "కుంకుమ రేఖల" లో కథానాయిక హేమలత కొత్తగాకాపురానికి వచ్చినవిద్యావతి. ఎంతో గర్విష్టి. కొత్తకాపురం పెట్టేముందు ఏమేమో చేసి వెయ్యాలనుకొని కలలుగన్న ఊహాజీవి. ఆమె కాపురం పెట్టిన తర్వాత ఇరుగు పొరుగులో, పుట్టింటిలో, అత్తగారింటిలోకలిగిన అనుభవాలు చాలా ఆశాభంగంకలిగిస్తాయి. ఒక్కొక్క అనుభూతి ఆమె తలకు బొప్పికట్టించినంత పని చేస్తుంది. జీవితంలో నేర్చుకున్న పాఠాలతో తెలివి తెచ్చుకొని సంఘాన్ని నిందించటానికి బదులు తన పరిసరాలతో తానుకలిసిపోతుంది. నలుగురితో పాటునారాయణ అన్నట్లు చుట్టుపక్కల వారితో కలిసిపోయి తన అహంభావాన్ని చంపుకొంటుంది. ఒక పిల్ల పుట్టడంతో ఆమె చదువుకొన్నప్పుడు ఊహించుకొన్న భావాలన్నీ తారుమారు అయిపోతాయి. పుణ్యవతి వివాహ జీవితంలోని కుంకుమ రేఖల రక్తిమ ఆమె అవగాహన చేసుకొంటుంది. చదువుకొన్న సంసారు లందరూ చదువవలసిన నవల.

నవలల తర్వాత ఎక్కువ ప్రచారంలో ఉన్నగ్రంథాలు కథా సంపుటాలు. అయితే మహిళలు కథలువ్రాసి పత్రికలలో ప్రకటిస్తున్నారు. కాని అవి పుస్తక రూపంలో వెలువడడంలేదు. డాక్టరు పి. శ్రీదేవిగారి కథలు "ఉరుములూ - మెరుపులూ" వచ్చి రెండు సంవత్సరాలయింది. ఇందులోనూ విద్యావతులయిన అమ్మాయిలమనస్తత్వాలను చక్కగా చిత్రించింది. ఈ సంవత్సరం వచ్చిన కథాసంపుటులలో చెప్పుకో తగినది అడ్దేపల్లి వివేకానందాదేవి గారి కథలు. ఇందులో కథానికా శిల్పం ఎక్కువగా కనుపించక పోయినా, కొన్ని వ్యాసాలూ, జీవిత చరిత్రలూ కథలుగా వ్రాసినట్లు భావించవచ్చు.

కథల విషయంలో కనబరచిన ఉత్సాహము మహిళలు వ్యాస రచనలో చూపించడంలేదు. వ్యాసరచన ఒక విచిత్రమైన వ్యాసంగం. అది ఆంగ్లభాషలో పెంపొందించినంత తీవిగా తెలుగులో మన రచయితలు పెంపుచేయలేదు. అయినప్పటికీ ఇటీవల కొందరు ఈ రచనలోకూడ కృషి చేస్తున్నారు. కొంత హాస్యమూ. కొంత సత్యమూ, మేళవించి చమత్కారమైన రచనలు చేయడంలో కృషి చేస్తున్నారు. ఇలాగ వెలువడిన వ్యాసములలో కె. లక్ష్మీరఘురామ్‌గారి వ్యాసములు "మనలో మనమాట" అనే పుస్తక రూపంలో వెలువడ్డాయి. ఈ పుస్తకంలో రచయిత్రి నిర్మొహమాటంగా నిష్ఠురమైన నిజాలు కొన్ని చెప్పారు. అవి కొంచెం కటువుగా ఉన్నా కఠినంగాఉన్నా కల్మషం లేకుండా ఆమె చెప్పగలిగారు. ఈ పుస్తకం పాఠకుల్ని చాలావరకు ఆకర్షించింది.

తెలుగులో లేఖలుగానూ, డైరీలుగానూ, వచ్చిన సారస్వతం తక్కువ. కాని ఈ సంవత్సరం ఒకటి వచ్చింది. ఈ రచన గ్రంథరూపంగా వచ్చింది. అది సూరిగ నాగమ్మగారు రచించిన "రమణాశ్రమ లేఖలు" నాగమ్మగారు తిరువన్నామలై రమణమహర్షి వద్ద చాలాకాలం శుశ్రూష చేశారు. అక్కడ ఆశ్రమంనుండి ఇంటికి వ్రాసిన లేఖలలో వారి ఆధ్యాత్మికానుభవాలు లౌకిక సంఘటలతో జోడించి చక్కగావ్రాశారు. ఇవి ఆంధ్రప్రభ వారపత్రికలో చాలా కాలం వెలువడ్డాయి. ఇప్పుడుగ్రంథరూపంలో వచ్చాయి. ఇందులో శైలీ సాహిత్య శిల్పంకోసం మనంచూడ నక్కర లేదు. నిజాయితీతో సరళభాషలో తేటతెల్లంగా తెలిపేటట్లు వ్రాసిన యీ లేఖలు సాహిత్య గ్రంథం కంటె ఎక్కువ శ్రద్ధగా చదువుకోవచ్చు.

డైరీరూపంగా వ్రాసిన ఒక గ్రంథం — రమాదేవిగారి "నాకరగిపోయే కలలు." ఇందులో వ్యాసాలన్నీ డైరీలో వ్రాసినట్లు ఏరోజుకారోజు వ్రాసినవి. తేదీలు వేయలేదు కాని, ఆవ్యాసాలు చదివితే సమయము సన్నివేశము మొదలయినవి గ్రహించవచ్చు. ఈ రచనలు సంగతాలుగా

ఊహా సంభాషణలుగా మాటలాడే ధోరణిలో రచించినవి. ఈ వ్యాసాలలో మూడు పాత్రలు ముఖ్యమైనవి- కవీ, రచయిత్రీ, బోడికుర్చీ. ఈమూడూ ముగ్గురు వ్యక్తులుగా గోచరిస్తూ ముగ్గురు కళాజీవుల భావనా ప్రపంచాన్ని సాంకేతికంగా చిత్రిస్తూంటారు. తెనుగు చిత్ర రూపావళిలో ఇదొక కొత్త ప్రయోగం. దీనిలో కొంత బల ప్రభావం గోచరించినా అది యీ రచయిత్రిని మరుగు పర్చడానికి కొత్తవెలుగులో చూపించటానికి తోడ్పడిందికాని క్రింది మెట్టులోకి దిగజార్చలేదని చెప్పుకోవచ్చు. ఇటీవల వచ్చిన కొత్త రచనలలో రమాదేవి కరిగిపోయే కలలు ఒక విశిష్ఠ రచన.

పద్య రచనలో రచయిత్రులకు అంతగా చేయి తిరిగినట్టు తోచదు. కొందరు ఖండ కావ్యాలవంటివి, గేయాలవంటివి, అప్పడప్పుడు పత్రికలలో ప్రకటిస్తున్నారుకాని వానిలో చెప్పుకోతగ్గవి ఎక్కువగా లేవు. ఇటీవల వెలువడిన లఘుకావ్యాలలో ఒకటి పిండిప్రోలు వసంతకుమారీ దేవిగారి "సమాగమము" ఇది బుద్ధుని జీవితానికి సంబంధించిన కథా వస్తువు తీసుకొని పదకొండు ఖండికలుగా తీర్చి దిద్దిన చిన్న కావ్యం. బుద్ధుడు మహాభి నిష్క్రమణమైన తర్వాత అతడు జ్ఞానోదయంపొంది బుద్ధుడై తిరిగి గృహాభిముఖుడై విచ్చేసిన సమాగమము ఈ కావ్యానికి ఇతివృత్తం ఇందలి పద్యరచన సాఫీగానే సాగిపోతుంది. కాని వ్యాకరణ దోషాలూ, భాషాప్రయోగాలలోని వికృతులూ అక్కడక్కడ ఈకావ్యంలో గోచరిస్తూవుంటాయి. కాని యీ యువ కవయిత్రికి మంచి భవిష్యత్తు వున్నదని ఈ కావ్య పఠనం చేసినవారు నిష్కర్షగా చెప్పవచ్చు.

ఇంకమరొక పద్యకావ్యం యమ్. ఆదిలక్ష్మి "పంచామృతం." ఇది ఐదుగురు ప్రసిద్ద నారీమణుల జీవిత చరిత్రలను పద్యరూపంగా చిత్రించిన ఖండకావ్యం. ఇందులో పద్యరచన బాగానే వున్నప్పటికీ కవిత్వం పాలు తక్కువ అని చెప్పక తప్పదు. రసానుభూతి అంతగా సిద్ధించదు. ఈ రచయిత్రి పద్యకావ్యంకంటె యీమె రచించిన పరిశోధనా వ్యాసంగూర్చి యీ వ్యాసంలో చెప్పక తప్పదు. మనలో తెనుగు పరిశోధన చేసినవారు అరుదు. శ్రీమతి ఆదినక్ష్మి ఎమ్. ఏ ప్యాసయి రెండు సంవత్సరాలు పరిశోధన చేసి శైవవాఙ్మయంమీద ఒక అద్భుత గ్రంథం ఆంగ్ల భాషలో వ్రాసినది. ఇది వ్రాయుటలో అనేక అముద్రిత గ్రంథావళిని తెలుగు కన్నడ తమిళ భాషలలో ఈమె సంప్రదించింది. ఈ మూడు భాషలలోనూ పరివ్యాప్తమైన వీరశైవవాఙ్మయాన్ని సంపూర్ణంగా అవలోకన చేసింది. ఒక విశిష్టమైన గ్రంథంలో అనేక అపూర్వవిషయాలను సేకరించి పెట్టింది. అయినప్పటికీ అదృష్టం కలిసి రాలేదు. ఆమెకు డాక్టరేటు ఇవ్వడానికి బదులు యమ్. లిట్ మాత్రం ఇచ్చి మద్రాసు విశ్వ విద్యాలయంవారు పరితృప్తి పొందారు. అయితేనేం? ఆమె ఆశాభంగం పొందలేదు. ప్రస్తుతం రష్యాలోని లెనిన్‌గ్రాడ్ విశ్వ విద్యాలయంలో ఈమె తెలుగు తమిళ భాషలకు అధ్యాపకురాలిగా ఉన్నది. రష్యన్ భాష అభ్యసిస్తున్నది. త్వరలోనే ఆ విశ్వ విద్యాలయ డాక్టరేటు పదవి పొందవచ్చును. మొత్తంమీద వీరశైవవాఙ్మయంగూర్చి ఆమె చేసిన పరిశోధన తెలుగు సాహిత్యానికి ఒక అమూల్యమైన ఉపాయనం.

ఇటీవల వచ్చిన రచనలలో ఈ పది రచనలు ముఖ్యమైనవి. ఇవి మహిళా పాఠకులనే కాక యావదాంధ్ర పాఠకుల దృష్టినీ ఆకర్షించగలవని చెప్పవచ్చును.



**జ**మిందారుగారి భార్య ఆరోగ్య విషయంలో మహా కట్టుదిట్టమైన మనిషి. చేతి మీద చిన్న దద్దురెక్కితే ఇంటి డాక్టరుని అర్జెంటుగా కబురంపారు. ఆదరా బాదరాగావచ్చిన డాక్టరుగారు చేతిని భూతద్దంలో పరీక్షచేసి "అమ్మా నన్ను రమ్మని చెప్పడం నయమైంది. లేకుంటే యీ దద్దురు కాస్తా కనిపించ కుండా కరగి పోయేది" అన్నాడు.

# మహిళలు - సంగీతము

**శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు**

సంగీతం లలితకళలలో ప్రధానమైనది. ఆ లాలిత్యం వల్లనే అయిఉంటుంది - మన పౌరాణిక విశ్వాసాలలో చదువులన్నీ బ్రహ్మముఖానపుట్టాయనీ, బ్రహ్మముఖాన్నే సరస్వతీదేవి వెలిసిందనీ, ఆవిడే సంగీత సాహిత్యాలు రెంటికీ అధిదేవత అనీ రూఢాభిప్రాయాలు ఏర్పడి పోయాయి. అందుకే సంగీత సాహిత్యాలలో నిధి అనిపించుకున్న పురుషుణ్నికూడా - ఓహో ఆయన సరస్వతీదేవి అపరావతారం అండీ-అంటూంటారు. బ్రహ్మగారి కుటుంబం మొత్తంమీద పూర్తిగా చదువుల కుటుంబం. కైలాసంలో మహేశ్వరుడు గారి కుటుంబంలో పూర్తిగా అందరూ సంగీత ప్రియులే అనడానికి ఒకప్రాచీన శ్లోకం ఆధారం :

శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః

శిశువంటే కుమారస్వామి, పశువంటే నందికేశ్వరుడు, ఫణి అంటే ఆ భుజగభూషణుడి కంఠాభరణం. ఉమ లాస్యంలోను, మహేశ్వరుడు తాండవంలోను, మగ్నులై ఉన్నప్పుడు పరివారం అంతా సంగీతనేపథ్యం సమర్పిస్తారు. వైకుంఠంలో అయ్యవారికీ అమ్మవారికీ సంకీర్తన కాలక్షేపం చేసేవారు తుంబుర నారదులు. ఈ నారదుడు సరస్వతీదేవి కుమారుడే.

ఇక ఇంద్రలోకంలో అప్సరసలందరూ సౌందర్యవతులూ, నర్తకులు, అపూర్వ గాయికలేమోకూడ. అయితే, మనకు వినవచ్చే పౌరాణిక కథల్లో అప్సరసల సుందర నాట్యవిలాసాలకేగాని, వారి సంగీతానికి అంత ప్రాముఖ్యం కనబడదు. అయితే, "విమల గాంధర్వంబు విద్య మాకు" అనిచెప్పి పెద్దనగారి వరూథిని ఈ సందేహాన్ని తీసిపారేసింది. కోకిల కాకలీస్వనంతో శృంగారంలో కరుణరసం చిప్పిల్ల జేసింది కూడా. ఈ బాపతు గాథల్లో సంగీతానికి యక్ష, కిన్నర గంధర్వ, సిద్ధులనబడే జాతులవారు ప్రత్యేక ప్రసిద్ధి పొందారు. కిన్నరాంగనలు, గంధర్వ కన్యలు, యక్షిణులు, సిద్ధ పురుషులు ఆయా ప్రాచీన గాథల్లో సంగీతంపాడి మైమరపించడానికి పేరు పడ్డారు.

ప్రబంధకాలపు పౌరాణిక స్త్రీమూర్తులలో కలభాషిణి - సంగీతంలో నారదమానికి శిష్యురాలు. ఆమె పింగళసూరన్నగారి అపూర్వసృష్టి. ఇలా సాహిత్యంలో పాత్రలైన కళామూర్తులైన మహిళలు చారిత్రక వ్యక్తులా అనే విషయం నొక్కి చెప్పడానికి వీలులేదుగాని, వాళ్ళు కవి భావనలో పాఠకుల హృదయాలలో అజరామరులైస్థిరనివాసం సంపాదించుకొన్న చిరంజీవులు.

భారత దేశానికంతకూ ఆరాధ్యమైన తొలి గేయ ప్రబంధం గీతగోవిందం. దీని రచనకు భక్త శిఖామణీ, కవిగాయకవతంసుడూ అయిన జయదేవుని ప్రోత్సహించి, తన పేరుతో కలిపి భర్తకు "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" అనే బిరుదాన్ని ప్రసాదించిన పద్మావతి సంగీత నృత్యాలలో విదుషీమణియైన తొలి చారిత్రిక మహిళ. జయదేవుని అష్టపదులను, పూరీ జగన్నాథ దేవుని సమక్షంలో, నృత్యాభినయ

పూర్వకంగా గానంచేసిందని, లక్ష్మణనేన మహా రాజు దర్బారులోకూడా నృత్యం చేసిందనీ ఐతిహ్యాలున్నాయి.

అటుతర్వాత అన్ని వేల సంకీర్తనలు అహోరాత్రాలు రచిస్తూ గానం చేస్తూ వచ్చిన అన్నమాచార్యుల వారి భార్య తిమ్మక్క సుభద్రా పరిణయం అనే ద్విపద కావ్యం వ్రాసినట్లు తెలుస్తోంది. కాని, దాన్ని చదివితే, అంత మంచి కవిత్వం వ్రాయగల ఆమె తప్పకుండా కీర్తనలు కూడా వ్రాయగలిగిన గాయకురాలు అయి ఉండాలని పిస్తుంది.

తమిళ దేశంలో ఆండాల్, అవ్వై, మొదలైన భక్తగాయనులు ఉండేవారు. గాని, ఆంధ్ర దేశంలో అటువంటి వారి పేరులు వినపడవు.

అటుతర్వాత తంజావూరు వెళ్ళే వరకూ అంటే 17 వ శతాబ్దం వరకూ సంగీతజ్ఞులమాటటుంచి, కవయిత్రుల పేరే వినబడదు. రఘునాథ నాయకుని దర్బారులో రామభద్రాంబ, కృష్ణాజి మధురవాణి, మొదలైన సంస్కృతాంధ్ర కవయిత్రులుండేవారు. వీరి సాహిత్య విశేషాలేగాని సంగీత వైదుష్యం గురించి అంతగా తెలియదు. సంగీత సాహిత్య వైదుష్యాలు మూడూ ముప్పిరి గొన్న వాగ్గేయకారిణి పసుపులేటి రంగాజమ్మ; ఆతరువాత తరానికి చెందిన విజయరాఘవ నాయకుని ఆస్థాన కవయిత్రి. ఈమె మన్నారుదాస విలాస ప్రబంధము; ఉమాపరిణయ ప్రబంధము, మన్నారుదాసవిలాసనాటకము. రామాయణ, భాగవత సంగ్రహాలు, లలిత ఫణితిలో రసవంతమైన అనేక పదాలు రచించిన జాణ.

ఈమె మన్నారు దాస విలాసంలోని దరువులు చాలమట్టుకు క్షేత్రయ్య పదాలలోని నుడికారంతో అదే అను ప్రాసలతో, భావాలతో, ఇంచుమించు క్షేత్రయపదాలేనా అనిపించేటంత మధురంగా ఉంటాయి:

పదం 1. చెల్లబో యిందరు చెలులు గలిగిన ఫలము
ఉల్లసంబు లాడనేకాని ఒద్దిక సేయగలరా
కలలోన నేడునా చెలువుని రమ్మంటినా
నలినాక్షు లిందరు నన్ను దూరెదరు
వచ్చితినేమాయె వలపు పుట్టించవలె
మచ్చు గప్పేరుగా మగువలందరు గూడి ॥

పదం 2. ఏలరా, నేతాళజాలరా, చాలనీపై నేను
బాళితోనున్నాను.
బాల రమ్మని నన్ను లాలింప వేలరా ॥

ఈడరా నను దయజూడరా కోడెకాడా మరుండు
దాడి వచ్చినిపుడు, మోడిసేయక జోడు
కూడి చేకోరా ॥

పదం 3. పదరిదవేల వెన్నెలరాయ నీకునే పగదాన
నటరా ॥

రంగాజమ్మ పదాలలో క్షేత్రయ్య ప్రభావాన్నిబట్టి చూస్తే విజయరాఘవుని ఆస్థానానికి విచ్చేసిన క్షేత్రయ్య అక్కడకొన్నాళ్ళు మకాము వేసి, తన సంగీత సాహిత్యాలతో అక్కడివారి నందరినీ సమ్మోహితులను చేశాడని ఊహించ వచ్చు. అతి సుకుమార శబ్దాలతో కూర్చిన క్షేత్రయశైలి రంగాజి వంటి మధుర హృదయి మైన కవయిత్రికి అనుకర యోగ్యం కావడం సహజమే. క్షేత్రయ పదాలకు రంగాజమ్మపదాలలో కనబడే సామ్యం విజయరాఘవుని యక్షగాన దరువుల్లోకాని, ఆనాటి యే యితర రచయితల దరువుల్లోకాని కనపడదు. పసుపులేటి రంగాజమ్మ ఇంటిపేరు బట్టి యోచిస్తే, ఈమె కూడా క్షేత్రయ్యలాగే రాజపోషణకోసం మన ఏ కృష్ణాగోదావరుల నుంచో తంజావూరు వలస వెళ్ళి ఉంటుందని తోస్తుంది.

అటుతర్వాత తంజావూరునేలిన మహారాష్ట్రి రాజులలో ప్రతాపసింహుడు 'ముద్దుపళని' అనే నట్టువరాలైన కవయిత్రిని ఏలినవాడు. ఆమె రాధికాసాంత్వనము అనే ప్రబంధాన్ని మాత్రమే కాక, ఆండాళ్ తమిళంలో రచించిన సప్త

పదులనే భక్తిగేయాలను తెనుగులో కీర్తనలుగా రచించినదని చెపుతారు.

ఇంతకంటే సూక్ష్మ పరిశోధన చేసి పరిశీలించినా మొత్తంమీద తేలేదేమిటంటే, సంగీతం స్త్రీలకు అనువైన కోమల కళ అనే అభిప్రాయం సృష్ట్యాదినుంచీ మానవ జాతులలో వ్యాపించి వున్నా, మన దేశ చరిత్రలోమాత్రం, స్త్రీజాతి ద్వారా సంగీతంలో తగినంత కృషి జరుగలేదని కాని, ఒకవేళ జరిగినా, తగిన ప్రచార శక్తులు లేక అదంతా కాలగర్భంలో కలిసిపోయిందని అనుకోవలసి వస్తుంది. ఈ వ్యాసం స్థాలీపులాకంగా ఆ చరిత్రను చర్వణం చేయడానికి చేసిన ప్రయత్నం మాత్రమేకాదు; ఆ విషయమై తగిన పరిశోధనలు చేయగల జిజ్ఞాసువులకు కార్య తత్పరత కలిగించే ఉద్దేశంతో చేసిన సవాలు.



అందమైన ఆంధ్రా

# "కోఆప్-ఫాబ్రిక్సు"

ఎక్కువ మన్నికకు
తక్కువ ధరలకు
పక్కా రంగులకు
సొగసైన నేతకు

ప్రసిద్ధిగాంచినవి

మా విక్రయశాలలు. ఆంధ్ర ప్రదేశమంతటనూ, మరియు మద్రాసు
బెంగుళూరు. పర్లాకిమిడి, బరంపురం, కటక్ నగరములలో కలవు.

ఆంధ్ర దేశ

# చేనేత సహకార సంఘము

విజయవాడ —2—




# సూర్య దేవాలయం

మనదేశములో అనేక దేవతలకు లెక్కకు మిక్కిలి దేవాలయము లున్నవి. కాని కర్మసాక్షియైన సూర్య భగవానునికి ఒకటి రెండు మినహా ఆలయములు లేవు. అందులో ఒక ఆలయము కోణార్కలో నున్నది. ఇది అపూర్వ శిల్పసంపదతో వెలయుచున్న ఆలయము. యిచ్చట ప్రతిష్ట జరుగలేదు. ద్వారమందు మాత్రము ఇద్దరు శిల్పుల విగ్రహములున్నవి.

పూర్వము అవంతీ నగరములో జ్ఞానవర్మ అనే శిల్పి నివశిస్తూ ఉండేవాడు. ఆయన శిల్పములన్నీ జీవకళ లీనుచు బ్రహ్మసృష్టిని సైతము ధిక్కరిస్తూ సజీవములను భ్రాంతిని కలుగజేయు చుండెడివి. ఈయనకు గల శిల్ప నైపుణ్యమునకు గాను ఆ పురప్రజలందరు "శిల్పాచార్య" బిరుదు ప్రదానము గావించినారు.

జ్ఞానవర్మ తనభార్యయైన తేజస్వినీదేవితో సుఖముగా కాలము గడుపుతుండేవాడు, కొంతకాలమునకు ఆ జ్ఞానవర్మకు దేశాటనచేసి శిల్ప శాస్త్ర పండితుల జయించి ఇంకాకీర్తి గడించాలనే కోర్కె కలిగింది. తన కోర్కెను భార్యతో వెల్లడించాడు. అప్పటికామె మూడుమాసముల గర్భిణి. అట్టి పరిస్థి

---

బి. రమాదేవి

---

తిలో భర్త దూరదేశాలకు వెళ్ళుట కామె సమ్మతించ లేదు. కాని భర్తయొక్క బలవంతముతో త్వరలో తరిగి వస్తానని వాగ్దానము చేయుంచుకొని అనుమతించినది. జ్ఞానవర్మ దేశాటనకు బయలుదేరుతూ తమకు పుట్టబోయే కుమారునికి "విజ్ఞానవర్మ" అని నామకరణము చేయవలసినదిగా భార్యను ఆదేశించాడు.

జ్ఞానవర్మ అలా బయలుదేరి దేశ దేశాలు తిరుగుతూ అచ్చటి శిల్పశాస్త్ర పండితులతో చర్చలు జరిపి వారిని జయించుతూ అఖండ ఖ్యాతి గడించాడు.

ఇట్లా ఉండగా కటకపురి మహారాజైన సింహవర్మ సూర్యదేవునికి ఒక దేవాలయము నిర్మించాలని సంకల్పించాడు. దేశమంతటా వివిధ దేవతలకు దేవాలయములుండి కర్మసాక్షియైన సూర్య దేవునకు దేవాలయము లేకుండుటకు చింతించి ఆయన ఈ నిర్ణయానికి వచ్చాడు. ప్రత్యక్షదైవమైన అర్కునకు నిర్మించే దేవాలయము సర్వాంగ సుందరముగా అపూర్వ సంపదతో అలరారుతూ "నభూతో నభవిష్యతి" అనునట్లుండవలెనని సంకల్పించాడు.

అందులకు దేశదేశాలనుండి ప్రఖ్యాత శిల్పులను రావించి వారితో ఇలా అన్నాడు. "శిల్పాచార్యులారా! సూర్యదేవునికి ఒక దేవాలయము అపూర్వ శిల్పసంపదతో నిర్మించాలని నిశ్చయించినాము అందుకు మీలో సమర్థులైనవారు ముందుకు వచ్చి తాంబూలము తీసికొనవలసినది. కాని మాకు నచ్చిన విధంగా దేవాలయము నిర్మించలేని పక్షంలో శిరచ్ఛేదం తథ్యము"

మహారాజు పలుకు లాలకించి ఒక్కరూ ముందుకు రాలేదు, ఇదిచూచి సింహవర్మ నిస్పృహ చెందాడు. కాని సమర్థులైన శిల్పులు ఎచ్చటనైనా ఉండకపోరను నిశ్చయముతో దేశదేశాలకు ఈ వార్త చాట బంపినాడు. అట్లు మహారాజుకు నచ్చిన విధంగా దేవాలయము నిర్మించిన శిల్పికి తన రాజ్యములో అర్ధ రాజ్యము మిత్తునని ప్రకటించాడు.

ఇలా వుండగా దేశాటన చేస్తూన్న జ్ఞానవర్మ కటకపురి ప్రవేశించాడు. మహారాజుగారి ప్రకటన నాలకించి వెంటనే రాజదర్బారుకు ప్రవేశించాడు. సింహవర్మకు నమస్కరించి "మహారాజా! తమప్రకటన ప్రకారము తమకు నచ్చినరీతిగా దేవాలయమును నిర్మించగలను. అట్లు నిర్మించలేనిచో నాతలనిత్తురు" నని ధృఢ స్వరముతో పల్కినాడు జ్ఞానవర్మ.

అతని పల్కులాలకించి మహదానందము చెంది తాంబూల మొసంగినాడు మహారాజు. వెంటనే దేవాలయములో విగ్రహ ప్రతిష్టకు కూడ ముహూర్తము నిశ్చయింప బడినది. ఆ ముహూర్తము లోపల దేవాలయ నిర్మాణము పూర్తికావింప వలసినదిగా ఆదేశించాడు జ్ఞానవర్మను మహారాజు. దేవాలయ నిర్మాణమునకు కటకపురిలో స్థలనిర్దేశము కావింపబడినది.

జ్ఞానవర్మ ఒక శుభ ముహూర్తములో దేవాలయ నిర్మాణ మారంభించినాడు. ధృఢ సంకల్పుడై, ఆహార పానీయములనైతము విసర్జించి రాత్రింబవళ్ళు పనిచేయసాగినాడు.

దేవాలయ మఖండ శిల్పసంపదతో తయారుకాసాగినది. రాళ్ళలో నుండి అపూర్వ దేవతామూర్తులవతరించినవి. లతలావిర్భవించినవి. తీవియలు పుష్పించినవి. నాగకన్యలు శిలలో నాట్యమాడినారు. సూర్యదేవుని కమనీయ విగ్రహము సప్తాశ్వయుతమైన రథముపై నధివశించి ఉదయించుచున్నట్లు మనోజ్ఞముగా మలచబడినది. దేవాలయ గాలి గోపురము అనిర్వచనీయ శిల్ప సంపదతో అపూర్వముగా తయారయైనది.

కాని ఒక సమస్య ఉత్పన్నమైనది. మహోన్నతమైన అగాలి గోపురమును విమానముపైకెత్తుటకు శిల్పాచార్యునకు మార్గము గోచరింపలేదు. దేవాలయములో విగ్రహ ప్రతిష్టకు ముహూర్తము సమీపించుచున్నది, ముహూర్త సమయము లోపల దేవాలయము పూర్తికానిచో మహారాజు గారిచ్చికినమాట పోతుంది. మీదు మిక్కిలి తనకీర్తికి భంగము కలుగుతుంది. దేవాలయ గాలి గోపురము విమానముపైకెత్తినచో దేవాలయ నిర్మాణము పూర్తియైనట్లే! కాని శిల్పాచార్యునకేమియు మార్గముగోచరింపలేదు.

ఈ విషమ పరిస్థితిని గమనించినాడు మహారాజు. దేవాలయ నిర్మాణమును గాంచి అచ్చెరువందినాడు. కాని ఈ సంకట పరిస్థితి గమనింపగానే మహారాజు మిక్కిలి చింతిల్లినాడు. నిశ్చిత ముహూర్తమునకు విగ్రహ ప్రతిష్ఠ జరిగి తీరవలెనని ధృఢనిశ్చయుడైనాడు. వెంటనే గాలిగోపురమును విమానముపైకెత్తించినవానికి తన పుత్రికనిచ్చి వివాహమొనర్తునని" దేశ దేశముల చాటబంపినాడు.

ఇక్కడ అవంతీ నగరములో జ్ఞానవర్మ భార్య తేజస్వినీ దేవి నవమాసములు నిండిన వెనుక కుమారుని ప్రసవించినది. భర్త ఆ దేశానుసారము అక్కుమారునకు "విజ్ఞానవర్మ" అని నామకరణం మొనర్చినది. విజ్ఞానవర్మ బాల్యమునుండియు కుశాగ్ర బుద్ధియై, గురుజన విధేయుడై, విద్యోపార్జున కావింప సాగినాడు. నూనూగు మీసాల నూత్న యవ్వన మంకురించు సరికే తండ్రిగారి శిల్పశాస్త్ర గ్రంథ ములన్నియు శోధించి శిల్పశాస్త్ర నిష్ణాతుడైనాడు.

కోణార్కలో దేవాలయ నిర్మాణమందు మునిగి యున్న జ్ఞానవర్మ ఇంటి సంగతే మరచినాడు. భార్య కిచ్చిన వాగ్దానము గుర్తుకు రాలేదు. భర్తకొరకై ఎదురు తెన్నులు చూచి చూచి కన్నులు కాయలు కాచినవి తేజస్వినీదేవికి.

విజ్ఞానవర్మ షోడశవర్షప్రాయుడైనప్పటికీ ఇంత వరకు తండ్రిమొగమెరుగడు. తండ్రిని చూడవలెనన్న కాంక్ష ఉదయించినది విజ్ఞానవర్మకు. వెంటనే తల్లి వద్దకేగి దేశాటనమొనర్చి తండ్రిని తీసికొనివచ్చుటకు అనుజ్ఞ వేడినాడు. కాని ఆమె మొదట అంగీకరింప లేదు. తుదకు కుమారుని బలవంతముమీద అంగీకరిం చినది. భర్తయొక్క గురుతులు తెలిపి కుమారుని ఆశీర్వ దించి పంపినది.

విజ్ఞానవర్మ దేశ దేశములు తిరిగి తుదకు కటకపురి ప్రవేశించినాడు. మహారాజప్రకటన మాలకించినాడు. హృదయమానందముతో నుప్పొంగినది. కాని తండ్రికి తనను తెలుపుకొనకుండ ప్రచ్ఛన్నముగ నుండదలచి నాడు. తన శిల్పశాస్త్ర ప్రావీణ్యత తండ్రికి తెలిపి గాని తాను బయట పడతలపలేదు.

విజ్ఞానవర్మ మహారాజును సమీపించి తాను గాలి గోపురమును విమానముపైకెత్తించగలనని పల్కి నాడు. అందుకై బండ్లకొలది, ఇసుక తెప్పించ వలసినదిగా కోరినాడు.

వెంటనే మహారాజాజ్ఞ అయినది. "రాజు తలచు కొనిన దెబ్బలకు కొదువా?" సముద్రతీరమునుండి అనుదినము బండ్లకొలది ఇసుక దెచ్చి పోయసాగి నారు. ఇసుకదిబ్బ పెరిగినకొలది గుడిగోపురముపైకి లేవసాగినది. క్రమముగా విమానముకన్న ఎత్తుగా లేచినది. అప్పుడు గాలిగోపురము అడుగుభాగము నుండి విమానముపైకి ఇనుప కడ్డీలను పటవాలుగా వైచి గాలిగోపురమును మెల్లగా జార్చి విమానముపై నిల్పినాడు.

ఇది చూచినంతనే మహారాజుగారానందము పట్ట జాలక విజ్ఞానవర్మను కౌగలించుకొనినాడు. పట్టపు ఏనుగుపై నూరేగించినాడు. మరునాడే దేవాలయ ప్రతిష్ఠాపన మహోత్సవము పర్వాట్లు మహోద్ధరిత ముగా జరుగుచున్నది. విజ్ఞానవర్మ ఆరాత్రి దేవాలయ మందే తనను తండ్రికెరుకపరుపదలచినాడు.

విజ్ఞానవర్మను మహారాజు గౌరవించుట చూచి నంతనే జ్ఞానవర్మకు తల కొట్టివేసినట్లయినది. దేశ దేశ ములందలి శిల్పశాస్త్ర పండితుల జయించి అనుభవజ్ఞు డైన తాను చేయలేని పనిని నూనూగు మీసములై నను సరిగారాని ఒక అర్భకుడొనర్చుటయా అని అసూయాపరితప్తుడైనాడు. నేటితో తన శిల్ప శాస్త్ర పాండిత్యము అడుగంటినట్లే! కేవలమొక బాలుని చేతనా తాను పరాజితుడగుట! ఔరా! ఎంతటి అవ మానము! తనకు ప్రతిస్పర్థి యుండరాదు. నేటితో వాడు నశింపవలసినదే అని అసూయాంధుడైనాడు.

ఆరాత్రియే విజ్ఞానవర్మనంతమొందించుటకు నిశ్చ యించినాడు. వెంటనే చేతనొక వాడికటారి ధరించి దేవాలయము ప్రవేసించినాడు. అచ్చట నిర్మల మాన సముతో మోమునందు దరహాస చంద్రికలు వెల్లి విరియుచు నిదురించుచున్న విజ్ఞానవర్మనుకాంచినాడు. కన్నులు రోషకషాయితములైనవి. జ్ఞానము నశిం చినది జ్ఞానవర్మకు, హృదయము భగ్గునమండినచే వాడికటారితో ఆయువకుని హృదయముపై ఒక్కది. పోటు పొడచినాడు.

విజ్ఞానవర్మ "అబ్బా" అని బాధతో మూల్గి కన్నులు తెరచి చూచినాడు. అసూయాద్రిక్తతచే వణికిపోవు చున్న తండ్రిని గాంచిచాడు. "హా తండ్రీ! ఎంతపని చేశావు! నేను మీ కుమారుడను. విజ్ఞానవర్మను, ఎంతకాలమునకు మీరు మరలి గృహమునకు రాక పోగా కారణము తెలియక దిగులొందుచున్న తల్లి గారికి మిమ్ములని వెదకి తీసుకువత్తునని వాగ్దానము చేసి వచ్చినాను. మీకెరుకపడకుండ ప్రచ్ఛన్నముగా నుండి, నా ప్రతిభ చూపి మీ మెప్పు బడయదలచి నాను. అబ్బా! బాధ అతిశయించుచున్నది. మీరు...

గృహాము...నకు ...వెళ్ళి ...తల్లి...గారిని... ఓదార్చు..." అంటూ ప్రక్కకొరిగినాడు విజ్ఞానవర్మ.

జ్ఞానవర్మ తన తప్పిదము తెలుసుకొనినాడు. కుమారుని శవముపైబడి బిట్టుగా విలపించినాడు, కాని చేతులు కాలినపిదప ఆకులు పట్టుకొనిన చాని సామెత అయినది. హృదయమును దహించుచున్న శోకానలము భరింపజాలక ఆ వాడికటారితో తన హృదయములో ఒక్కపే పోటు పొడుచుకొనినాడు. కుమారుని శవముప్రక్కనే నేలకొరిగినాడు,

తెల్లవారిన తరువాత భేరీ మృదంగాది వాద్యముల బ్రహ్మాండమైన నూరేగింపుతో తరలివచ్చినారు మహారాజుగారు విగ్రహప్రతిష్టకు. కాని దేవాలయములో చూస్తే ఏముంది! అసూయవలన కలిగే అనర్థములకు సాక్ష్యమో అనునట్లు రక్తపు మడుగులో జ్ఞానవర్మ, విజ్ఞానవర్మల కళేబరములు కాన్పించినవి. సూక్ష్మగ్రాహియైన మహారాజుగారు సంగతి గ్రహించినారు. మహారాజుగారి కన్నులవెంట అశ్రుధారలు కురిసినవి. విగ్రహ ప్రతిష్ట ఆగిపోయినది.

ఆ మహాశిల్పులయందలి గౌరవ చిహ్నముగ మహారాజుగారు వారి విగ్రహములను చెక్కించి దేవాలయ ద్వారమందు నిల్పినారు.

నాటికి నేటికీ లోకములో అసూయవలన కలిగే అనర్థములకు సాక్ష్యముగా కోణార్కలోని సూర్య దేవాలయము ప్రతిష్ట లేకుండ నిల్చిపోయినది! లోకములోని అసూయవలన నాశనమైన జీవితాలకు సాక్ష్యముగా దేవాలయ ద్వారమందు నిల్చియున్నవి: విజ్ఞానవర్మ జ్ఞానవర్మ విగ్రహాలు!



ప్రౌఢ ప్రబంధము :

# విజయ విలాసము

ఆంధ్ర వాఙ్మయము నందలి ప్రౌఢ ప్రబంధములలో విజయ విలాసము ఒకటి. సరసకవి చక్రవర్తి, తంజాపుర రఘునాధరాయల ఆస్థానకవి. శ్రీ చేమకూర వెంకట కవి విరచితమది. వాఙ్మయాభిమానులైన వనితామణుల కొరకై కథా రూపముగా శ్రీ చెర్వు ఆంజనేయ శాస్త్రిగారిచే యీసంగ్రహము వ్రాయబడినది.

"పాండవ మధ్యముడు అర్జునుడు. మహా వీరుడు, ధార్మికుడు. సోదరుల కత్యంత ప్రీతిపాత్రుడైనవాడు. సజ్జనులయెడ మహా ప్రీతిగానుండేవాడు. స్ఫురద్రూపి. నవ యౌవ్వనంలో వున్నాడు.

♦ ♦ ♦

ఒక నాడు ద్వారకలో కృష్ణపరమాత్మ తన సతులతో కొలువుతీర్చి వున్నాడు. అతని కెందుకో పాపం అర్జునుడు గుర్తుకొచ్చాడు. తనకు మిక్కిలి ప్రేమ పాత్రులైన పాండవులు తలపునకు వచ్చారు. క్షేమం తెలుసుకు రమ్మని 'గదుడ'ను యాదవుణ్ణి యింద్రప్రస్థానికి పంపాడు.

గదుడు యింద్రప్రస్థంచేరి ఎల్లరి క్షేమం తెలుసుకున్నాడు, అర్జునుడు యేకాంతంలో గదుని క్షేమమడిగి, ద్వారక యందలి రూప లావణ్యవతులను గూర్చి అడిగాడు. అసలు మనస్సులో వుద్దేశ్యం సుభద్ర ప్రస్తావన రావాలని, గదుడు అతివలలో సుభద్రవంటి సౌందర్యవతి, చక్కని హావభావములు గలిగిన స్త్రీ కనరాదనియే మేమో చెప్పాడు. అర్జునుడు మనస్సులో పొంగిపోయినాడు. అర్జునకు ఆమె తన కళ్ళయెదుట నిలుచున్నట్లుగాను భావించి, తనలో భాషించినట్లు ముగ్ధుడైపోయాడు. గదుడు లేనిపోని బాధ అర్జునునిలో ప్రవేశపెట్టి పోయినాడు.

* * *

ఒకానొక సమయమున ఒక బ్రాహ్మణోత్తముడు ఆశ్రిత రక్షాపర గండభైరవులగు పాండవుల వద్దకు పరుగెత్తుకుని వచ్చాడు— అప్పుడు అర్జునుడే అతనికి ముందు కంటబడెను, "ఏమి బ్రాహ్మణోత్తమా ! యింత ఆయాసములో యిలా పర్వెత్తి వచ్చారు?" అన్నాడు. బ్రాహ్మణుడు "నాయనా ! అర్జునా ! ఎవడో చోరుడు నా యగ్నిహోత్రములకు కావలసిన ఆజ్యమునిచ్చే గోవును దొంగిలించుకుని పోయినాడు. నీవు ఎటులైన ఆ చోరుని పట్టినా గోవును యిప్పించ వేడుతున్నానయ్యా" అన్నాడు.

ఏమైనా అర్జునుడు. "తెచ్చి మీ యావును వప్పగించెదనని" వాగ్దానమిచ్చాడు.

కాని ఒక చిక్కు వచ్చిపడింది. అతని అమ్ముల పొది, విల్లు ద్రౌపదీ శుద్ధాంతంలో వుండిపోయినయ్. ద్రౌపదిని భార్యగా స్వీకరించుటలో పాండవులు చేసికొనిన ఒడంబడిక ప్రకారము అది ధర్మరాజు ఆమెతోనుండు మాసము. కాని బ్రాహ్మణుని గోరక్షణకై అర్జునుడు తన వాగ్దానము నెరవేర్చుట కొరకు అందు ప్రవేశించి తన ఆయుధమును తెచ్చినాడు, దొంగలను పట్టి ఆవును తెచ్చి బ్రాహ్మణున కప్పగించినాడు.

కాని, సమయము కాని సమయమున అతడు ద్రౌపది శుద్ధాంతమున యడుగిడిన కారణమున అతడు తీర్థ యాత్రకు పోవలసి వచ్చెను.

ధర్మజుడు తమ్మునకు కొంత పరివారమును, తమ పురోహితు ధౌమ్యుని తమ్ముని కుమారుని విశారదునిచ్చి సకల తీర్థములు సేవించి రమ్మని సాగనంపాడు.

♦ ♦ ♦

ప్రధమమున గంగా తీర్థమునకు చేరి అనేక పితృ కర్మలు 'దానములు, ధర్మములు చేసినాడు అర్జునుడు' ఇసుక తిన్నెపై కూర్చుండి జపము జేయుచున్న, సుందరుడగు అర్జునుని నాగ కన్యక యగు 'ఉలూపి' చూచినది. దూరము నుండి చూడగనే ఆమెకు అతనిపై మోహము జనించినది, మున్ను ద్రౌపదీ

స్వయంవర సమయంలో కామరూపులైన తన వంశీయులు పోయి అర్జునుని చూచిచేసిన వర్ణనలు ఆమె కన్నుల ఎదుట కనబడగా ఆమె తన వలపును నిలుపలేక పోయినది.

అర్జునుడు మాత్ర మూరకయుండెనా? ఆమెను చూచాడు. ఆమె లావణ్యము. సౌకుమార్యము అతని నిముగ్ధుని చేసినవి. ఆమెయు అతి సుందరి. యవ్వన వయో విలాసిని. ఏ పురుషుడు యేకాంతమున నున్న సమయమున యేదేని ఒక సుందరి మందహాసము చూచి మాటాడకుండ బోగలడు? అందున యితడర్జునుడు. వీరాగ్రణి. సకల శస్త్రాస్త్రముల యందేగాక కళల యందు కూడ ఆరితేరినవాడు. ఆమెను సమీపించి "ఎవరు నువ్వు! నీపేరు? ఇలా వంటరిగా...." అని అడిగేడు.

"నేను ఉలూపియను నాగకన్యను. పాతాళలోకము మాది" అని వయ్యారంగా చెప్పింది.

"ఓ, వీరాగ్రణీ! నీ కోసం నేను ఎంత కాలము నుండో వేచియున్నాను. నన్ను చేపట్టి, నా జన్మధన్యం చెయ్యి" మంటుంది. "నీవు ద్రౌపదిని వివాహమాడిన సంగతి తెలుసునయ్యా! నన్ను రెండవ భార్యగ స్వీకరించు" అని ప్రార్థిస్తుంది.

"నీవు నాగజాతి స్త్రీవి, నేను మానవుణ్ణి. నీకూ నాకు పొత్తు ఎలా కుదురుతుంది." అన్నాడు.

ఉలూపి– శ్రీరాముని కుమారుడు కుశరాజు కుముద్వతిని వివాహం చేసుకున్నట్లు, పురుకుత్సుడు నర్మదను పెండ్లియాడినట్లు గబగబా నాలుగయిదు సంఘటనలు వప్ప చెప్పుతుంది. అర్జునుడు దిమ్మరపోతాడు. తప్పుకోవచ్చని తానిప్పుడు వ్రతంలో వున్నానంటాడు. ఆమె కన్నీరు కార్చింది. అది చూచి జాలిపడి సరేనన్నాడు విజయుడు. గాంధర్వ వివాహం జరిగింది, మన్మధుడు పురోహితుడుగా వివాహం చేయించాడు ఆమెకు సద్యో గర్భంలో పుత్రుడు కలిగాడు. అతనికి 'ఇలావంతుడ'ని పేరు పెట్టారు పెద్దలు.

అర్జునుడు నాగలోకమున ఆ రేయి గడిపి తెలవారగనే తమ పరివారంతన కోసం వేచివుంటుంది అచ్చటి చేర్చమంటాడు, అతని కోరికను నెరవేరుస్తుంది ఉలూపి.

అతడు తన పరివారముతో హిమాలయ తీర్థములన్నీ సేవించి దక్షిణ భారత క్షేత్రములకు బయలుదేరాడు. సకలతీర్థాలు సేవించాడు. పాండ్య దేశం చేరాడు.

పాండ్య దేశాన్ని మలయధ్వజుడు పాలిస్తున్నాడు అతని కుమార్తె చిత్రాంగద. వనంలో విహారం చేస్తోంది. ఆమె యీ బాటసారి కంటబడింది. దాంతో మరల అర్జునునికి కొత్త అధ్యాయం ప్రారంభమైంది. ఆమెను వివాహమాడి తన దానినిగా చేసుకుని తీరాలని పట్టుపట్టాడు. విశారదునితో యీవిషయమంతా చెప్పాడు. విశారదుని రాయబారంమీద మలయధ్వజుడు అంగీకరించాడు. యింతకూ ఆమెకు అంగీకారమే కాబట్టి- పెళ్ళి కొడుకులో లోపాలులేవు కాబట్టి, అర్జునుడే వ్యామోహితుడై కబురంపాడు కాబట్టి ఆడపెళ్లివారు అనగా మలయధ్వజ మహారాజు ఒక షరతు పెట్టాడు. ఆమె సంతానముతమకే వుండాలని. చిత్రాంగను వివాహం చేసుకున్నాడు కిరీటి.

◆ ◆ ◆

అచ్చటి నుండి సౌభద్రతీర్థానికి బయలుదేరాడు కిరీటి, అచ్చట స్నానముచేయ నదిలో దిగబోయినాడు. మునులు వచ్చి వారించారు. అందు మొసళ్ళు గలవనియు వచ్చిన వారినెల్ల హింసించుచున్నవని చెప్పారు. వీరుడను నామమున్న అర్జునుడు వూరక తిరిగిపోతాడా? దిగినాడు. ఒక మొసలి వచ్చినది. తన యెడమ చేత్తోనే లాగి బయటకు పారేశాడు. అది శాపముపోయి మనుష్య రూపం ధరించిన ఒక కన్యగా మారింది, సరే. ఆమె వివరాలడిగాడు.

ఆమె తాను 'నంద' యను యప్సరస యనీ, యింకా తన సోదరీమణులు ముప్వురు ఆ మడుగులో వున్నారని చెప్పింది. వారి పేర్లు లలిత, పద్మ, సౌరభేయి అని చెప్పింది. ఒక ముని శాపము వల్ల తమకాగతి వచ్చిందన్నది- 'మీ రాక వలననే' మాకు శాపవిముక్తి కల్గునని నారదుని వలన విన్నామని చెప్పుతుంది నంద, వారందరూ మరల అర్జునుని "కళ్యాణమస్తు" దీవించుతారు. అతడు ప్రభాస తీర్థమునకు బయలుదేరుతాడు.

◆ ◆ ◆

ద్వారకాపురము ప్రభాస తీర్థమునకు దగ్గిరనన్న మాట కిరీటి చెవిన పడుతుంది. వెంటనే అతనికి సుభద్ర ఆలోచన తప్ప మరొకటిలేదు. ఆమెను తన దానినిగా చేసుకొనుట ఎట్లా అని ఒకే జపములో మునిగిపోయాడు. ద్వారకాపురంలో నను ఎరగని వారులేరు సరాసరి పోదామంటె అనేక చిక్కులకులోను కావల్సివస్తుందేమో అనుకుంటాడు.

ద్వారకకు చేరుట ఎట్లా ఆలోచించాడు. యాదవులకు సన్యాసులంటె కడుభక్తియని ఎప్పుడోవిన్నమాట జ్ఞప్తికొచ్చింది. పరివారము నచ్చటనే నిలిపి తాను జటా వల్కలధారియైనాడు. కస్తూరిబొట్టు ధరించే లలాటంమీద భస్మధారణచేశాడు. జరీపట్టు బట్టలు కట్టినతను కాషాయ వస్త్రములు ధరించాడు. శరణన్న వారిని రక్షించుటకు వినియోగించు శస్త్రాస్త్రములను ధరించే చేతితో దండము పట్టుకొన్నాడు. వేరొకచేత కమండలం పట్టుకొన్నాడు.

బలరామునకు సుభద్రను తనకిచ్చి పరిణయముచేయుట కిష్టములేదు. కాని అఘటనాఘటన చతురుడు కృష్ణ పరమాత్మవున్నాడుగదా యనిధైర్యం తెచ్చుకొన్నాడు. కృష్ణపరమాత్మను తలిచాడు. అంతలోనే ప్రత్యక్షమైనాడు మురారి. ఆయనను చూడగానే ఆనందాశ్రువులు రాలు చుండగా అతనిపాదములకునమస్కరించాడు. కౌగలించు కున్నాడు కృష్ణపరమాత్మ'తన ముద్దుబావను.' జగన్నాటక సూత్రధారి అర్జునుని రాకకు, ఆ వేషంలో. గలకారణము వూహించాడు.

రైవతక పర్వతము యిచ్చటికి చాలసమీపము. అచ్చ టికి మిక్కిలి సమీపము మా ద్వారక. యీ రాత్రి అక్కడ గడపెదము. రేపు నీకోరిక నెరవేరుటకు తగిన సదుపాయాలు చేస్తానన్నాడు.

కృష్ణపరమాత్మ రైవతకాద్రి నుండి ద్వారక చేరాడు. ఒకనాడు బంధువులను, మంత్రులను సమావేశపరచి తనకు రైవతకోత్సవం చూడాలని ఆశ కల్గిందన్నాడు.

మరునాడు రైవతకాద్రి ఉత్సవమునకు అన్ని సంబా రాలు యేర్పాటు చేశారు. యాదవులు అందరూ బయలు దేరారు. బలరాముడుకూడా సతీసమేతంగా బయలుదేరాడు వుత్సాహంగా — అందరివద్ద అగరు. కస్తూరి వాసనలు గుబాళిస్తున్నాయ్. సాధారణముగా పదిమందితో విహార మునకు పోవుట అమితానంద దాయకము. అందులో యాదవులకు కృష్ణపరమాత్మతో విహారమునకు పోవుట యన్న వారి భాగ్యమే భాగ్యము.

శ్రీకృష్ణుడు తన భార్యలతో రైవతక పర్వతముచేరి ఆ పర్వతరాజమును పూజించాడు. సుభద్రకూడ అన్నల యానతితో బంగరు పల్లకిలో వచ్చింది. తాను మనసున ధనంజయుని తల్చుకుంటూ పూజచేసింది.

ఇదంతా చూస్తున్నాడు అర్జునుడు. తాను ద్వారకను గూర్చి విన్నమాట యదార్థమని తోచినది. వారందరి కిల కిలలు చూచేసరికి, సుభద్రను చూచిన పిదప ఆమె వంటి అందకత్తెలు తనింతవరకు చూచిన దేవతా స్త్రీలలోగాని. నాగకన్యలలోగానిలేరు. అహా! యేమీయీసౌందర్యము! విశాల నేత్రములు, నవుమోము, సన్నని నడుము, ఆమె ఒయ్యారము, అని ముగ్ధుడైనాడు. ఇన్ని మాటలేల? ఆమె యవ్వనము ఆలావణ్యము చూచిన మతియే పోవు ననిపించిందాతనికి.

ఉత్సవమైపోయింది. సుభద్రను మరల ద్వారకకు పంపుచూ బలరాముడు యీ కపట సన్యాసిని చూచినాడు. అతనికి యతులన్న అమితభక్తి. సాష్టాంగ ప్రణామం చేశాడు బలరాముడు. "స్వామీ తమరెందుండి యిటకు విచ్చేశారని యడిగాడు. అర్జునుడు తాను సందర్శించిన యాత్రా విశేషాలు తెల్పగా బలరాముడు వుప్పొంగి, "మాభాగ్యవశంచేత తమరు వచ్చారు. చాతుర్మాస్యలు (అనగా నాల్గుపూర్ణిమలు) యిక్కడేజరపాలని, కోరాడు తనకు కావలసిందదే కాబట్టి సరేనన్నాడు అర్జునసన్యాసి.

సంభాషణయైన పిదప అన్న బలరాము వెనుకనే యున్న సుభద్రను చూస్తూ, నిలబడిపోయాడు ఆమె జెడ అతని కాళ్ళకు బంధము వేసినదాయన్నట్లు.ఇంతలో కృష్ణ పరమాత్మ అక్కడికి చేరాడు. అర్జునుడు అతనిరాక తానుపట్టించుకోనివానివలె కదలిపోసాగాడు. బలరాముడు గ్రహించి అర్జునుని ఆపి, కృష్ణుని బిలచి వందనం చెయ్యి మన్నాడు చాతుర్మాస్యలు సేయమని కోరినట్లు చెప్పాడు తమ్మునికి, సన్యాసియు, కృష్ణుడు దొంగ చూపులు చూసు కున్నారు"మన వుద్యానవనంలో బస యేర్పాటుచేశాం, పరి చర్యకు. సుభద్రను నియోగించాం"అన్నాడు బలరాముడు. కృష్ణుడు ఆశ్చర్యంగా "సుభద్రనా! ఆమె పెళ్ళీడుపిల్ల! యౌవనవతి వయసులో నున్నాడు సుందరుడయిన యువ సన్యాసి. అదేమిటన్నా!" అన్నాడు.

"వీరు మహానుభావులు. మన మలాభావించ కూడదు. పూర్వమునుండి మునులకు కన్యలనే సేవకునియోగించుట యాచారము" అన్నాడు బలరాముడు.

అన్న యిష్టం ప్రకారం కృష్ణుడు సన్యాసిని తీసుకుని ద్వారకకు వెళ్ళాడు. ఉద్యానవనంలో బస యేర్పాటైంది. చెల్లెలు సుభద్రను పిలచి "చెల్లీ! మునీశ్వరులకు సేవ చెయ్యవమ్మా! నీ మనసున కోరిక మంజూరవుతుందని" చెప్పాడు పరమాత్మ.

"యతీశ్వరులకు అనుకూలంగా, యెప్పుడు బడితే అప్పుడు, యేదికావలయునన్న అదియిచ్చి వారి సేవకు

పూజాద్రవ్యములు సమకూర్చి వారి మన్నన పొందు మమ్మా!" అన్నాడు కృష్ణుడు.

*　　*　　*

రుక్మిణీ. సత్యల మందిరాలకు పోయాడు పరమాత్మ వారికి మాత్రము రహస్యంచెప్పాడు మునిరాకను గూర్చి.

"ఒకవేళ సుభద్ర కతడర్జునుడని తెలిసి ఆమె సిగ్గున వూరుకుంటే మీరే అతనికి వసతులన్నీ చూడండి" అని చెప్పాడు రుక్మిణీ సత్యలకు పరమాత్మ.

సన్యాసికి సుభద్ర పరిచర్య ఆరంభమైంది. మంచి మస్తులు ధరించి, లక్ష్మివలె అలంకరించుకొని, అందెలు మ్రోగుచుండగా సుభద్ర యతీశ్వరుని చెంతకు ప్రవేశించింది.

ఆమె రాక గమనించగానే కన్నులు మూసి, వూపిరి బిగబట్టి, ఒకే జపంలో మునిగిపోయాడు. ఆమె ఒయ్యారంగా నమస్కరించింది.

"స్వామీ! తమకు ఏమికావలెను- పూజకు పుష్పములు, ఫలములు తెత్తునా?" అని అడిగింది వినయంగా ఆ స్వామివారు కదలక సరే యన్నట్లు చెయివూపేవాడు.

ఆమె యెంతో భక్తితో చక్కని ఫలములు, పుష్పములు తెచ్చి అచట వుంచేది. తటుక్కున ప్రక్కకు పోయేది. అతడు తన కన్నులతో గాలము వేసినట్లు ఒక్కసారి మాత్రము ఆమెను చూచేవాడు. స్వామివారు భిక్ష జేయునపుడు ఆమె యేమిఅడిగిననూ, "నారాయణ" అనిమాత్రమని వూరకుండేవాడు.

ఆమె భావించేది. "ఏమబ్బా! మా బావ అర్జునుని పోలికలున్నవి, యీ యతిలో? యింత సుకుమారుడు ఏల యీ కఠిన వ్రతము బూనినాడు?" అని.

"బంగారు కుండతో జలము, లేత తీగకున్న పుష్పములు, మంచి ఫలములు దెమ్మని-" పనులలో ఆమెకు విశేషణములు కల్పించి పురమాయించేవాడు.

ఆమెను చూచుచున్న కొలది మోహముచేత తత్తరపడేవాడు. తన దగ్గరకుచేరినపుడు చేయిపట్టుకుంటే? కాని ఆమె అంగీకరించక అమాటా ఈమాటా అంటే? నగుబాటని భయపడేవాడు. తాను ఆమెకోసం యతి వేషంలో వచ్చాడు. అదృష్టవశము తన సేవకు వినియోగించారు.

ఆమె అధరములను చూస్తూ జపం మరచేవాడు. ఆమె సన్నని నడుము చూస్తూ 'నారాయణ' అనటం మానేశాడు. వేషం ఒక్కటి మాత్రం అతడు సన్యాసియని పిలిపించుకుంటోంది.

ఇది యిలావుండగా ఒకనాడు సుభద్ర తన చెలికత్తెలతో వచ్చి బంగారు పళ్ళెములతో భోజనము దెచ్చి అతనికి వడ్డించినది. ఆమెను చూచుటతప్ప అతనికి భోజనము మీద యిచ్ఛయే పోయింది. భోజనమైంది. అతడు చంద్రకాంతముల తిన్నెమీద కూర్చున్నాడు. ఒక పగడస్తంభము వెనుక ఒయ్యారంగా దాక్కున్నదామె. ఆమె ఓరగా చూచుట గ్రహించి-

"ఓ చకోరాక్షి! నిన్ను ఒక రాచిలుక పట్టుకొన్నది. నీకాలు ఒక రాజహంస తొక్కింది. మంచి శకునములు యివన్నీ. నీకు త్వరలో కల్యాణ ప్రాప్తివుంది" అన్నాడు. ఆమె కొంచెం దగ్గరకొచ్చి,

"స్వామీ! మీరు చాలా దేశం తిరిగారుకదా! అక్కడ చూచిన విశేషాలు మిమ్మడుగుదామని యెన్నాళ్ళనుండియో...." అన్నది సన్నగా.

'మీరు' యింద్రప్రస్థం వెళ్ళారా? మా బావ అర్జునుణ్ణి చూశారా? పాండవులలో మధ్యముడు, అతి పరాక్రమంతుడు అతనిని చూచినారా? భూప్రదక్షణానికి పోయాడట. మీరు సంచారులు. మీకెక్కడైన కనబడినాడా? అంది అమాయకంగా.

"సకల తీర్థములు చూచాము. బాలా! మీయర్జునుని కూడ చూచినాము." అన్నాడు. ఆమె పొంగింది.

"ఎక్కడ చూచారు స్వామీ! అన్నావు. అతనికి మాకు భేదములేదు. అణుమాత్రమైనా అతడే మేము. మేమే అతడు." అన్నాడు వ్యంగ్యంగా.

"అతడు మేము గోకర్ణంలో కలిశాము." అన్నాడు. "గోకర్ణమా? అది యిక్కడికి ఎంతదూరం స్వామీ! అతడిక్కడికి వస్తానన్నాడా?" అని కుతూహలంగా అడిగింది.

"ఏమమ్మా నీకతని యెడల అంత అనురాగమా? గుచ్చి గుచ్చి అడుగుతున్నావు. నీ మనసులో మాట చెప్పు దాచక." అన్నాడు. ఆమె ముందు వెనుకలు చూస్తోంది పాపం.

"అతడు సన్యాసిగా నీచెంతనే నీప్రాపుకోరి వున్నాడమ్మా! ఎన్నాళ్ళనుండియో అతనిని చూచుచుంటివి. యింకా తెలుసుకోలేదా? నీకోసం తపస్సు చేస్తున్నా నీకోసమే సన్యాసినయ్యాను. నేనే అర్జునుడను. యిక మన కోర్కెలు నెరవేరే రోజు వచ్చింది. సుభద్రా!" అన్నాడు.

ఆమెకు నోటమాట రాలేదు. కొంతసేపటికి తెప్పరిల్లి పారిపోతుంది-

"సుభద్రా! నిలు! నిలు!" దండ కమండలం వదలి వెంటపడ్డాడు అర్జునుడు. ఆమె చేయి పట్టుకున్నాడు. ఆమెకు చెమటలు పోసినయ్. వేదికమీదకు లాక్కు-పోయాడు. ఆమె వయ్యారంగా దూరంగాపోయి నిలబడింది.

"సుభద్రా నీవూ, నేనూ యిదివరలో చూచుకొనలేదు. వినికిడివలన మన మనస్సు లగ్నమైనది.

"ఓ చిలుకా! నువ్వన్నా మాట్లాడమని చెప్పు" మన్నాడు అక్కడ వాలిన చిలుకతో. చాలా అవస్థ పడ్డాడు.

"అంత తొందరెందుకు? పెద్దవారున్నారుగా మనకు పెళ్ళి చేయుటకు. కొంచెమాగమని చెప్పవే రామచిలుక" అన్నది ఆమె.

"మీవాళ్ళు యిదంతా తెలుసుకొనేదెప్పుడు, మనకు పెళ్ళి అయ్యేదెప్పుడు? ఎందుకు ఆలస్యం!" అన్నాడు.

♦ ♦ ♦

ఆమె అంతఃపురానికి సిగ్గుతో చేరింది. యిచట అర్జునుడు విరహాగ్నితో దహింతుచుకుపోతున్నాడు. పైన ఓ కుండెడు పన్నీరైనా చల్లేవారు దగ్గిరలేరు. ఈమె పరిస్థితి గ్రహించిన రుక్మిణి కపట సన్యాసికి భోజనం తీసికెళ్ళి వడ్డించింది.

ఎక్కడ చప్పుడైనా సుభద్ర వస్తున్నదేమో, ఎక్కడ మాట వినినా ఆమె పలుకేమో, అని విభ్రాంతితో వుండిపోయాడు. ఏదిక్కు వెలుతురు వచ్చినా అది సుభద్ర మేని కాంతియని తలచాడు-

♦ ♦ ♦

"ఏమిది ప్రారబ్ధము. యిన్నివాళ్ళనుండి చక్కగసేవ చేసినదె- నేనేల తొందరపడితిని. చదవేసిన వున్నమతి పోయేనన్నట్లు నా మొగమైనను చూడక అంతఃపురము నుండిరాదే. ఎరుగనప్పుడు బాధేలేదు. ఒకమారు చూచిపోయినను వేదనలేదు — చూచి, దరిచేరి, కొన్నినాళ్ళు ఏకాంతమున సేవ చేసి నా కన్నులముందర వెల్గు లెన్నో చూపినదే, యిపుడు యీ యెడబాటును భరించుటెట్లు? అర్జునుడనవి చెప్పగానే ఆచూపే చేపవలె ఎగిరి గంతేసినదే- గాంధర్వ వివాహం చేసుకోమంటిని పల్కు-లే బంగారమైపోయినవి- నేనేల నాపేరు చెప్పితిని. నా కోరిక యేల తెలివిమాలినవానినై తెల్పితిని? చేయి పట్టుకుని నేనెందుకటుల ప్రవర్తించాను? వున్న ప్రేమనంతయు ఒలకపోసి నేనెందుకు పిచ్చివానివలె ప్రవర్తించాను! ఏది ఎటులైనను నేనామెను వదులను. నేనెందుకు ఈ సన్యాసి రూపం ధరించాను? యీ వనంలో వుండటం ఎందుకు? బావలకు తెలిసిన ఏమనుకొందురు? మా అన్నలకు తెలిసిన యేమనుకొందురు?" అని తనలో తాను వాపోయాడు అర్జునుడు.

సుభద్ర ఏకాంతంలో పాన్పుపైన వడి అటూ యిటూ దృష్టులు సారించి యేమేమో ఆలోచిస్తోంది. "నేను ఎవరి ప్రేమకై తపించుచుంటినో ఆతడే దగ్గరకొచ్చినను చేవట్టగా ఏల తప్పించుకుని వచ్చాను? నన్నాతడు పగడపు తిన్నెపైకి చందమామనుచూపుతూ తీసికెళ్ళినపుడు నేనేల విదిలించుకుని దూరంగాపోయాను? యిదివరకువలె నేను ఆతని సేవకు మామూలుగా పోతేనో? మావాళ్ళు పెళ్ళి చేస్తారని చెప్పానుగదా. మరల నేనే స్వయంగా వెళితే తేలికగానా? నన్నుకోరి ఆతడుపడ్డ శ్రమలన్నిటికి, నేనెప్పుడు ఆతని చేరిఋణము తీర్చుకొందునోకదా? చేయి విదిలించుకున్న దోషమునకు కల్యాణము జరిగి మరల ఆచేతిని ఎప్పుడు గ్రహింతునో?" అని ఎమేమో తలచుకుంటూ కునుకు తీస్తుంది. మరల కలత నిదురలో మేల్కొంటుంది సుభద్ర.

చెలికత్తెలు సుభద్రను పచ్చలు "కిరీటి" పచ్చలనీ, భవనము, "విజయ" భవనమని అర్జునుపేర్లు వచ్చేలాగున మాట్లాడి పరిహాసం చేస్తున్నారు.

యింతలో రుక్మిణీ సత్యభామవచ్చి ఒకరికొకరు కనుసైగలు చేసుకొని, "ఎవరర్రా! మా ఆడపడుచును ఏమిటామాటలు" అని ఛలోక్తులు విసిరారు.

"ఏమమ్మా! సుభద్రా! నువ్వు ఆముని సేవకుపోవ టంలేదు. ఆతడేం తప్పు చేశాడమ్మా? చిలుకలనుకూడ కసురుకుంటున్నా వేమి? ఎవరిని మోహించా వమ్మా? దాచకనాతో చెప్పమ్మా" అని వదినెలు సరసమాడారు.

వూరుకోక సత్యభామ "శరీరము మహా వేడిగావుంది, కలవరిస్తున్నది. ఆ సన్యాసికే చూపెస్తే మంచిది." అన్నది, సుభద్ర మనోభీష్టము తక్కిన వారికి రహస్యంగాచెప్పింది సత్య.

సుభద్రను పన్నీటితో స్నానం చేయించారు. ఒంటినిండా గంధం పూశారు. మంచి రత్నాలహారాలు అలంకరించారు. పాముకూసం వంటి తెల్లని పావడావేశారు.

అర్జునుడు చిలుకలతో, గోరువంకలతో, మన్మధునితో చంద్రునితో తన సుభద్ర క్షేమాన్నిగూర్చి, ఆమె మనసు తనపై మరల్చమని ప్రార్థనలు చేస్తున్నాడు వనంలో.

* * *

సుభద్రవద్దనుండి బయలుదేరి రుక్మిణీ సత్యలు యీ విషయం దేవకీదేవికి తెల్పడంవుచితమని బయలుదేరారు. యీ సంగతి కృష్ణునకు ముందే తెలిసింది.

ఆలశ్య మెందుకు? అందరిని పిలిపించి అర్జునుని వేష కారణము సుభద్రకు అతనిపైగల మోహము వివరించి బలరామయ్యకు తెలియకుండ వివాహము జరుపనిశ్చ యించాడు కృష్ణపరమాత్మ. బలరాముడు సుభద్రను తన శిష్యుడైన దుర్యోధనున కిచ్చి వివాహం చెయ్యాలని పట్టుపట్టాడు ఒకప్పుడు.

మురారికి వుపాయాలకేంలోటు. "అంతర్ద్వీపంలో యిరవై రోజులు శివవుత్సవాలు జరుగుతాయ్‌గదా! అందు ఎనిమిదో రోజున సుభద్రార్జునుల వివాహం చేసేదాం" అన్నాడు సరేనన్నారు. దేవకితోచెప్పి తానుముహూర్తం వేళకి వస్తానన్నాడు పరమాత్మ. వసుదేవుణ్ణి ముందు ద్వీపానికి పొమ్మన్నాడు! అందరూ సంభారాలతో శివవుత్స వాలకు బయలుదేరారు. అంతా ఆటపాటలతో గడుపు తున్నారు. కృష్ణార్జునులు ఆనందంతో వున్నారు. రుక్మిణీ సత్యలు యిక్కడ సుభద్రను పెళ్ళి కూతురును చేశారు మోజుగా. గాజులు తొడిగించారు. పట్టుచీరెలు కట్టారు. ఆభరణాలుపెట్టారు. పాట పాడుతో హారతులిచ్చారు.

దేవేంద్రుడు "నాకుమారుని వివాహమునకు భూలో కానికెళ్ళాలి. అష్టదిక్పాలకులను పిలిచిరా" అని సముద్రు నికి శుభలేక క్రింద యిచ్చాడాఅన్నట్లు ఎర్రటి సూర్యబిం బము అస్తాద్రిని జేరుకుందుకు సముద్ర గర్భంలోకి పోయింది.

దేవేంద్రుడు తన కోడలికి మంగళసూత్రం తెస్తున్నాడా అన్నట్లు చంద్రుడక్కడ చేరాడు. తూర్పు దిక్కున.

కులదేవతను తెచ్చారు. ముత్యాల భాషికములు కట్టారు వధూవరులకు. మణులు పోసిన తలంబ్రాల బియ్యము తెచ్చారు.

"ఏమిది? కృష్ణపరమాత్మరాలేదని. జనులు, తన అన్న రాలేదని సుభద్ర ఎదురు చూస్తుండగా విచ్చేశాడు మురారి. సకల ఋషులు వచ్చారు. అరుంధతీ వసిష్టులు వచ్చారు. మేళాలు మోగుతున్నాయ్.

దేవేంద్రుడు తాను తెచ్చిన ఆభరణాలు చూపాడు. ముహూర్తం సమీపించిందని బృహస్పతి చెప్పాడు. మణిమయ భూషణాలతో కొడుకును అలంకరించి, తన యొక్క ఐరావతముమీదికి పెండ్లికొడుకును ఎక్కించాడు. ఆడపెళ్ళి వారింటికి బయలుదేరాడు పెళ్ళికొడుకు. జయంతుడు, ప్రద్యుమ్నుడు బంగారు బెత్తాలతో పూరేగింపులో దారి చేస్తున్నారు. దేవకీ వసుదేవుల యింటికి చేరగానే సాత్యకి చేయూత తీసుకుని ఏనుగు దిగాడు అర్జునుడు. ముత్తైదువు ముత్యాల అక్షింతలు చల్లారు. కుడిపాదము పెట్టి లోపలి కెళ్ళాడు- అర్జునుడు

నాగబలి అయిపోయింది. సుభద్రను వప్పగించారు అర్జునునకు. వదినలు ఆమెకు అత్తవారింట మెలగ వలసిన రీతులు చెప్పారు. ఆ సమయమున కన్నీరురాని కాంతలేదు, చెలులందరూ వచ్చి సుభద్రను నవ్వుతూ రథము మీదికెక్కించారు అర్జునుడు చెయ్యిచ్చి పైకితీసు కున్నాడు. రథం కదిలింది.

కావలి వారు శ్రీకృష్ణుని మాటమీద పోతున్న సుభద్రా ర్జునులను గుర్తుపట్టి బలరాముని చేత మాట వచ్చునని వారిలో వారు హెచ్చరిక చేసుకున్నారు.

పొలిమేరలో వీరి రథానికి యెదురుగా వస్తున్నారు. సుభద్ర గ్రహించి అన్న బలరాముడేమైనా వస్తున్నాడేమో అని చెప్పింది అర్జునునికి.

"నా అన్న సారధ్యం నేర్పాడు. మా వదిన సత్య యుద్ధము చేయటం నేర్పింది. నాకేం భయం" అన్నది.

"యీ చిన్న విషయానికి నీవు కూడా యుద్ధం చేయాలా సుభద్రా! చెండాడనూ?" అన్నాడు కిరీటి. కావలి వారు దగ్గరికొచ్చి కృష్ణుని రథమును, సుభద్రను గుర్తించారు. అడ్డము నిల్చారు. "సుభద్ర నెత్తుకు పోతున్నావా?" అని వారించారు. సుభద్ర రథం కదిలించింది. వారు బాణాలు వదిలారు. అర్జునుడు బాణాలతో చెండాడాడు, అంతా హతులైనారు.

రథం తన యింద్ర ప్రస్థమునకు పట్టించాడు దూత వలన సకల వృత్తాంతము ఎరిగిన ధర్మరాజు నకుల సహదేవులను పంపాడు, దారిలో వారిని కలుసుకుని యింద్ర ప్రస్థమునకు చేరాడు. ధర్మరాజుకు, కుంతికి, భీమునకు వందనం చేశాడు—ద్రౌపదిని కుశల మడిగాడు. హారతులిచ్చి దంపతులను లోనికి తీసికెళ్ళారు. అంతా సుఖంగా వున్నారు.




చిలుక మాయింట వెలసిన చిద్విలాసి
మాదు మాటలు ప్రతిగను, మారుబలుక
నిండు వేడుక వినంగ, నీదు మాట
సంత సంబయ్యె నీ వింత సరళిజూడ

కమ్మనిముద్దు పల్కుది గరుణ లొలుక
ముద్దు లందుకోవోయంచు మోమువంచి
వొయ్యారి మెడవంపు హంస వోలెనుండ
చల్ల ని చూపు వెల్లువ తెల్లమయ్యె

గళము నందున గుండ్రని కంఠమాల
భళిర! రంగు రంగులచీర బాగగట్టి
శౌర్య మునుదెల్పు ఎఱ్ఱని రవికదొడగి
తెలుపు రంగును రెక్కక్రిందుంగ దాచినావు

సకల సౌభాగ్య సంపదల్, సతతమిచ్చు
విశ్వ మానవ ప్రభావ వింతదెల్పు
నీదు పచ్చరంగయ్యెగా; దిద్దుకొంటి
వీవు జాతీయ పతాక రంగులన్ని

మోక్ష మార్గంబునకు ద్రోవ నీవె రామ
రామ యటంచు బిలువంగ రాధికావి
భుండె తుదకు నీ గర్భమునబుట్టె శుకమ
హర్షివీ వైతి నిన్ను ఋషులు మెచ్చ!



శ్రీమతి గాడిచెర్ల సుబ్బాయమ్మ.

# కవితిలక కాంచనపల్లి కనకాంబ

అన్ని విధములా అణగద్రొక్కబడి అజ్ఞానాంధకారమున కొట్టుమిట్టాడుచున్న నారీలోకమునకు శిరోమణియై దిక్తటముల దివ్య కాంతులను వెదజల్లుచు ఆదర్శ జీవయాత్రను సాగించిన ఆంధ్రనారీరత్నము ఈ కవితిలక కాంచనపల్లి కనకాంబగారు- ఇటీవలనే యీమె స్వర్గస్థురాలైనది.

ఈమె ప్రభవించిన రోజులలో పాశ్చాత్య నాగరికతాప్రభావము పరవళ్ళు త్రొక్కుచున్నది. అధునాతన సనాతన ధర్మములకు సంకుల సమరము జరుగుచున్నది.

సంఘ సంస్కరణములో, సాహిత్యములో, రాజకీయ వాతావరణములో నూతన ఝంఝూమారుతములు వీవసాగినవి- అట్టి సమయమున ఉద్భవించిన యీ కవితామతల్లి విద్వత్కవితిలకయై మూఢాచారములనే సంకెళ్లను సడలించుకొని, ఆ బాల్యవితుంతువయ్యును, నియమబద్ధమైన జీవితమును గడపుచు ఆశ్రితులకు ఆధ్యాత్మిక బోధనల నందజేయుచు, కళాత్మకమైన జీవితమును గడపినదీ కవితిలక—

సనాతనపు సంకెళ్లను సడలించినదే కాని అధునాతనపు వెర్రితలలు మాత్రము వేయలేదు వ్యక్తిత్వమును నిలబెట్టుకొనినది కాని అవ్యక్తముగ జీవించలేదు- స్వాతంత్ర్యమును కాపాడుకొనినదేకాని బానిసయై బ్రతుకు నీడ్వలేదు-

స్వధర్మము ననుష్ఠించుటయందే శక్తిని జూపినది కాని పరుల ధర్మములను పాటింపలేదు- ఆర్ష సాంప్రదాయములను అవగతము చేసుకొనినది కాని అంధురాలై అధోగతిపాలుగాలేదు-

స్త్రీకి స్వాతంత్ర్యము వ్యక్తిత్వము పాండిత్యము కవిత్వము ధర్మ పథానువర్తనము ముఖ్యములనియెంచి కాబోలు ఈసద్గుణము లన్నియు అలవరచుకొని ఆంధ్రనారీ లోకమునకు ఆదర్శ జీవితము తాను గడపి చూపినది. మద్రాసు క్వీను మేరీ కళాశాలయందు ఆంధ్రోపన్యాసకురాలై మన్ననలనందినది-- మరెందరిస్త్రీలకో ఉచితముగ విద్యగరపి స్వయంపోషకత్వమును గలిగించి వ్యక్తిత్వమును నిలబెట్టినది, ఇట్టి విదుషీమణి గడచిన సెప్టెంబరు మాసములో అస్తమించుటచే తీరనిలోటు వాటిల్లినదని చెప్పక తప్పదు. ★

## కృతజ్ఞత

కొద్ది మాసాల క్రిందట దివంగతులైన శ్రీ వేపా రామేశం పంతులుగారు అడయారు నందలి ఆంధ్రమహిళా సభ నర్సింగుహోములో ఉపయోగార్థం ఒక చక్రాల కుర్చీని, ఒక మంచాన్ని విరాళంగా యిచ్చారు. దానికి మహిళాసభ కృతజ్ఞత.

ఆమె సౌందర్యాన్ని ఆరాధించాడు; ఆమెఅభిప్రాయాన్ని గౌరవించలేకపోయాడు!

"నా అభిప్రాయానికి విలువనియ్యని వ్యక్తిని భాగస్వామిగా గౌరవించలేను" అన్నాడు;

కాని మన దృక్పథానికి సరిపడని ఆచారాల ఆచరణ:దండుగ! అన్న కనువిప్పు కల్గిందతనికి!

# మారని రాధ

ఆనాడు కళాశాల వార్షికోత్సవం. వాతావరణం చాల బాగా అలంకరించ బడింది. కొన్ని వేలమంది ప్రేక్షకులతో కిక్కిరిసి పోయింది. అదే కాలేజీలో చదివి ఎమ్.ఏ లో యూనివర్సిటీ ఫస్టుగానెగ్గి, ఫారిన్ వెళ్ళి పి. హెచ్. డి తో తిరిగి వచ్చిన ప్రభు కూడ హాజరయాడు.

అన్ని కార్యక్రమాలూ పూర్తయాక ఇంటరు స్టూడెంటు రాధ వీణవాయించింది- ఆ మధురగానం వింటూ అందరూ తన్మయులయారు. అతిసుందరమైన ఆమెరూపానికి ప్రభు ముగ్ధుడయాడు. ఆమెను తనకు పరిచయం చేయవలసిందిగా లెక్చరర్ అయిన ఒక స్నేహితుడిని కోరాడు.

కథానిక

"ఇతను డాక్టరు ప్రభు" అని రాధకు-

"ఈమె రాధ. యింటరు చదువు తూంది. చాల తెలివైంది!" అంటూ ఒకరికొకరిని పరిచయంచేశాడు.

రాధ ఆశ్చర్యంతో చిన్నగా నవ్వుతూ 'నమస్తే' అని చేతులు కలిపింది. ప్రభు తన్మయత్వంతో ప్రతి నమస్కారం చేశాడు.

♦ ♦ ♦

ప్రభు రాధను ఫ్రెండు యింట్లో రెండుసార్లు కలిసాడు. పరిచయం వృద్ధి అయింది. రాధకు తల్లీ ఒక తమ్ముడు ఉన్నారని తెలుసుకున్నాడు.

రాధ సౌందర్యానికి ముగ్ధుడైన ప్రభు ఆమెనే వివాహం చేసుకోవాలని నిశ్చయించు కున్నాడు. తండ్రి పెళ్ళి సంగతి యెత్తినప్పుడు తన అభిప్రాయం చెప్పాడు. ప్రభు యిష్టానికే ప్రాముఖ్యత నిచ్చిన తండ్రి రాధనుచూసి రాయబారాలు జరిపాడు. రాధ అదృష్టానికి తల్లి యెంతో మురిసిపోయింది.

శుభముహూర్తంలో రాధ ప్రభుల వివాహం అతివైభవంగా జరిగిపోయింది.

కొద్దిరోజులకే ప్రభు తండ్రి అకస్మాత్తుగా మరణించాడు.

♦

ప్రభు మద్రాసులోని ఒక ఇంగ్లీషు ఫర్ములో మేనేజరు. రాధనుకూడ తీసుకొని వెళ్ళిపోయాడు.

ప్రభుకి పాశ్చాత్య సాంప్రదాయాలంటే యెంతోయిష్టం. స్వదేశపు టాచారాలూ, సాంప్రదాయాలూ, అర్ధవిహీనమైన అతనికి మూఢనమ్మకం. రాధకూడ తన పంథానే అనుసరించాలని అతని కోరిక.

రాధకు భర్తంటే యెంతోప్రేమ, గౌరవం ఉన్నాయి. తనే స్వయంగా, అందంగా అన్ని పనులూ చేసుకుంటూంటే భర్త వారించి నౌకర్లను పెట్టడం కష్ట మనిపించింది.

ప్రభు పరాయిస్త్రీలతో చాల ఫ్రీగా మెలిగేవాడు. రాధకూడ అదే విధంగా అందరితో కలియాలని అతను కోరేవాడు, కాని రాధ మటుకు మనస్ఫూర్తిగా యిష్టపడలేక పోయింది. ఎప్పుడూ పార్టీలూ,

---

కుమారి డి. వాణి.

---

స్నేహితులూ, మికార్లతో హడావిడిగా ఉండే జీవితం కంటె ప్రశాంతంగా వీణవాయించుకుంటూ, చదువు కుంటూ. ఇంటిపట్టున ఉండటమే ఉత్తమమని రాధ అభిప్రాయం. కాని ప్రభుకి అదినచ్చలేదు. ఆమె సౌం దర్యాన్ని ఆరాధించిన ప్రభు ఆమె అభిప్రాయాల్ని గౌరవించలేక పోయాడు. ఆమె సంగీతాన్ని ఆరా ధించలేక పోయాడు.

నాకు కర్నాటక సంగీతం అంటే యిష్టంలేదు రాధా ! నీవు పియానో నేర్చుకొని ఇంగ్లీషు పాటలు వాయించాలి; ఇంకా మూఢాచారాల్ని పట్టుకొని ప్రేళ్ళాడటం నాకిష్టంలేదు, అన్నాడు. ఒకరోజున.

భర్తను కొంచెంగా అర్థంచేసు కొంటున్న రాధ కృంగిపోయింది. స్వదేశీయ సాంప్రదాయాలు అర్థ విహీనమైన వేనా? సంగీతానికి విలువలేదా? తన భావాల్ని గౌరవించి, తన సంగీతారాధనకు చేయూత నిచ్చే విశాలహృదయుడని మురిసి పోవడం భ్రమేనా? రాధయేమీ మాట్లాడలేక మౌనంగా వెళ్ళిపోయింది.

"నీవు జవాబు చెప్పనేలేదేం రాధా?" అని అడి గాడు మరువాడు.

"క్షమించండి, నాకామ్యూజిక్‌లో అభిరుచిలేదు!" అన్నది శాంతంగా. ప్రభు అహం దెబ్బతిన్నది,

"నా మాట ప్రకారం నడుచుకోవన్న మాట" అధికారంతో ఉరిమాడు. రాధ భయపడింది. "మిమ్మల్ని ఎదిరించడం నా ఉద్దేశంకాదు" మెల్లగా అని వెళ్ళిపోయింది.

కొన్ని రోజులు గడిచాయి. ప్రభు అహం రాధతో మాట్లాడనీయ లేదు. ఆమె చాల బాధ పడసాగింది.

ఆనాడు కార్తీక పౌర్ణమి. ప్రభు వెన్నెట్లో డాబా మీద పచారుచేస్తున్నాడు. రాధ గదిలో వీణ వాయి స్తూంది. సంగీతం వింటూ ప్రభు కొంచెం సేపు తనను మర్చిపోయాడు. కాని మరల కోపం తలెత్తింది. ఇంతలో రాధ యివతలకు వచ్చింది, భర్తకు నచ్చ జెప్పాలని. ప్రసన్నునిగా చేసుకోవాలని యెంతో ఆశతో అతనివైపు చూచింది.

"ప్రభూ !" ఆమె స్వరం అతి మృదువుగా మధు రంగా ఉంది.

"మన సంగీతానికి, సంస్కృతికి ప్రపంచంలో యెంతో ప్రాముఖ్యం, గౌరవం ఉన్నాయి. అంత ఉన్నతమైన వాటిని ఆరాధించి ధన్యులవడం ఉత్తమం కాని పరాయి సాంప్రదాయాలే మంచివని భావిస్తూ ఉండటం మనను మనమే కించపరచు కోవడం అవు తుంది!" రాధ మాటలు వింటూ ప్రభు కొంతసేపు మౌనంగా ఉండిపోయాడు. తనలో రేగే సంఘర్షణ నణచుకుంటూ ముఖం చిట్లించుకొని వెళ్ళిపోయాడు.

మరునాడు సాయంత్రం ప్రభు యింటికి వచ్చేసరికి రాధ రేడియో సంగీతం వింటూంది.

"ఆపు రాధా ! ఆపాట, " చికాకుగా అరిచాడు. రాధ రేడియో కట్టేసింది,

"నేనంటే నీకు లక్ష్యంలేనప్పుడు నీవిక్కడ ఉండటం అనవసరం," మూర్ఖంగా అన్నాడు. రాధ నిర్ఘాం తపోయింది. కళ్ళు నీళ్ళతో నిండాయి.

"మీరే నా సర్వస్వం. మీరేం చెప్పినా చేస్తాను. కాని—! కాని నాసంగీతాన్ని మట్టుకు మానుకోలేను" అన్నది గద్గద స్వరంతో.

"నా అభిప్రాయానికి విలువనీయని వ్యక్తిని నా భాగస్వామినిగా గౌరవించలేను" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు. రాధ ఆవేదనతో యేడుస్తూ కూర్చుండి పోయింది.

ప్రభు మౌనంగానే రాధ ప్రయణానికి యేర్పాట్లు చేయించాడు. ఆమె యెంతో బ్రతిమాలింది. ఎంతో బాధపడింది. కాని ప్రభూ యేమీ చలించలేదు.

రాధ వెళ్తూంటే ప్రభు బాల్కనీలోంచి చూడ కుండా ఉండలేక పోయాడు. ఆమెను వెనక్కుతీసుకు రావాలని, ఆమె ఉత్తమాదర్శాలను గౌరవించి, సుఖ పెట్టడం తనవిధి అని అంతరాత్మ ఘోషించింది. కాని ద్వేషం అతన్ని వెనక్కు లాగింది.

ప్రభుకి యిల్లంతా చిన్నబోయిన నట్లయింది. ఆమె మధుర స్వరం, వీణాగానం అతన్ని వెన్నాడసాగాయి. ఏదో బాధతోనే రెండు నెలలు గడిపాడు.

ప్రభుకి కలకత్తా బదిలీ అయింది. అక్కడ రామ ప్రసాద్ అతని సహోద్యోగి. అతని కూతురు విమల బి. ఎ. చదువుతూంది. ఆమె రాధవంటి సహజ సౌందర్యవతి కాకపోయినా నాజూకుగానే ఉంటుంది. ఆమె ప్రభు అభిప్రాయాలతో పూర్తిగా యేకీభవించే వ్యక్తి. అందుచేత యిద్దరూ త్వరలోనే గాఢ స్నేహితు లైనారు. ప్రభు తన గత చరిత్ర విమలకు తెలియ

నివ్వలేదు. ఇద్దరూ యింగ్లీషు మ్యూజిక్ వింటూ, ఇంగ్లీషు ఫిలిమ్స్ మాత్రమే చూస్తూ చాలా ఫ్రీగా పార్టీలకూ, షికార్లకు వెళ్ళేవారు. ప్రభు స్నేహం విమలలో ఆశ రేకెత్తించింది. ప్రభు విమలను పెళ్ళి చేసుకుందామని అనుకున్నాడు. ఆమెని అడగాలని ఎన్నో సార్లు ప్రయత్నించాడు. రాధ దీనస్వరూపం అతని కళ్ళముందు మెదిలేది. నమ్రతతో కూడిన ఆమె ప్రవర్తన గుర్తుకొచ్చేది. ఇంకేమీ మాట్లాలేకపోయేవాడు. ఆవిధంగా సంవత్సరం గడిచిపోయింది.

రాధ ప్రభుకు ఎన్నో ఉత్తరాలు రాసింది. కాని ఒక్కదానికికూడ ఆమె జవాబు అందుకోలేదు. తనకిక సుఖం శూన్యమని నిరాశ చెందింది. మనోవ్యాధితో శుష్కించిపోయింది.

విమల పరీక్షలు పూర్తయాయి. ఆమె తల్లి ఊరికి వెళ్ళాలని పట్టు పట్టింది. విమలకు, ప్రభుకు ఏమాత్రం యిష్టం లేకపోయినా వెళ్ళక తప్పలేదు.

విమల వెళ్ళాక ప్రభుకేమీ తోచలేదు. కాని రెండు నెలలకుగాని రాదనుకున్న విమల పదిరోజులకే తిరిగి రావటం ఆశ్చర్యం, ఆనందం కలిగించాయి. ఆ సాయంత్రమే పిక్చర్ ప్రోగ్రాం వేసి విమల యింటికి వెళ్ళాడు. కాని ఆమె యిదివరకటిలాగ ఉల్లాసంగా మాట్లాడలేదు.

'మంచి పిక్చర్ వచ్చింది వెళ్దాం విమలా',

'నేను రాను ప్రభూ! ఈవేళ ఒక ప్రఖ్యాత గాయని కర్ణాటక సంగీత కచ్చేరి ఉంది. వెళ్ళాలి', ముక్తసరిగా అన్నది. ప్రభు తెల్లబోయాడు.

'విమలా ! ఏమిటిమార్పు?' ఆశ్చర్యంతో అడిగాడు.

'జ్ఞానోదయమైంది ప్రభూ !" విమల కళ్లు నీళ్ళతో నిండాయి. ముఖం త్రిప్పుకుంది. ప్రభుకి పరిస్థితి అయోమయంగా ఉన్నా ఆమెను అనుసరించాడు.

సగంలోనే తలనొప్పిగా ఉందని లేచి వెళ్లిపోతున్న ప్రభును చూస్తూ విమల బాధగా నవ్వుకుంది.

పని ఒత్తిడివల్ల ప్రభు విమలను వారంరోజులవరకు కలుసుకోలేకపోయాడు. ఆదివారం సాయంత్రం వెళ్ళాడు. గుమ్మంలో అడుగు పెట్టగానే విమల పలకరింపులతో కల కలలాడే యిల్లు నిశ్శబ్దంగా ఉంది. విమల మేడమీద వున్నదని నౌఖరు చెప్పాడు.

విమల కిటికీదగ్గర కూర్చుంది. ఆమె కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి.

'విమలా ! ఒంట్లో బాగులేదా?' ప్రభు ప్రశ్న విని ఆమె త్రుళ్లిపడింది.

'అన్నయ్యా !' విమల గద్గదస్వరం సంబోధన ప్రభును కలవరపరిచాయి. నిరుత్తరుడై నిల్చుండిపోయాడు.

'పాశ్చత్య సాంప్రదాయాలు, అలవాట్లు మంచివే. కాని వాటినే మనమూ అనుకరించాలని, అవే గొప్పవని అనుకోవడంలో సుఖంలేదు. అవి మన దృక్పథాలకు సరిపడవు. ప్రపంచంలో ప్రత్యేకంగా గౌరవించబడే మన దేశాచారాల ప్రకారం నడుచుకోవడం ఆనందదాయకం,' అని ప్రభువైపు చూచింది. విమల మాటలు ప్రభులో ఆవేదనను రేపాయి. నిజమంతేనని. రాధని తిరస్కరించడం తప్పని తోచసాగింది.

'రాధ, నేను చిన్నప్పుడు కలసి చదువుకున్నాము. ఆమె తండ్రి పోయిన తరువాత వారు ఎక్కడికో వెళ్ళిపోయారు. ఇన్నేళ్లకు మేమిద్దరం అనుకోకుండా కలిశాం. ఉత్తమగుణ సంపన్న, సంగీతంలో మేటి అయిన రాధను కోరి వివాహం చేసుకొని, మొదటినించి నీలో పాతుకుపోయిన అభిప్రాయాలవలన న్యాయమాలోచించక వదిలిపెట్టావని తెలిసింది. ఆమె అనుదినమూ నీరాకకోసం యెదురుచూస్తూ నిరాశతో, మనోవ్యాధితో క్రుంగిపోతూంది. ఆమెకు నీ లక్ష్యంలేదని అపోహపడ్డావు కాని ఆమె నిష్కల్మష ప్రేమైక హృదయాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించలేదు. దివ్యమూర్తి అయిన రాధను బాధించడం నీకు తగదు అన్నయ్యా !' విమల కంఠం రుద్ధమైంది. ప్రభులో కలిగిన బాధకు అందులేదు.

'నీమాటలు నిజం విమలా! నేను రాధకు అన్యాయం చేశాను,' బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. విమల తృప్తిగా నవ్వుకుంది.

* * *

వీణ వాయించుకుంటున్న రాధ అడుగుల సవ్వడి విని తలెత్తింది. తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

'నిన్ను అర్థం చేసుకోకుండా చాలా బాధ పెట్టాను. నన్ను మన్నించు రాధా !' రుద్ధ కంఠంతో అన్నాడు ప్రభు.

ఆయింట్లో తిరిగీ ఆనందం, సౌఖ్యం వెల్లివిరిశాయి.

కుమారి మలినేని మంజూష.

అందాన్ని కొరుక్కు తింటామా? అంటారుకొందరు; వారందాన్ని అనుభవించలేని అసమర్థులు!
బాహ్యసౌందర్యం కంటె హృదయ సౌందర్యం ప్రధానం అంటారు
కాని బాహ్యసౌందర్యం లోపించిన ప్రతి వ్యక్తికీ
హృదయసౌందర్యం ఉందన్న గ్యారంటీఏది?

# కావలెను!

"నెలకు వెయ్యి రూపాయలకు పైగా సంపాదిస్తున్న అందమైన ఆంధ్ర యువకునకు చాల అందమైన వధువు కావలెను. కులముతో నిమిత్తములేదు. కట్నకానుక లవసరములేదు. వధువు ఫోటోతో వివరములతో పోస్టు బాక్సు 525, కేరాఫ్ "ది హిందు"కు వ్రాయండి."

సాయంత్రము నాలుగు గంటలకు అప్పుడే వచ్చిన హిందూ పేపరులోని ప్రకటనల పేజీని చూస్తున్న జానకిరామయ్యగారిని పై ప్రకటన విశేషముగా ఆకర్షించింది. ఆయనా ప్రకటనను ఒకటికి పదిసార్లు చదివి ఆలోచనలో పడ్డారు.

"నెలకు వెయ్యి రూపాయలకు పైగా సంపాదిస్తున్నాడు. పైగా అందమైన వాడు. ఈ రోజుల్లో వరులకు ఇంతకు మించిన అర్హతలేముంటాయి? కులముతో నిమిత్తము లేదట. కట్నకానుకల వసరములేదట. కుఱ్ఱవాడు చాల ఆదర్శభావాలు కలవాడుగ కనుపిస్తున్నాడు. ఇతనికి చాల అందమైన అమ్మాయిని పెళ్ళి చేసికోవాలనే కోరిక ఉన్నట్లు తెలుస్తోంది. అందుకే ఈ ప్రకటన చేశాడు.

అందమైన అమ్మాయిలు! ఈనాడు మన దేశంలో పెళ్ళి కాని అందమైన అమ్మాయిలెంతమంది ఉన్నారు? బహుశా చాల తక్కువ మంది. ఈ రోజుల్లో ప్రతి ఒక్కడికీ అందమైన యువతుల మీదనే మోజు. డబ్బున్నవానికి, డబ్బులేని వానికి, చదువున్నవానికి, చదువులేని వానికిచివరకు ఏమీలేనివానికి కూడ అందమైన పెళ్ళాం రావాలనే ఆశ. ఆశ ఉండం సహజమే. కాని దేనికైనా అంతు ఉండాలి. అందమైన యువకుడు, చాల అందమైన యువతిని ఆశించుటలో కొంత అర్థముంది. కాని అంద విహీనుడు చాల అందమైన యువతిని ఆశించుట ఖచ్చితముగ అత్యాశే. కాని అందమనేది ఏ కోశాన లేని కొందరు తమ డబ్బు, లేదా పదవి యొక్క ఆసరాతో ఇతరుల నిస్సహాయతను వినియోగించుకొని అందమైన అమ్మాయిలను పెళ్ళాడ గలుగుతున్నారు.అందమైన అమ్మాయిలకు కూడ ఆశలుంటాయని అందమైన భర్తలు రావాలనేవాహూ నిరంతరంకోరుకుంటారని చాల మందికి తెలియదు కాబోలు. ఒక అందమయిన అమ్మాయి ఒక అందవిహీనుణ్ణి పెళ్ళాడతానని ఒప్పుకుందంటే అది పరిస్థితులు ఒత్తిడి వల్లనే కాని మనస్ఫూర్తిగ కాదని గ్రహించగల శక్తి చాల మందికి ఉన్నదా?

సుబ్బారావు కూతురు శారదను తలంచుకుంటే తన కెప్పుడూ విచారము కలుగుతుంది. శారద బంగారపు బొమ్మ. ఏ వంకాలేని సుందరి.

# వధువు!

అటువంటి చక్కని పిల్లను సుబ్బారావు "కోల్ బ్లాక్ వానరముఖునకు" ఇచ్చి పెళ్ళి చేసాడు. పాపం సుబ్బారావు మట్టుకు ఏంచేస్తాడు? పరిస్థితులట్టివి. శారద ఎంత చక్కనిదైనా కట్నం లేకుండ ఆమెను పెళ్ళాడటానికి ఎవరూ ముందుకు రాలేదు ఆ ఒక్క వానరముఖుడు తప్ప. అతడైనా పిల్ల చాల అందమయినదైనందున ఆశపడి ఒప్పుకున్నాడు. ఆ పెళ్ళి వద్దని శారద ఎంత ఏడ్చిందో, ఆత్మహత్య చేసికొంటానని ఎంత బెదిరించిందో తనకు బాగా తెలుసు. కుఱ్ఱవానికి అందములేక పోతేనేం, అతడు చాల బుద్ధిమంతుడని, చాల తెలివైన వాడని, నెలకు ఆరు వందలకు పైగా సంపాదిస్తున్నాడని, భార్యను చాల సుఖపెట్టుతాడని, పువ్వులలో పెట్టి పూజిస్తాడని ఇంకేమేమో చెప్పి శారదను బలవంతముగ పెళ్ళికి ఒప్పించిన పెద్ద మనుష్యులలో తాను కూడా ఉన్నాడు. తన కాపెళ్లి జరగటం ఏ మాత్రము ఇష్టములేదు. కాని సుబ్బారావు కోరికపై తాను కూడ శారద నా పెళ్లికి బలవంతము చేసాడు. ప్రాణము మీద తీపిచేత చావలేకనే, శారద చివరికా పెళ్లి కొప్పుకుందని, తనకు బాగా తెలుసు.

పెళ్ళయిన తర్వాత ఈ సంవత్సరంన్నరలో శారద ఎంతగ మారి పోయింది ! గుర్తుపట్టుటకు వీలులేకుండ మారిపోయింది. ఆ అందమంతా ఏమయిపోయిందో? ఎప్పుడూ ఆమె పెదవులమీద మెరిసే చిరునవ్వు ఎక్కడికి పోయిందో? ఆమె భర్త ఆమెను చాల ప్రేమతోనే చూస్తాడట. అయినా ఆమెకు సుఖములేక పోవచ్చును. మానసిక బాధ మనిషిని శుష్కింప జేయుటలో ఆశ్చర్యమేముందిలే ! శారదకు పుట్టిన కొడుకును చూస్తే తనకెంతైనా విచారము కలిగింది. అంత అందమయిన శారదకు అంత కురూపియైన కొడుకా? భగవానుని లీలలు విచిత్రాలు !

తను కోరేదల్లా ఒకటే. శారదకు పట్టిన దుర్గతి తన ముద్దుల కూతురు సునందకు పట్టకుండ ఉండటమే. ఒకప్పుడు బాగా బ్రతికిన తాను బొత్తిగ చితికి పోయినందు వల్లనే కదా చక్కని చుక్కయైనా సునందకింత వరకు పెళ్లి చెయ్యలేక పోయాడు. సునందకేం తక్కువ? చాల అందమయినది. శారద కంటె కూడ అందమయినది. చాల బుద్ధిమంతురాలు. ఫస్టు క్లాసులో మెట్రిక్ పాసయింది. అయినా మూడేళ్ళుగ ప్రయత్నిస్తున్నా తాను సునందకు ఎందుకు పెళ్లి చేయలేకపోయాడు? తన దగ్గిరకట్నమియ్యడానికి వేల సంఖ్యలో రూపాయలు లేవు కాబట్టి. ఈ మధ్యనే వరకట్న నిషేధపు బిల్లును ప్రవేశపెట్టారు. అయినా ఏం లాభం? వరకట్నము రూపు మార్చుకొంది. అంతే ! ప్రజలలో సంస్కారము వర్థిల్లాలి. అప్పుడే పరిస్థితులు బాగవుతాయి.

తను సుబ్బారావులాటివాడయితే ఈ పాటికేదో విధంగా సునందకు పెళ్లిచేసేవాడే. ఆమె జీవితాన్ని నాశనంచేసేవాడే. కాని తన మనస్తత్వము వేరు. భావాలు వేరు. సునంద జీవితాంతము వరకు బ్రహ్మచారిణిగ ఉన్నా తానంతగ బాధపడడు. కాని ఆమె ఏకురూపికో భార్య అవుతే తాను చాల బాధపడతాడు. ఏ మాత్రము సహించలేడు. తన భావాలు చాల మందికి రుచించవని తనకు తెలుసు. అందముంటె కొరుక్కుతింటామా అని కొందరు అంటుంటారు. వాళ్ళంతా అందాన్ని అనుభవించలేని అసమర్థులు. లేదా తమ స్వార్థంకోసం మాటల్ని ఉపయోగించుకునే స్వార్థపరులు. మరి కొందరంటుంటారు బాహ్య సౌందర్యము కంటె హృదయ సౌందర్యమే ముఖ్యమైనదని. అది నిజమే. కాని బాహ్య సౌందర్యములోపించిన ప్రతి వ్యక్తికీ హృదయ సౌందర్యము తప్పకుండా ఉంటుందనే గ్యారంటీ ఏది?

ఏమైనా త్వరలోనే మంచిరోజులు వస్తాయనే ఆశ తనకుంది. ఇప్పుడిప్పుడే మంచి అర్హతలుగల కొందరుయువకులు కట్నంకానుక లేవితీసికోకుండ పెళ్ళి చేసుకోడానికి ముందుకువస్తున్నారు. అటు వంటప్పుడు సౌందర్య రాశియైన తన కూతురుకు తప్పకుండ మంచి భర్త లభిస్తాడు. తానుకూడ గట్టి ప్రయత్నాలుచేయాలి......

...ఇంకా ఆలోచించబోతున్న జానకి రామయ్యగారు "ఏమండీ"అనే భార్య పిలుపుతో మళ్ళా ఈ లోకంలోకి వచ్చిపడ్డారు. చిరు నవ్వుతో పేపరులోని ప్రకటనను భార్యకు చదివి వినిపించారు. సునంద ఆ అబ్బాయికి నచ్చ వచ్చుననే ఆశ తనకున్నదన్నారు. ఇంకా ఏమేమో అన్నారు.జానకిరామయ్యగారి మాట లను శ్రద్ధతో విన్న ఆయన భార్య ఒక చిరు నవ్వును నవ్వి పనుందని చెప్పి లోపలికి వెళ్ళింది.

ఆ మరునాడే జానకిరామయ్యగారు పోస్టు బాక్సు 525, కేరాఫ్ "ది హిందు" ఒక ఉత్త రములో సునందకు సంబంధించిన వివరములు చక్కగ వ్రాసారు. ఆ మధ్యనే విజయవాడలోని ఫోటోస్టూడియోలో తీయించిన సునంద ఫోటోనుకూడ ఉత్తరముతోపాటు పంపారు. ఉత్తరమును పోస్టుచేసిన నాలుగవ నాటి నుండియే జానకిరామయ్యగారు జవాబు కొరకు ఎదురు చూడటం ప్రారంభించారు. రోజులు గడుస్తున్నాయిగాని జవాబు మాత్రంరాలేదు. జానకిరామయ్యగారు ఆశతో ఇంకా ఎదురు చూస్తూనేఉన్నారు. పాపం! జవాబు రానే రాదని ఆయనకేం తెలుసు?

ఆ కాలేజి హాస్టలులోని తనగదిలో రామ్ కుమార్ పదిమంది మిత్రులకు ఒక చిన్న ట్రీట్ ఇస్తున్నాడు. అందరూ ఐస్‌క్రీము తిన్న తరువాత రామ్‌కుమార్ లేచి నిలబడి ఉపన్యాస ధోరణిలో ఇలా అన్నాడు. "సుమారు పది హేను రోజులక్రితం హిందూ పేపరులో "వధువు కావలెను" అనే ప్రకటనను నేను చేసినప్పుడు మీరందరూ నేను వట్టి తెలివి తక్కువ వాడినని, డబ్బును వేస్టు చేశానని, ఒక్క జవాబు కూడ రాదని. ఇంకా ఏమేమో అన్నారు. కాని ఇప్పుడు మీరు తెలివి తక్కువ వాళ్ళని ఋజు వయింది. నా ప్రకటనకు రెస్పాన్సుగ మొత్తము నూటఇరవై ఏడు ఉత్తరాలు వచ్చాయి. అందులో నూటపన్నెండు ఆంధ్రప్రదేశ్ నుండి వచ్చాయి, నేనూహించినట్లుగనే ప్రతి ఉత్తరముతో ఒక అందమైన అమ్మాయి ఫోటో పంపించబడినది. ఆ నూటఇరవై ఏడుగురు సుందరుల ఫోటోలను నేను మూడు చక్కని ఆల్బములలోనీటుగా అంటించాను. ఇందువల్లనే నేను రెండు రోజులుగ కాలేజికి రాలేదు. కేవ లము పదిరూపాయల ఖర్చుతో నూటఇరవై ఏడుగురు అందమైన అమ్మాయిల ఫోటోలను సంపాదించటం నిజంగా అదృష్టమనే చెప్పాలి"

మరో రెండు నిముషాలలో రామ్‌కుమార్ ఇచ్చిన ఫోటో ఆల్బములను తీసికొని అతని మిత్రులు ఆ ఆల్బములలోని అమ్మాయిల ఫోటో లను చూడటంలోను. యువకుల భాషలో ఆ అమ్మాయిల సౌందర్యాన్ని ప్రశంసించటంలోను నిమగ్నులైపోయారు. వారందరి ముఖాలు ఆనందముతో మెరుస్తున్నవి.

కాని బాధ్యత అంటే ఏమిటో సరిగా అర్థం చేసికోలేని రామ్‌కుమార్ గాని అతని మిత్రులు గాని, పలురకాల బాధ్యతలతో అపరిమిత మనః క్లేశాన్ననుభవించే జానకిరామయ్యలాంటి తండ్రు లవిషాదవదనాలను ఆ సుందరాంగుల ఫోటోల బాక్‌గ్రౌండులో చూడ గలిగిననాడు వారి ముఖాలు అలా ఆనందముతో మెరుస్తాయా? ఏమో!



# మెట్రిక్ పద్ధతి




మీరు కొనేటప్పుడైనా సరే, అమ్మేటప్పుడైనా సరే మెట్రిక్ తూకాలు, కొలతల పద్ధతి లెక్కలు కట్టడానికి ఎంతో సులువుగా వుంటుంది.

దేశ మంతటా తూకాలు, కొలతల విషయంలో ఒకే పద్ధతి ఉన్నట్టయితే. అది వ్యాపారాభివృద్ధికే కాక, జాతీయైక్యతకు కూడా దోహదం చేస్తుంది.

| వ్యాపార తూకాలు ఈ క్రింది విధంగా వుంటాయి | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పోత ఇనుము తూకాలు | | | ఇత్తడి/కంచు తూకాలు | | | | | |
| కిలోగ్రాము | | గ్రాము | కడ్డీలు మాత్రం | | సామానులు, కడ్డీలు | | | |
| | | | కిలోగ్రాము | | కిలోగ్రాము | గ్రాము | | |
| 50 | 5 | 500 | 20 | 5 | 1 | 500 | 50 | 5 |
| 20 | 2 | 200 | 10 | 2 | | 200 | 20 | 2 |
| 10 | 1 | 100 | | | | 100 | 10 | 1 |

**1 కిలోగ్రాము = 1,000 గ్రాములు = 86 తులాలు**

1958 సం, అక్టోబరు ఒకటవ తేదీనుండి వివిధ రాష్ట్రాలలోని ప్రత్యేకంగా పేర్కొనబడిన కొన్ని ప్రాంతాలలోనూ, కొన్ని పరిశ్రమలలోనూ మెట్రిక్ పద్ధతి తూకాలు, కొలతలు అమలుజరిపే కార్యక్రమం చట్టబద్ధ మయింది. ఈ పద్ధతి క్రమంగా దశల వారీగా దేశమంతటికీ వర్తింపబడుతుంది.

భారత ప్రభుత్వంవారిచే జారీచేయబడినది.

DA 58/320 a-TG



**కథానిక**

గతించిన రోజుల్ని స్మరించుకో దల్చుకుంటే ఈ నా మెట్లమీద కూచుని నది నీటి గలగలా రావాల్ని వినండి.

ఆశ్వీజ మాసం ప్రవేశించింది.

నది వరదల్లో ఉంది. నా మెట్లు నాలుగు మాత్రం పైకి తొంగి చూస్తున్నాయి. నది ఒడ్డుల్ని ఒరుసుకుంటూ పారుతోంది. ఒడ్డు పక్కన ఎదిగిన పొదలన్నీ నీళ్లలో మునిగిపోయాయి. చేపల పడవలన్నీ ఒడ్డునున్న చెట్లకు కట్టేసున్నాయి. ఒడ్డుమీద రకరకాల పచ్చ గడ్డి పువ్వులు అప్పుడే ఉదయిస్తున్న సూర్యుణ్ణి తలపైకెత్తి చూస్తూనవ్వుతూ పలకరిస్తున్నాయి.

పూజారి తన రాగిచెంబు తీసుకొని స్నానానికొచ్చాడు. స్త్రీలు ఇద్దరేసి, ముగ్గురేసి జట్లు జట్లుగా వచ్చి నదిలో నీళ్ళు ముంచుకెడుతున్నారు. స్నానవాటిక దగ్గరకు కుసుం వచ్చే వేళయింది.

కాని ఆ ఉదయం నాకామె కనిపించలేదు. స్వర్ణ, భువన్, రేవుదగ్గర విచారంగా ఉన్నారు. తమ స్నేహితురాలు ఎక్కడో దూరాన వున్న అత్తవారింటికి వెళ్ళిందని చెప్పారు వాళ్ళు.

రోజులు గడుస్తున్న కొద్దీ ఆమెను గురించిన ఆలోచనే నాకు కలుగలేదు. క్రమంగా ఆమె నామనో ఫలకం నుండి అదృశ్యమైంది. రేవులోని స్త్రీలు కుసుంని గురించి అరుదుగా కూడా తలపోయడంలేదు. కాని ఒకనాటి సాయంత్రం నాకు బాగా పరిచితమైన పాదాలు కనిపించినప్పుడు ఆశ్చర్యపోయాను. ఆమెపాదాలకు అందెలులేవు.

కుసుం వితంతువైంది. ఆమె భర్త ఎక్కడో దూర ప్రదేశంలో పనిచేసే వాడని తెలిసింది, ఆమె అతన్ని ఒకటి రెండు సార్లు మాత్రం చూసింది, అతని మరణవార్తను ఆమెకో ఉత్తరం అందించింది. పద్దెనిమిదిసంవత్సరాల వితంతువు నుదుటి తిలకం చెరిపేసుకుంది. చేతిగాజులు తీసేసుకుంది. తిరిగి గంగానది వొడ్డునున్న స్వగ్రామం చేరుకుంది. అక్కడామె స్నేహితురాండ్రెవరూ కనిపించలేదు. వారిలో స్వర్ణ, భువన్, అమల మొదలైన వారికి వివాహాలై వెళ్ళిపోయారు. ఇక శరత్ మాత్రం మిగిలింది, ఆమెకూడా వచ్చే డిసెంబరు మాసంలో వివాహ మవుతుంది. వర్షాకాలంలో వరద నీటితో గంగానది నీటి మట్టం పెరిగినట్టుగా కుసుం దినదిన ప్రవర్థమానమై యవ్వన ప్రాంగణంలోకి అడుగుపెట్టింది. కాని ఆకర్షణలేని ఆమె దుస్తులు, విచార వదనం, మౌన స్థితి. ఆమె యవ్వన సౌందర్యం మీద ముసుగు కప్పేశాయి.

---

మూలం: రవీంద్రకవి. అనుసరణ: కడియాల అమరసుందర్.

పది సంవత్సరాలు యిట్టే గడిచిపోయాయి. కుసుం యవ్వన ప్రాంగణంలోకి అడుగుపెట్టిందని ఎవరూ గుర్తించినట్టులేదు.

సెప్టెంబరు మాసాంతంలో ఒకనాటి సుప్రభాతం నాడు ఓ యువ సన్యాసి ఇప్పుడు నా ముందున్న శివాలయం లోని వచ్చాడు; అతడెక్కడ నుంచి వచ్చిందీ నాకు తెలియదు. కాని అతడిక్కడే నివాసం యేర్పరచుకొని ఉంటున్నాడు. అతని ఆగమన వార్త గ్రామమంతా పొక్కింది, స్త్రీలు నది దగ్గరే కుండలు వదిలేసి ఆ పవిత్ర సన్యాసి సందర్శనా భాగ్యాన్ని పొందడానికి గుళ్ళోకి పరుగెత్తారు.

రోజు రోజుకీ సన్యాసిని చూడ్డానికి జనం తీర్థంలా వస్తున్నారు. ఇంటింటా అతని పేరు మార్మోగుతోంది. ఒక రోజున అతడు భగవద్గీతా పారాయణం చేసేవాడు; మరో రోజున గీతా రహస్యాలు వెల్లడించేవాడు. కొంత మంది అతని ఆశీర్వచనం కోసం వచ్చేవారు. మరి కొంత మంది మందుల కోసం వచ్చేవారు.

నెలలు దొర్లిపోయాయి. ఏప్రియల్ మాసంలో సూర్య గ్రహణం నాడు గంగా నదిలో స్నానం చెయ్యడానికి జనం తండోప తండాలుగా వచ్చారు. సన్యాసిని సందర్శించడానికి వేలాది స్త్రీ, పురుషులు శివాలయంలోకి వెళ్ళారు. ఆ వెళ్ళిన వారిలో చాలా మంది స్త్రీలున్నారు. కుసుం అత్తవారి ఊరు నుంచి వచ్చిన స్త్రీలు కూడా అందులో కొందరున్నారు.

అది ప్రభాత సమయం. సన్యాసి నా మెట్లమీద నిలబడి జపమాల తిప్పుతున్నాడు. అంతలో ఓ యాత్రీకురాలు ఆ పక్కనున్నామె చెవిలో ఊదింది. "చూడు, ఇతడు మన కుసుం భర్త కదూ!" ఆ పక్కనున్నామె కొద్దిగా ముసుకు తొలగించి సన్యాసి వేపు పరీక్షగా చూసింది. "అవును, ఆతడు మన చటర్జీ కుటుంబంలోని కడగొట్టు వాడు" మరొకామె తన ముసుగును తొలగించి సన్యాసి వేపు చూసి అన్నది. "ఇతని ముక్కుతీరు, కళ్ళతీరు అచ్చం అలాగే వున్నాయి." మరొకామె కుండతో నీళ్ళు ముంచుకుంటూ సన్యాసి కేసి చూడకుండా అన్నది: "అయ్యో! అతడు చనిపోయాడు. చచ్చిపోయినవాడు తిరిగెలా వస్తాడు? ఇంతకు కుసుం దురదృష్టమది."

"అతని కింత పెద్ద గడ్డంలేదు. మరి సన్నగా వ్యాఖ్యానించింది. ఇక అక్కడితో ఆ ప్రస్తావన ఆగిపోయింది.

ఒకనాటి సంధ్యవేళ అప్పుడే పూర్ణచంద్రోదయమయింది. కుసుం నీటి ముందు నా కడ మెట్టుమీద కూచుంది. ఆమె నీడ నామీద పడుతోంది.

ఆ సమయంలో రేవు దగ్గర మరెవ్వరూలేరు, కీచురాళ్ళ సంగీతానికి నా చెవులు దిబ్బళ్ళు పడుతున్నాయి. గుళ్ళో గంటలు మోగడంలేదు. ఆ గంటల అంతిమశబ్ద తరంగాలు క్రమంగా క్షీణించి నదీ ప్రవాహపు గలగలా రావాల్లో మిళితమైపోయాయి. గంగానది నల్లటి నీటిమీద చంద్రకాంతి ప్రతిఫలించి వింత వెలుగులు కనిపిస్తున్నాయి. ఊరిబయట నక్కల కూతలు వినిపించి ఆగిపోయాయి.

శివాలయం నుంచి సన్యాసి నెమ్మదిగా బయట కొచ్చాడు. రేవుమెట్లు దిగుతూ అక్కడో స్త్రీ ఒంటరిగా కూచొని ఉండడం చూసి వెనుదిరిగి వెళ్ళబోయాడు. కుసుం తలపైకెత్తి వెనుదిరిగి చూసింది. ఆమె ముఖం మీది ముసుగు తొలగిపోయింది. చంద్రకాంతి ఆమె ముఖంమీద ప్రతిఫలించింది.

గుడ్లగూబ వారి తలల పైన చక్కర్లు కొట్టి అరుచుకుంటూ పోయింది. ఆ శబ్దానికి కుసుం తిరిగి ఈ లోకంలోకి వచ్చింది. ముసుగు ముఖం మీదికి లాక్కుంది. సన్యాసి పాదాలకు ఒంగి నమస్కరించింది.

అతడు దీవించి అడిగాడు: "ఎవరు నువ్వు?"

"నాపేరు కుసుం" చెప్పిందామె.

మరి వాళ్ళిద్దరి మధ్యా ఆ రాత్రి సంభాషణేమీ జరగలేదు, కుసుం నెమ్మదిగాలేచి ఇంటి ముఖంపట్టింది. కాని సన్యాసి మాత్రం ఆ రాత్రి చాలా గంటలు నా మెట్ల మీదే కూచొని గడిపాడు. చంద్రుడు తూర్పునుంచి పశ్చిమ దిశకు తిరిగినతరువాత, అతని నీడ వెనుక నుంచి ముందుకొచ్చిన పిదప సన్యాసి అక్కణ్ణుంచి కదిలి గుళ్ళోకి వెళ్ళాడు.

అప్పట్నుంచి కుసుం ప్రతిరోజూ సన్యాసి దగ్గరకొచ్చి అతని పాదాలకు ప్రణామం చేసేది. ఆతడు పవిత్ర గ్రంధాలను చదువుతూ చెబుతోంటే ఆమె ఓమూల నిశ్శబ్దంగా కూచొని వింటుండేది. అతడు ఉదయం తన కార్యక్రమమంతా ముగించుకొని కుసుంని పిలిచి మతవిష

కావు, కాని తనశక్తినంతా కేంద్రీకరించి అర్థంచేసుకోవడానికి ప్రయత్నించేది. ఆమె రోజూ గుళ్ళోపూజకు కావలసిన పనులన్నీ నిర్వహించేది. గంగానదినుంచి నీళ్ళుతెచ్చి గుడిని పరిశుభ్ర పరిచేది.

హేమంతం క్రమంగా తన ప్రభావాన్ని కోల్పోతోంది, చెదురు మదురుగా చలిగాలులు కొడుతున్నాయి. సాయంత్రంవేళ అప్పుడప్పుడు వెచ్చటి దక్షిణ పవనపు గాలులు వీస్తున్నాయి. పడవవాళ్ళు ప్రవాహపు దరవడికే తమ పడవలను వదిలిపెట్టి మురళీ గీతాలను ఆలాపించే కాలం ఆసన్నమయింది.

తిరిగి నాకు కుసుం కనిపించడం మానేసింది. కొంత కాలం గుళ్ళోకికాని, రేవుదగ్గరకుకాని, సన్యాసి దగ్గరకు కాని రాలేదు.

అందుక్కారణం మేమిటో నాకు తెలియదు. కాని తరువాత కొంతకాలానికి ఒకనాటి సంధ్యవేళ వాళ్ళిద్దరూ నా మెట్లమీద కూచునుండటం చూశాను.

కుసుం నేలకేసిచూస్తూ అడిగింది "స్వామీ! నా కోసం కబురు పంపారా?"

"అవును పంపాను. ఇన్ని రోజుల్నుంచి నువ్వు కనిపించడంలేదేం? దైవపూజ అశ్రద్ధ చెయ్యకూడదు"

ఆమె మౌనంగా కూచుండి పోయింది.

"నీకున్న భావాలేమిటో దాచకుండాచెప్పు"

"స్వామీ! నేను పాపిని. అంచేతనే దైవపూజను ఉపేక్షించాను." ఆమె ముఖం ఓ పక్కకుపెట్టి అన్నది,

"కుసుం. నీ హృదయంలో ఏదో అశాంతి చెలరేగుతుందని నాకు తెలుసు" అన్నాడు సన్యాసి.

ఆమె చీరచెరగు ముఖం మీదికి లాక్కుంది. అక్కణ్ణుంచి కదిలి సన్యాసి పాదాల కింద మెట్లమీద కూచుని రోదించ నారంభించింది.

అతడు కొంచెం పక్కకు తొలిగాడు. "నీ హృదయంలో ఏముందోచెప్పు. నీకుశాంతిమార్గం ఉపదేశిస్తా" అన్నాడు. ఆమె అప్పు డప్పుడు మాటలకోసం తడుముకుంటూ చెప్పుకుపోతున్నది" "మీరానతిస్తే మరి నేనిక మాటాడి తీరాలి. అయితే నేను పూర్తిగా వివరించి చెప్పలేను. స్వామీ. మీరుదాన్ని ఊహించుకోవాలి. నేనొకర్ని దేవుడిగా ఆరాధించాను, అర్చించాను. వారిమీద భక్తితో

నా హృదయం నిండిపోయింది. కాని ఒక రాత్రి స్వప్నంలో నా హృదయేశ్వరుడు తోటలో ఓమూల కూమని, నా కుడిచేతిని అతని వామ హస్తంలోకి తీసుకొని, నా చెవిలో ప్రణయపాఠాలు బోధిస్తున్నట్టు చూశాను. ఆ స్వప్నం అదృశ్యమయింది. కాని అది ఇంకా నా హృదయ ఫలకంమీద నిలిచేఉంది. ఆ మహానుభావుడు మరింత వెలుగు కాంతులలో కనిపించాడు. ఆ స్వప్న దృశ్యం నన్ను వెంటాడుతోంది. భయంచేత వారికి దూరంగా పారిపోయాను. కాని ఆ దృశ్యం మాత్రం అదృశ్యం కావడంలేదు. అప్పట్నుంచి నా హృదయం అశాంతిలో అలమటిస్తున్నది, నన్ను అంధకారం ఆక్రమించుకున్నది"

ఆమె తన కథ ముగించి కన్నీరు తుడుచుకుంటుంటే సన్యాసి తన కుడిపాదాన్ని నారాతి మీద గటిగా నొక్కడం చూశాను.

"నీ స్వప్నంలో ఎవర్ని చూశావో చెప్పు?" అడిగాడు సన్యాసి.

"చెప్పలేను" చేతులు కట్టుకు కూచుని అన్నదామె.

"అతడెవరయిందీ నువ్వు చెప్పితీరాలి" సన్యాసి పట్టుపట్టాడు అడిగిందామె.

"చెప్పి తీరవలసిందేనా?"

"ఆఁ తప్పకుండా"

ఆమె ఏడుస్తూ, "స్వామీ! మీరే వారు" అన్నది. ఆమె రాతిమీదబడి వెక్కి వెక్కి యేడ్చింది.

ఆమెకు తిరిగి తెలివొచ్చిన తరువాత సన్యాసి నెమ్మదిగా అన్నాడు. "ఇవ్వాళరాత్రి ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతున్నాను. ఇక తిరిగి నువ్వు నన్ను చూళ్ళేవు. నేనీ ప్రపంచానికి చెందినవాణ్ణికాను. సన్యాసినని మాత్రం గుర్తించి ఇక నన్ను మర్చిపో"

"అలాగే స్వామీ!" అన్నది కుసుం నెమ్మదిగా.

"మరి శెలవు తీసుకుంటున్నా" చెప్పాడు సన్యాసి.

కుసుం మారు మాటాడకుండా అతనికి వంగి నమస్కరించింది. అతని పాదాలవద్ద మట్టినితీసి తలమీద పెట్టుకుంది. అతడక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు...

చంద్రుడస్తమించాడు. ఆకాశం నుంచి భూమికిచీకటి తెరలు దిగాయి. నీటిలో ఒక్కసారి ధబ్బుమన్న ధ్వని వినిపించింది నాకు. ఆ చీకట్లో ఆకాశంలోని నక్షత్రాన్ని ఎగరకొట్టాలనికాబోలు గాలి మహోధృతంగా వీచింది.

స్కెచ్

# ఆపేక్షకు హద్దున్నదా?

శ్రీ ఆచంట జానకిరామ్

ఆపేక్షకు హద్దుందా?

ఏమి ప్రశ్న ఇది! పిచ్చి ప్రశ్న!– అంటారు, గాలికి హద్దున్నదా? వెలుతురుకు హద్దున్నదా?– అంటూ, మళ్ళా ప్రశ్నిస్తారు, నన్ను ఎంతో తెలివిగా.

నిజమే. గాలికి హద్దేమిటి? వెలుతురుకు హద్దేమిటి?

కాని, కిటికీ మూస్తే, గాలి ఆగిపోతుంది. స్విచ్ నొక్కితే, దీపం ఆరిపోతుంది, టక్కున.

హద్దు లేకేమి, మరి?

ఐతే కిటికీ మూసినంతమాత్రాన గాలి మాయమైపోలేదు. స్విచ్ నొక్కినంత మాత్రాన, గదిలో అసలే వెలుతురు లేకుండా పోలేదు. వాని తీవ్రత తగ్గింది; అంతే.

ప్రకటించడములో ఉన్నది అన్నమాట, హద్దు. ప్రహ్లాదుడు మనసులో హరినామ స్మరణ చేసుకోకూడదు, అని కాదు; పైకి ప్రకటింపకూడదు, అంతే. పైకి ప్రకటిస్తేనే తండ్రికి అయిష్టము. రాజద్రోహము. తనలో తాను ఎన్ని లక్షలసార్లు హరినామ సంకీర్తనం చేస్తే ఎవరికి కావాలి!

కాని, ఆపేక్ష అలాకాదు. మనకు ఆపేక్ష ఉన్నంతమాత్రాన చాలదు, మనకు. ఆ ఆపేక్ష ప్రకటించాలి. అవతలవారు ఆ ఆపేక్షను ఇంతో అంతో తిరిగి చూపాలి. అప్పుడే సంతుష్టి.

పొరిగింటి పార్వతి బిడ్డ ఎంత ముద్దొస్తున్నాడు! "ఎంత ముద్దొస్తున్నాడు, పాపాయి!" అనుకుంటే, అలా పైకి అంటే, చాలదు. పాపాయి పాలబుగ్గలు పుణికి ముద్దుపెట్టుకోవాలి. పాపాయిని మన చేతులలోనికి తీసుకుని లాలించాలి. అప్పుడే సంతుష్టి. ఆ పాపాయి మనలను చూచి చిరునవ్వు నవ్వెనా, ఆ బోసినోటినుండి వరహాలు రాలినట్లే! ఇంద్రుని సింహాసనము అక్కరలేదు.

కొందరు తమలో వెల్లువయే ఆపేక్షను దాచుకోలేరు. "ఆపుకోలేని మమత" వారిని పిచ్చివారినిగా చేస్తుంది. "అమ్మాయి" పుట్టిన రోజుకని పూల కానుక అర్పించాను నేను, ఈ మధ్యనే. తెల్ల సంపెంగలు, పచ్చ సంపెంగలు, ఆకుపచ్చ సంపెంగలు, అరవిందాలూ, మొగలి రేకులూ, మల్లెపువ్వులూ, తెల్ల గులాబీలూ, ఎఱ్ఱ గులాబీలూ, చామంతులూ బంతిపువ్వులూ, కనకాంబరాలూ, కురువేరు, పువ్వులూ, దవనం, మరువం, కురువేరూ, కదంబం అన్నీ యిచ్చాను. ఇవి చాలక మంచి గంధపుచెక్క పెట్టెనిండా ఇన్ని పొగడదండలుంచి ఇచ్చాను ఆమె చేతికి "వెయ్యేళ్ళు వర్ధిల్లు" అని దీవిస్తూ. కాని,

ఇంకా సంతుష్టి లేదే, నామనస్సుకు. ఎన్ని పువ్వులు చెప్పకలవు నేను చెప్పలేని మాటలను!

కొందరు మాత్రము, తమలోని క్షీరసాగర మంత ఆపేక్ష ఉన్నా ఒక్క చుక్క పైకి తొణకకుండా దాచుకోగలరు. హృదయపు విలువ హృదయానికి తెలియాలి, అంతే. ఆ పద్ధతే మంచిదేమో అనిపిస్తుంది, అనేకసార్లు.

మొదటివారికి తరుచు మొట్టికాయలు తప్పవు. రెండవవారు, సాధారణంగా, అంత బాధపడరు. బాధపడ్డా, ఆ బాధ పైకి తెలియనివ్వరు కాబట్టి, మనకు తెలియదు.

కొందరు పది పేజీలు ఉత్తరం రాసినా, తమ ఆపేక్ష విషయంలో తాము చెప్పవలసినదంతా చెప్పకలిగినట్టు ఉండదు, వారికి. కొందరు ఒక్క ముక్క వ్రాస్తారు:

"నిన్ను చూచి చాలారోజులైంది; ఎప్పుడొస్తావు?"- అంతే.

కాని, ఎంత తియ్యగా ఉన్నాయి, ఈమాటలు! ఆ ఒక్కముక్కలోనే ఉన్నది, సృష్టి నడిపించే ఆపేక్ష అంతా: "ఎప్పుడొస్తావు?"

మనం ఒకరికి కావాలన్నమాట. సాంగత్యం ఒకరికి ఆనందం కలిగిస్తుంది అన్నమాట. మనలను చూసీ చూడడంతోనే ఒకరికి కళ్ళు ధగ ధగ మెరుస్తాయన్నమాట. అంతకంటే ఏంకావాలి?

> కనుల నొండొరులను జూచుగొనుటకన్న,
> మనసు లన్యోన్యరంజన గొనుటకన్న,
> గొసరి 'ఏమోయి' యని పిల్చుకొనుటకన్న,
> జెలుల కిలమీద నేమికావలయు సఖుడ!

కాని, జీవితంలో ఆమాత్రమే కరువైతే!

కొందరు, అదోనియమమో, ఏమో, చీమ తలకాయంతైనా ఆపేక్ష ప్రకటింపరు. బడి నుంచి పిల్ల సంబరపడుతూ ఇంటికి వస్తుంది సాయంత్రపువేళ. కూడావచ్చిన నేస్తకత్తెలను విడిచి, ఒక్క పరుగున వచ్చి, తండ్రి కాళ్ళకు బంధాలు వేసుకుంటుంది.

"నానా! నాన్నా!! ఇవ్వాళేం, మరేం, మా బళ్ళోనేం,-- " అంటూ ఏదో చెప్పబోతుంది, చిట్టితల్లి, ఉత్సాహంతో, జిలిబిలి పలుకులతో.

"అబ్బ! ఉండు! మీద పడకు!" అని చీదరించుకుంటాడు, తండ్రి.

"నాన్నగారు యిప్పుడే ఆఫీసు నుంచి వచ్చారు. చిరాకు కలిగించకు, పాపా!" అటుంది, తల్లి- ఆయన చేతికి కాఫీ అందిస్తూ.

చూస్తున్న నాప్రాణం చివుక్కుమంటుంది.

అమ్మాయిని నా ఒళ్ళోకి తీసుకుని, ఇదుగో! నీకోసం బంతిపువ్వులు తెచ్చాను' అని బుజ్జగిస్తాను. నేనిచ్చిన పువ్వులు చిరునవ్వుతో అందుకుంటుందేగాని, చిట్టితల్లి మనస్సంతా తండ్రి మీదనే ఉంది. బడిలో జరిగిన విశేషం తండ్రికి చెప్పాలనే తహతహ. నా ఉపశమన అక్కరకు రాదు.

కాని, నాకు తెలిసిన ఒక అహమ్మదాబాద్ మిల్ యజమాని భార్య ప్రతిరాత్రీ, ప్రతిరాత్రీ సరిగ్గా పదకొండు గంటలకి, అంటే తను, పడుక్కోబోయేముందు, లండన్‌లో ఉన్న వాళ్ళ అమ్మాయికి టెలిఫోన్ చేస్తూ ఉంటుంది. ప్రతిరాత్రీ సరిగ్గా పదకొండు గంటలకి ట్రంక్ ఫోన్ అహమ్మదాబాద్‌నుంచి లండన్: "అమ్మాయీ కస్తూరిమాత్ర వేసుకున్నావా!" అని. ఎన్నడో మానివేసి ఉండవచ్చు అమ్మాయి కస్తూరి మాత్ర. కాని, తాను పడుక్కోబోయేముందు, ఒక్కసారి, ఒక్క నిముషం, కన్న కూతురిని పలుకరించి, ఆమె కంఠస్వరం వింటేనేగాని ఆతల్లికి నిద్దురరాదు. ఆ ఆపేక్ష అటువంటిది!

తల్లి ప్రేమను గురించి ఒక కథ చెపుతారు. ఇది చిరపరిచిత గాథ ఐనా, మళ్ళా చెప్పుకో వచ్చును. అంతటి ఆర్ద్రత ఉన్నది, ఆకథలో:

ఒక ఊళ్ళో ఒక తల్లికి ఒక్కడే కొడుకు. ఆ అబ్బాయి తండ్రి పాపం చిన్నప్పుడే పోతాడు. ఒక్కగానొక్క కొడుకును పంచ ప్రాణాలుగా పాటిస్తూ పెంచుకువస్తుంది, ఆతల్లి. అతను పెరిగి పెద్దవాడై ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు. అతి రూప లావణ్య ఆ యువతి. ఆమెకూడా ఇతనిని ప్రేమిస్తుంది. ఒక పర్యాయం అతని ప్రేమను పరీక్షించాలని తోస్తుంది, ఆ అమ్మాయికి. అటువంటప్పుడు స్త్రీలు ఎంతైనా కఠినంగా ఉండగలరు.

"నీవు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?" అంటుంది, ఆమె.

"నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను, నీవు తప్ప —" అతని మాటకు అడ్డమువచ్చి ఆమె అటుంది:

"నీవు నన్ను నిజంగా అంత ప్రేమిస్తే నేను ఏదడిగితే అది తెచ్చిపెడతావా?" అంటుంది.

అతి ఉత్సాహంతో అంటాడు అతను: "ఏదైనాసరే! వెంటనే చెప్పు; ఏదైనాసరే, తెచ్చిపెడతాను!" అని, బాస చేస్తాడు, చేతిలో చేయి వేసి.

"ఐతే మీ తల్లి హృదయాన్ని తెచ్చిపెట్టు నాకు!" అంటుంది, తొణకకుండా ఆమె.

నిర్ఘాంతపోతాడు, యువకుడు. కాని, మాట ఇచ్చాడు. ఆమె ప్రేమ అతనికి అవసరము. కుమిలిపోతూ యింటికి వెళతాడు అతను.

కాని, ఏమని అడుగుతాడు, తల్లిని! ఎంతటి ప్రేమ పిచ్చిఉన్నా, ఎలా అడుగుతాడు!... తల్లే తెలుసుకుంటుంది, ఎలాగో.

"ఈమాత్రానికేనా! నీవు సుఖపడడమే ముఖ్యము. తీసుకువెళ్ళు వెంటనే నీ ప్రియురాలు కోరిన కానుక. ఇదుగో కత్తి!" అని కత్తి అందిస్తుంది కన్నతల్లి.

తల్లి హృదయాన్ని మూటకట్టుకుని యువకుడు గబగబ పరుగెత్తుతాడు, ప్రియురాలి వద్దకు. వలపు తొందరలో అడుగులు తడబడి ద్వారబంధము అతని నెత్తికి తంగున తగులుతుంది.

"అబ్బా!" అంటాడు, బొప్పి తడుము కుంటూ, బాధతో, కొడుకు.

"దెబ్బ తగిలిందా నాయనా!" అంటుంది, జాలిగా మూటలోని మాతృ హృదయము.

అంత ఆపేక్ష అన్నమాట, అమ్మకు, మనమంటే.

తండ్రి ఆపేక్షా అపారమైనదే. కాని, సాధారణంగా, తండ్రి తనయునిపై తనకున్న విపరీతమైన ఆపేక్షను పైకి చూపడు- కొడుకును అదుపులో వుంచాలని కొంత, సున్నిత భావము మగ లక్షణము కాదని కొంత, కారణము కావచ్చు, ఇలా ఆపేక్ష దాచుకోడానికి. కొడుకుచేత కుటుంబ గౌరవము, పేరు ప్రతిష్ఠలు పాటింపజేయడము తండ్రి బాధ్యత— కూతురు చేత అవి పాటింపజేసే బాధ్యత తల్లిది ఐనట్టు.

ఈ కుటుంబ గౌరవము పాటించడములోనూ, పేరు ప్రతిష్ఠల విషయంలోనూ కాస్త తండ్రి సహించడు; "—ఛా! వాడు నా కొడుకు కాడు!" అనేస్తాడు తండ్రి.

అమ్మమాత్రం అలాకాదు. ఎలా ఉన్నా సరే, బిడ్డ తన బిడ్డే! లోకమంతా నిరసించినా సరే, అమ్మ కడుపులో పెట్టుకొని రక్షిస్తుంది, తప్పు చేసిన కొడుకును గాని, కూతుర్ను గాని. అంత మహత్తరమైనది, అమ్మ ఆపేక్ష!

స్నేహితులమధ్యా, విపరీతమైన ఆపేక్షకు అవకాశమున్నది. ఈ ఆపేక్ష, ఒకప్పుడు, పైకి కనిపించే కారణము వుంటుంది. ఆమనిషి స్వభావము, మాటతీరు, ఆమనిషి చేష్టలు,మనలను ఆకర్షిస్తాయి. అతనిలోని, ఆమెలోని అనిర్వచనీయమైన మధుర స్వభావము మనలను మంత్రముగ్ధులను చేస్తుంది.

ఒకప్పుడు, కొందరిపైన మనకు అకారణంగానే ఆపేక్ష కలుగుతుంది. ఎందువల్ల ఇంత ఆపేక్ష అంటే చెప్పలేము. ఈ ఆపేక్ష ఒక్కొక్కప్పుడు ఎంతవరకూ వెళుతుందీ అంటే మనము ప్రేమించిన వ్యక్తిలో ఉన్న లోపాలను కూడా సరకు చెయ్యము మనము. ఆలోపాలు లోపాలుగానే కనిపించవు మన కళ్లకు. ఆ లోపాలే ఇతరులలో మహా పాపాలుగా కనిపిస్తాయి మనకు. మనవారిలో ఆ లోపాలు ఉన్నట్టే తోచదు!

మనము ప్రేమించిన వారిలోని మంచి గుణాలను గోరంతలను కొండంతలుగా చేసి చూపిస్తుంది మనకు వారిపై గల ఆపేక్ష.

ఆమధ్య ఊరువెళ్ళి వస్తూ, కానుకగా కాబూలీ దానిమ్మపండు తీసుకువెళ్ళి యిచ్చాను తొలుత రచయితగా వారికి స్నేహమైన మితుల యింట. మరునాడు వ్రాశారు:

"మీరు వెళ్ళారు; ఇల్లంతా ఏదో వెల్తి. మీరు ఉన్నంతసేపూ ఏమీ గుర్తుకురాదు, ఎవ్వరికి.

మీ రచనలో ఉన్న మాధుర్యం మీరు తెచ్చిన దానిమ్మ పండులో ఉన్నది.

దానిమ్మగింజలంత మధురంగా మీ రచన ఉన్నదని కాదు- మీరు తేవడమువల్ల దానిమ్మ పండుకు కూడా, మీ రచనల మాధుర్యం వచ్చింది!" అని వ్రాశారు.

అలంకార శాస్త్ర రీత్యా, ఇది ఏదో ఒక తరహా అతిశయోక్తి, అంటారు. కాని, "ఆపేక్షాతిశయోక్తి" అని అనుకున్నాను, అటువంటి సమాసము లేనపోయినా.

నేను వ్రాశాను: "ఆపేక్షకు హద్దున్నదా?" అంటూ.

"ఆపేక్షకు హద్దున్నదా? అది మన మనస్సులోనే ఉన్నది!" అని జవాబు వచ్చింది.

చాలా భావగర్భితంగా ఉన్నదే, ఈ జవాబు అనుకున్నాను. ఒక రాత్రంతా ఆలోచించాను. ఆ నిర్వచనానికి అర్థము. మరునాడంతా ఆలోచించాను... ఇంకా ఆలోచిస్తూనే ఉన్నాను. ఆపేక్షకు హద్దు మనలోనే ఉన్నదా?

కాని, ఆ నిర్వచనం పూర్తిగా అవగాహన చేసుకొనేలోపుగా, అందాకా, ఇలా అర్థం చెప్పుకోవచ్చునేమో:

ఒక వ్యక్తిపై మనకు ఉండవలసిన ఆపేక్షకు హద్దు మనము మనస్సులో నియమించుకున్నదే- అని.

ఇలా ఆలోచింపగా నాకు తోస్తుంది:

నిజానికి ఆపేక్షకు హద్దులేదు.

కాని, ఆపేక్షను ప్రకటించడానికి మాత్రము హద్దు ఉన్నది— కావలసినంత హద్దు!

లోకాచారము, సంఘమర్యాద, సంస్కారపు కట్టుబాట్లూ ఈ హద్దును నియమించుతాయి. మన ఆపేక్ష పెద్ద కెరటంలా విరుచుకు పడకుండా, చెలియలి కట్టలా కాపాడతాయి.

ఆపేక్షకు హద్దులేదు; ఆ ఆపేక్షను పైకి చూపడానికి మాత్రం, ప్రస్ఫుటమైన హద్దు ఉన్నది.

ఆ హద్దు మీరితే తల బొప్పి కడుతుంది! ★

# వేదన

వేదనయే లేని బ్రతుకు
దూదికన్న తేలికౌను
వేదనలోనే పుట్టెను
వేదమ్ములు నాదమ్ములు

గుండె గండి పడ్డపుడే
గొప్ప కవిత్వము వచ్చును
ఆది కావ్యమే వేదన
కక్షర రూపము సుమ్మా

బాధపడిన హృదయమ్మే
పలికించును పరమాత్మను
పెల్లగిలిన కొండ్రలోనె
పల్లవించు పసిడి పంట

కలకాలము తేనె తేనె
గా బ్రతుకుట ప్రమాదమ్ము
విసపుగాడ్పు బుస బుసలను
విడుట మంచి దపుడప్పుడు

అమావాస్య వెంబడి పు
న్నమ రాత్రులు సాగినట్లు;
కష్టమ్ముల నంటుకొని సు
ఖమ్ములు రానే వచ్చును

ఎంతవాడికైన బాధ
లెపుడో ఒకప్పుడు తప్పవు
పరమశివుని యంతవాడు
గరళము మ్రింగగలేదా ?

మంచివారు బాధల కబ
ళించి సౌఖ్య మందింతురు
గడ్డిమేసి క్షీరమ్ముల
కాన్కవెట్టు ధేనువట్లు

శ్రీ సి. నారాయణరెడ్డి



# జంభాల వసుంధరలు



బౌద్ధ మతం యొక్క పుట్టుకా పెరుగుదలా మన జాతీయ జీవితంపై దాని ప్రభావమూ అనేక యితర విషయాలూ తెలుసుకోవాలంటే సారానాథ్ దర్శించాలి. అక్కడి పురావస్తు శాలలోని దివ్య శిల్పాలని తిలకించాలి, బౌద్ధ కళాఖండాలకి నిలయంగా రూపొందింది సారానాథ్ మ్యూజియం. బౌద్ధ మతాన్ని అవగాహన చేసుకోవాలంటే యీ కేంద్రాన్ని దర్శించి తీరాలి. పై శిల్ప ఖండము జంభాల వసుంధరుల గాధ నుండి చెక్కబడినది.

# తీరిన కోరిక!

చదువుకీ హృదయానికీ సంబంధంలేదు !
చదువు సంస్కారం కోసం.
హృదయం ప్రేమ కోసం.
సంస్కారాన్ని యివ్వని చదువూ; ప్రేమించడం
తెలియని హృదయమూ దండుగ ! !

శ్రీమతి కె. రామలక్ష్మి

[పెళ్ళి హడావిడిని సూచించే సన్నాయి మేళం వినిపిస్తూ వుంటుంది. గట్టిగా వినిపించి దూరం అయి పోతూ వుండగా స్త్రీ గొంతు...పార్వతిది.]

పార్వతి : పెళ్ళంటే ఎంత హడావిడీ? ఎప్పుడో రాత్రి పెళ్ళంటే తెల్లారేసరికి బాజా భజంత్రీలు రడీ. ముహూర్తం దగ్గిరవుతూన్న కొద్దీ—హడావిడి స్థాయి పెరిగి పోతూంది. రామరామ. చెవులుకాస్తా చిల్లులు పడిపోతాయో ఏమిటో .... పెళ్ళివారంతా అందమైన వాళ్ళేనట. అందరిలోకి పెళ్ళికూతురు మరీనట.... (చిన్నగా నవ్వుతూ) హుం, యింకనేం, కాలేజీ ఆడపిల్లలని చూసి చూసి అలసి పోయిన మరిదికి విశ్రాంతే .... ఇలా అద్దంముందు కూర్చుంటే మా పెద్దాడబడుచు చూడాలిట.... అయినా నాకేంహడావిడీ? యింటికి పెద్దకోడల్ని. హాయిగా అలంకరించుకొని తిరగడమే...యీ పెద్దజుట్టు వాలుజడవేస్తే యెంతో అందంగా వుంటుంది. కాని నలుగురూ ఏమంటారో; బాగా పైకి దువ్వి అజంతాముడి వేసుకుంటాను. చక్కగా, స్ఫటికంలా స్వచ్ఛంగావున్న యీ మెడని కప్పేయడం ఎందుకూ?.... ముత్యాల దుద్దులూ, చిన్న ముత్యాలహారం వేసుకుంటాను .... (తలుపు తీసిన చప్పుడు) రావచ్చు.

లక్ష్మి : వదినా....అయ్యబాబోయ్ ఏమిటొదినా యీ అలంకరణంతా? మా చిన్నన్నకు కదూ పెళ్ళి !

పా : అయితే ఏం చెయ్యమంటావు? కొంచెంమొఖానికి మసి పూసుకోనా?

ల : (బాధగా) అదేమిటొదినా అలా అంటావు? ఏదో వేళాకోళానికంటేను.... అయినా నీకింకో పనేముందీ అంతా తెరిపే. హాయిగా అలంకరించుకు కూర్చుంటావు. పిల్లా? పాపా? వాళ్ళని సర్దుకు వచ్చేసరికి మా శక్తులు ఆశక్తులూ కూడా నశించిపోతాయి....

పా : అవునవును. మీరు అలంకరించు కుందుకు టైముండదు. ఇంకొకళ్ళు అందంగా తయారైతే ఏదోలా వుంటుంది. అవునా?

ల : (విచారంగా) ఏమో ఒదినా, ప్రతిదానికీ నువ్వు విపరీతార్థాలు తీస్తావు. అయినా మాకెందుకూ ఏదోలా వుండడం, నీకుండాలికాని. అమ్మ పిలవమంటే వచ్చాను గాని ...

పా : (మధ్యలోనే ఆపేస్తూ) అవును. మీ యిష్టం వచ్చినట్లు అనుకోండి .... నేనూ అయినా హాయిగావుంటే మధ్యన అందరూ యిదై పోతున్నారు

ల : (కొంచెం కోపంగానే) ఎవరూ ఏం యిదైపోవండంలేదండీ ఒదినగారూ. ఊరు పిల్లల ముచ్చట్లుచూసి ఆనందిస్తున్నాడు మా అన్నగారు. అంతే. యింక నీ యిష్టం—ఒస్తే త్వరగా యివతలికి రా. అంతా రైలు కెడుతున్నాం.

పా : (వెళ్ళి పోతున్న లక్ష్మితో) నే రావడంలేదు లక్ష్మీ అంతా వెళ్ళిపొండి. (తలుపు తటాలున మూసిన చప్పుడు)

హుం, లోకం: నాలుగేళ్ళవో పిల్లా పాపా లేకపోతే ఎంతబాధ. ఎవరి కళ్ళైనా పడ్డం తరవాయి— యింకా

ఎప్పుడమ్మా అంటూ .... వెధవ గొడవ ... లక్ష్మి చూడు అప్పుడే ముగ్గురు పిల్లలు. వాళ్ళూ వాళ్ళ రోగాలూ.... యిక మా చెల్లి. రామరామ. దాని సంగతితల్చుకోకూడదు. దానికి ఒంట్లో ఓపికలేదు పిల్లలకి అసలేలేదు.... పెళ్ళయాక వాళ్ళని చూడలేదు. అవును అమ్మని చూసి ఎన్నాళ్ళయిందనీ. అమ్మ, అమ్మా. నా ఐశ్వర్యంలో నిన్ను కించపరచనమ్మా. అందుకే రాలేదు.... నాన్నలేని లోటు కన్పించకుండా మా ఐదుగుర్ని ఎలా పెంచావో. రాత బాగుండి నేనీ గొప్ప వారింట పడ్డాను. అందుకే అంతమే .... కారణం.—
(ఎవరో వస్తున్న చప్పుడు)

అత్త : ఇదేం సోద్యమే. శుభమల్లే అంతా వెడుతూంటే రానన్నావుటేం?

పా : నేనింకా తెమలలేదత్తయ్యా. టైమయిందంటేనూ.

అత్త : అయినా బొత్తిగా యింత యిదైతే ఎలాగే పెద్ద కోడలివి. నడుం బిగించి నాలుగూ సర్దుకోవసినదానివి.... చాల్చాలు, లే,....

పా : ఇదిగో వచ్చేస్తున్నానత్తయ్యా .... అందరి కంటె ముందర అక్కడ నేనెందుకూ అని....

అత్త : చాల్లే పార్వతీ, విధిని తప్పించుకు తిరగ్గలవా? ఎన్నాళ్ళు? వాడి అదృష్టం అదీ. వాడీడు వాళ్ళంతా పిల్ల పాపలతో ...

పా : ఊరుకోండి అత్తయ్యా మీరు అలాగే అంటున్నారు.

అత్త ; నేనడం ఏమిటే? నీకనిపించడం లేదూ? ఎంత హెచ్చరికగా వుండేవాడు. ఏదో సాధువులాగా తయారయ్యాడు.... అయినా నీకంత మంకుతనం కూడదు. డాక్టరుదగ్గిరకి వెళ్ళమంటే ససేమిరా అంటే....ఎందుకొచ్చిన గొడవలె.... రా. త్వరగా తెములు.

పా : (గద్గదంగా) వచ్చేస్తానత్తయ్యా.
ఇద్దరం హాయిగా వుండకుండా పిల్లల గొడవయేమిటి? మనస్సుకీ శరీరానికీ కూడా విశ్రాంతి లేకుండా.... నేనూ ఆయనా హాయిగా కబుర్లు చెప్పుకుంటూవుండే మధ్యన పిల్లలు కూడా ఎందుకు? గీపెట్టడం మొదలెడితే వూరుకోబెట్టలేక చావాలి....ఏం వద్దుబాబూ, యిలాగే కాలం వెళ్ళిపోతే అంతేచాలు....

♦ ♦ ♦

అత్త: ఏం చిన్నీ ఒదినేదే ఎంతకీ రాదేం? పోయి కూడా వచ్చాను....కొంచెం యీ వంటయింట్లో చూసుకోక పోతే ఎలాగే.

లక్ష్మి : (విసుగ్గా) ఏమోనమ్మా, ఆవిడసంగతి నన్నడక్కు; వెళ్ళి ఏదోచిన్న వేళాకోళంచేస్తే కస్సుమంటూ మీదికొచ్చింది. అయినా పిల్లలు లేరని తనకి బాధగా వుండాలికాని, వున్నారని నాకెందుకమ్మా బాధ. అదేమిటి? అలా ఒళ్ళు తెలియకుండా మాట్లాడుతుండేం?

అత్త : (నెమ్మదిగా) పోనీలే చిన్నీ. తన లేమి చెప్పుకోలేక యింకోళ్ల కలిమిని ఎత్తిపొడుస్తూంది పార్వతి; వయస్సులో పెద్దదయినా తెలివి తేటలురాందే మనం ఏం చేస్తాం తల్లీ.... (అప్పుడే వస్తూన్న పార్వతి)

పా : అదేమిటత్తయ్యా మీరూ అలాగే అంటారెందుకూ ఎందుకొచ్చిన బాదర బందీ .... యిలాగే హాయిగా వుంది నాకు....

అత్త : నీ ముఖం హాయేమిటి నాలుగేళ్ళయి ఓ పాపేనా లేకుండ వుండడం హాయా?

పా : (నెమ్మదిగా) నేనూ ఆయనా బాగానే వున్నాం ఎందుకో మధ్య వాళ్ళంతా బాధపడి పోతున్నారు.

అత్త : వాడు హాయిగా సంతోషంగా వున్నాడో లేదో, ఎప్పుడేనా కనుక్కున్నా?

పా : (ఏడుస్తూ) అందరూ విసుక్కునేవాళ్ళే ....నేనిక ఎవరి కళ్ళా పడను.

♦ ♦ ♦

అతను : ఏమిటి పార్వతి ఆలోచిస్తున్నావు? చూశావా మన రాముడు నా కళ్ళకింకా చంకకింద పుస్తకాలు పెట్టుకుని కాలేజీకి వెడుతున్నట్లే వుంది. అప్పుడే వాడికో పెళ్ళి; పెళ్ళాం. యింకో నాల్గు నెలలకో పాపాయీ. వాడి ముఖంచూడు. రమ పుట్టింటికివెడుతోందంటే బెంగెట్టుకు పోతున్నాడు.

పా : చదువుకున్న పిల్లే. కాని అప్పుడే మరదికి చెవులు కోసేస్తుందనుకోలేదు రమ. (చిన్నగా నవ్వుతూ)

అ : చదువుకీ హృదయానికీ సంబంధం వుండదు పార్వతీ. చదువు సంస్కారం కోసం. హృదయం ప్రేమకోసం. సంస్కారానికి బదులు అహం పెంచే చదువు దండగ పార్వతీ. అలాగే ప్రేమించని హృదయం కూడా.

ప్రసాదించు! ఎదురుచూడ్డానికి ఏమీలేని యీ జీవితం నుంచి విముక్తి ప్రసాదించు. ఇదివరకెన్నడూ నిన్నేం కోరలేదు. ఇప్పుడు అడుగుతున్నాను భగవాన్, ఏ కుంటైనా గుడ్డి అయినా ఫరవాలేదు. ఏ అవిటివాడైనా ఫరవాలేదు. నాకూ ఒక పాపని యియ్యి. నాకూ ఆ వాత్సల్యం ప్రసాదించు. భగవాన్....
(గట్టిగా ఏడుస్తుంది)

అ: (ఉలిక్కిపడినట్టు) ఏం పార్వతీ, నిద్రలో అలా ఏడుస్తున్నావు? పీడకల గానీ వచ్చిందా?....

పా: లైటార్పేసి పడుకోండి. నాకెంతో మనస్సు తేలిగ్గా వుంది....

అ: ఎందుకు పార్వతీ అంత భయపడ్డావు?

పా: ఏంలేదు.... నన్ను రేపు డాక్టరు దగ్గిరకి తీసుకు వెడతారా?

అ: అలాగే పార్వతీ, అన్ని గొడవలు మనస్సులో పెట్టుకు పడుకుంటే కలత నిదరగాక మరేమిటి?

పా: అలాగే అంటేకాదు. ఒట్టు.... వేయండి నాకూ ఒక పాప కావాలి. మనం సంతోషంగా హాయిగా ఉండాలి. యీ అందం చెడిపోయినా ఫరవాలేదు.

అ: (ఆప్యాయత ధ్వనిస్తూ) అందం చెడిపోవడం ఏమిటి పార్వతీ. మాతృదేవి అందం ఎవరికొస్తుంది? దానిదారి దానిదీ, దీనిదారి దీనిదీ....

పా: ఫరవాలేదు. ఏ అందం చూసి నన్ను పెళ్ళి చేసుకున్నారో. దాన్ని కాపాడుకోవడమే పరమావధిగా బ్రతికాను యిన్నాళ్ళూ. అంతేకాని, హృదయాల తడి ఆరిపోయి అందంగా బ్రతుకుతే చాలా? —

అ: పడుకో పార్వతీ. యింక తెల్లవారిపోతూంది.....

* * *

అత్త: ఒరేయ్ బాబూ. పార్వతికేమైనా బలానికి మందు లిప్పించరా.... నీరసంగా కన్పిస్తూంది.

అ: డాక్టరు యిస్తున్నవి చాలన్నదమ్మా. మరేంభయం లేదంది... అయినా ఏమిటో భయం భయంగానే వుందమ్మా....

అత్త: భయం దేనికి నాన్నా. మరేం ఫరవాలేదు. అన్నీ సవ్యంగా జరిగిపోతే సత్యానారాయణ వ్రతం చేసుకుంటాను,

అ: (నవ్వుతూ) ఆ పేరు మటుకు పెడతానని మొక్కుకోకు.

♦ ♦ ♦

అ: (ఆశ్చర్యంగా) అదేమిటి పార్వతీ? ఇదేంపని? నీకు పాప పుడితే పాతబట్టలకే కరువనా? ఇలా చీరె లన్నీ చింపేసి బొంతలు కుట్టేస్తున్నావు?

పా: (చిన్నగా నవ్వుతూ) బీరువాలో మూలుగుతూ యీ చీరలన్నీ ఏంచేస్తాయండీ. అయినా నాతరు తవీటికెవవారు?

అ: (దెబ్బతిన్నట్టుగా) అదేంమాటలు పార్వతీఎంత. మంది మాతృత్వం ధరించలేదు.... అయినా ధైర్యంగా వుండడంపోయి యిలా నాకేం బాగులేదు.

పా: ఏదో వేళాకోళానికంటే.... అంతేనా, ఏమో. పిల్లవాడంటూ పుట్టేక నేనెలావుంటానో? ఈ బీరువాలో చీరలే మిగిలితే వాటిని చూసి చూసి మీరు బాధ పడతారేమో.

అ: అదెమిటి పార్వతీ అలా మాట్లాడతావెందుకూ. నీ కళ్ళ పడకుండా వుంటేనే నయం. యిలాంటి ధోరణి వినేకంటె....

పా: ఎమండీ....
అవును, నాయెదుట ఎందుకు నిలుస్తారూ? తెలిసీ తెలియక పిచ్చిగా మాట్లాడేస్తున్నాను. అందర్నీ నొప్పిస్తున్నాను కాబోలు. ఛ. నాలో ఏమిటో ఈతత్వం. కోరికలు తీరుతున్నాయన్న సంతోషం విజృంభిస్తుంటే. ఎందుకో తెలియకుండా ఓడిపోతున్నానే అన్న బాధ యింకొకపక్క పీడిస్తూంది.

♦ ♦ ♦

అ: పార్వతీ. ఓ పార్వతీ.

పా: (ఎక్కడో లోపలినుంచి) వస్తున్నానండీ.

అ: వస్తున్నానంటూ కూర్చున్నావా పార్వతీ. పెట్లో ఏ చొక్కాలకీ బొత్తాలు లేవు. రెండు టాకాలు వేసి పెడుదూ. త్వరగా వెళ్ళాలి.

పా: ఒక్కక్షణం. ఇదిగో నానిగాడికి నీళ్ళు పోసేసి.

అ: (నవ్వుతూ) నామీద పూర్తిగా శీతకన్నేశావు పార్వతీ. నీళ్ళు పొయ్యడం అంటే.... తరవాత హంగామా అంతా అయేసరికి ఒంటిగంటా.... సరేలే అమ్మనేనా కుట్టిపెట్టమంటాను....

పా : అయితే పిల్లల్ని కంటేగాని ఆడదానికి ప్రేమ లేదనా అర్థం?

అ : నువ్వు పొరబడుతున్నావు పార్వతీ. మాతృత్వం అన్నది అనుభవించాలేగాని. ఎవరూ వివరంగా యిలాగుంటుందని చెప్పలేం. రమని చూడు, ఎంత అలసటగా వున్నా ఆ కళ్ళలో కళలు. ఆ పెదవుల మీద ఎందుకో తెలియని చిరునవ్వులు ....దొంగ తనంగా కూర్చుని చిన్ని చిన్ని చొక్కాలు కుడు తోంది....

పా : (ఏడుస్తూంది) అయితే నాకు హృదయం లేదంటారా? మిమ్మల్ని ప్రేమించలేదంటారా? చెప్పండి. నే నక్కరలేకపోతే వెళ్ళిపోతాను. అంతా సూటీపోటీ మాటలనే వాళ్ళే....(కోపంగా) మీరింకో వివాహం చేసుకోండి. నేను వచ్చిన చోటుకే పోతాను....

అ : (అప్రతుత ధ్వనిస్తూ) పార్వతీ, ఏమిటీ నీ ధోరణి?

పా : అవును. మీకూ అలాగే వుంటే యింకో సంబంధం చూసుకోండి....

అ : (బాధగా) చాలు పార్వతీ, చాలు, అలా మాట్లా డ్డానికి ముసలివాళ్ళు వున్నారు చాలు పార్వతీ. నువ్వైనా వూరుకుంటే ....ఎంత బాగుండును! ....

పా : (ఏడుస్తూ) వద్దు, నన్ను మభ్యపెట్టి కళ్ళుకప్ప కండి. పెద్దవాళ్లు చెప్పనే చెప్పారు. చేసుకోండి, యింకో పెళ్ళి చేసుకోండి. హాయిగా వుండండి....

అ : వద్దు పార్వతీ. అలా అనకు. నా హృదయం ఎంత పండించావో నీ ప్రేమతో ఎవరికీ తెలియదు. నువ్వు నా కళ్ళముందు వుండు .... అంతేచాలు పార్వతీ. అంతే చాలు. ఎప్పుడూ నన్ను విడిచి వెళ్ళకు. వెడతాననికూడా అనకు నన్ను. బాగా అర్థం చేసుకో.

పా : క్షమించండి. అందరూ ఏదో అంటూనే వున్నారు. పెళ్ళికి వచ్చిన చుట్టాల ముందు అత్తయ్య కంటతడే పెట్టేశారు. నన్నెందుకు యిక్కడ వుండమంటారు?

అ : నువ్వు వాళ్ళకోసమా పార్వతీ యీ యింటికి వస్త. పిచ్చిదానా, ఎవరేమంటే మనకేం, యిలారా, ఏదీ నవ్వు.... అలా కంటతడిపెట్టకు పార్వతీ. .... ఎవరేమన్నా, యిలా నా హృదయంలో తలదాచుకుని అన్నీ మరిచిపో పార్వతీ....

♦ ♦ ♦

పా : ఈ చీకటి ఎంత నిశ్శబ్దంగా వుందీ, అంతా ఎంత హాయిగా నిద్రపోతున్నారూ....మనస్సు కలచివేసిన మాటలూ వూహలూ యీ అర్ధరాత్రి కూడా యింకా సమసిపోక నన్ను వెంటాడుతూంటే యింక నిద్ర ఎలాగ పోవడం? ....ఎందుకిలా నలుగురి మధ్యా ఒంటరిగా బ్రతుకుతున్నట్లు? నిజంగా ఒక పాప వుంటే యీ ఏకాంతం అంత బాధాకరంగా వుండదేమో....రమ యింకపాపని ఎత్తుకు వస్తుంది. లాలిపాటలతో యిల్లు నిండుతుంది. అర్ధరాత్రి తెలివి వస్తే లైటువేసి పుస్తకం తీసే మరిది—పాపాయి లేస్తుందేమో అని లైటువెయ్యడు....ఎంతలో ఎంత మార్పు. మానవుల దృష్టిలో జీవితపు విలువలు ఎంత విభిన్నాలు!

అ : రా, పార్వతీ యింకా నిద్రపోలేదూ? వచ్చి పడుకో. రెండు గంటలు దాటుతూంది....

పా : ఆకాశం ఎంతో ప్రశాంతంగా వుంది. చక్కగా చుక్కలు మెరుస్తుంటే చూస్తున్నాను .... పడు కుంటాను....

(సంగీతం)

పా : అబ్బ. ఏం గొడవ? అందరికీ ఎందుకు యింత బాధ,

(తొందరతొందరగా)

గొం : ౧. ఏదోలా వుండడం నీకు కాని మాకెందుకూ?

గొం : ౨. నీకూ వుంటే తెలుసును ఆ వాత్సల్యం!

గొం : ౩. వున్నారని మాకెందుకూ బాధ. లేరని నీకుండాలి కాని—

(ఆ సంగీతాన్ని చీల్చుకుంటూ పార్వతి గొంతుక)

పా : (బాధధ్వనించే గొంతుతో) అబ్బ. వద్దు. ఎవరి కలిమినీ నేను ఎత్తి పొడవను. భగవాన్, నాకూ కావాలి, యీ ఏకాంతంలో నాకై చేతులు చాచే, నాకై అర్రులు చాచే పసికూన. ఈ కటిక చీకట్లో సహితం జ్యోతుల్లా వెలిగే చిన్న కన్నులు, హృదయం ఉప్పొంగేలా మూగగా ఆహ్వానించే చిరు చేతులు నాకూ ప్రసాదించు భగవాన్, నాకూ

పా : అంత హడావిడైతే ఎలాగండీమరీమా....ఏమండీ అందరి పాపలూ మూడోనెల బోర్లాపడతారు. వీడు పడలేదు. ఐదోనెల కూడా వెళ్ళవస్తున్నా వీడెందుకు బోర్లపడ్డు? చూడండి అమ్మని చూస్తే చాలు యిట్టే అనమాలు పట్టేస్తాడు, వాడి కళ్ళల్లో మెరుపే దానికినిదర్శన. రోజులు గడుస్తున్నకొద్ది నాకెందుకో భయంగావుంది... ఏమో, భగవంతుడా....

అ : ఏం పార్వతీ, కుట్టడం అయిందా?

పా : ఇదిగోనండీ అయిపోతూంది... నానిగాణ్ణి చూశారా? వెధవ. నోరు తెరచి నవ్వుతాడు. ఆ కళ్లు అలా మెరుస్తాయి... కాళ్ళూచేతులూ అంత యూడిస్తాడుకదా బోర్లా పడ్డేమండీ. ఓసారి డాక్టరుకి చూపిస్తారా?

అ : పడతాడు పార్వతీ. అయినా అనుమానం ఎందుకూ తీసుకెళ్ళి చూపిద్దాంలే.

♦ ♦ ♦

పా : అయ్యో నా స్వార్థంలో ఏదేవుళ్ళకి మొక్కానో. నాకోర్కెనిలా తీర్చారా, (ఏడుస్తుంది) అవును. కోరికలీప్రపంచంలో యిలాగే తీరుతూవుంటాయి. తీరా కోర్కెలు ఫలించాక— అయ్యో యిలా తీరకపోయినా బాగుండును- అన్పించేలా తీరాయి. లేకుంటే యిదేమిటి?నాకోర్కెనిలాగా తీరుస్తారు?....

అ : ఏంలాభం ఏడ్చి పార్వతీ, చూడు ముఖం ఎలా వాచిపోయిందో- మనం ఏంచెయ్యగలం పార్వతీ, వెన్నెముకలో జబ్బట; దానికేంచెయ్యలేరట పార్వతీ వైద్యంలోటు లేకుండా మనం ప్రయత్నం చేద్దాం.... వూరుకో పార్వతీ...

పా : (ఏడుస్తూనే) వూరుకోక ఏంచెయ్యమంటారు? శక్తిహీనుణ్ణి చేసినవాడు బుద్ధిహీనుణ్ణికూడా చెయ్యకూడదూ? చూడండి. ఆ తెలివితేటలు వుట్టిపడే ఆ కళ్ళు?.... బుద్ధేనా తెలియకుండావుంటే తన శక్తిహీనతని గుర్తించకుండానే— స్తబ్దుగా వుండును.... ఇలాంటి దురదృష్టవంతుణ్ణి చూస్తే ఏతల్లి మనస్సు మరిగిపోదు !.... (ఏడుస్తుంది)

అ : ఏడవకు పార్వతీ. మన అదృష్టం యింతే... ఏం చేస్తాం?

పా : (హేళనగా) ఊరుకుందాం. అందరి కోరికా యిలా తీరిందని సంతృప్తిపడదాం....

అయన హృదయం చిగురించాలనీ తానింకా వారికి సన్నిహితం కావాలని కోరిన కోరికయిది. హుఁ. పిచ్చిగాని మంచికోరితే తీర్చని దేవుళ్లు దేవతలూ మాటవరసకేనా చెడ్డని యిలా యిట్టేతథాస్తు అంటారా?....

అందరు అన్ని విధాలా అనుకుంటారు. అనుకోరూ మరి? అయ్యోపెద్ద కొడుకు కొడుకు అవిటివాడే అంటూ వాపోతున్నారు.

అందరి పిల్లల తల్లులనీ హేళనచేస్తే వూరికే పోతుందా అంటూ దెప్పుతుంది లక్ష్మి....

ఎవడో ఒకడు అక్కా, నీకూ మాతృత్వమంటే ఏమిటో అమ్మా అంటే తల్లి హృదయం ఎలా ఉప్పొంగిపోతుందో అర్థం అవుతుంది, స్త్రీకి జీవితంలో యీ అనుభవంవుండాలి అంటుంది రమ. ఏంచేస్తాం అలా బాధపడకు పార్వతీ అంటూరాయన... అవును.... ఏంచేస్తాను. మన చేతిలో ఏం లేనప్పుడు ! ఏకోర్కెలూ తీర్చని దేవతలు యిలాంటివేనా తీరుస్తారు !....

అవును బాబూ, నువ్వే కావాలినాకు, నా అవసరం నీకున్నంతకాలం అమ్మ నీకు దూరంకాదు బాబూ.... (ఆవేశంతో ఆనేసి ఏడుస్తుంది, సన్నగా సన్నని లాలిపాట నేపథ్యంలో విన్పిస్తుంది.)



# విరహిణి

ఆడిన మాటలు పాడిన పాటలు
వాడిన పూవుల నీడల కలిసె
ఏడీ నాసఖుడెందున్నాడో
నేడైనను కనరాడు చెలీ !

వెన్నెల వన్నెలు చెన్ను దొరంగెను
సన్నజాజులే చిన్నపోయెను—
మన్ననసేయని విన్నపమ్ములకు
కన్నులుకాయలు కాసె చెలీ !

ఎందరులేరో సుందరు లాతని
పొందుగోరు వారిందందెందో—
ఎన్నడైనను ఆనందించునో అని
డెందము సందియ మందు చెలీ !

రానిమ్మాతని చాన యెవర్తో
వైనము చెప్పినగాని ఒల్లను—
కానని చెలికా కన్నులు మూయుట?
దానవు డాతండౌను చెలీ !

ఆతని హృది నావాతెగ ఎరుగును
చేత మెరుంగును లోతుపాతులు—
నాతరమా, అనబోతిని ఏదో,
చేతకాదు విధివ్రాత చెలీ !!

నళినీకుమార్.

శ్రవ్యనాటిక :

# ఆత్మకథ

"శుభ"

(రాత్రి పది గంటల సూచనగా గడియారం పది గంటలు కొట్టింది. తారస్థాయిలో వైలిన్ అర్థంలేని విధంగా విషాదాన్ని సూచిస్తూంటుంది. శ్యామల కల కంటూ వుంటుంది. దూరాన్నుంచి అతను — విజయుడు పాడుతూంటాడు.)

ఏమాయెను మది
కేమాయెను సఖి....
ఎవరితో పలుకవు
అలుకతో నుందువు... ॥ఏ॥

అంతరంగమున
అదిమి పట్టినది
హాలాహలమా
అమృతమా సఖీ... ॥ఏ॥

శ్యామల : (కలలోనే కలవరపడుతూ) వద్దు, ఆ పాట నాకు వినిపించకు విజయ్. నాక్కాదుగా ఆ పాట రాస్త. ఆమె కోసమే! అన్నీ ఆమె కోసమే! నేనెంత వెర్రిదాన్ని, నువ్వేదిచేసినా, మాట్లాడినా ఊర్వశి కోసమేగా... నేనెంత వెర్రిదాన్నై పోయా...నా స్నేహితురాలు ప్రేమిస్తూన్న నీ మీద నాకు ప్రేమ కల్గడమేమిటి ? విజయ్, విజయ్.

(దిండుమీద ముఖం పెట్టుకు ఏడ్చిన శబ్దం. కుమిలి కుమిలి ఏడ్పు. అంతలోనే తలుపుమీద దబదబమని చప్పుడవుతుంది. ఉలిక్కిపడినట్లు మెలుకువతో.)

ఎవరది ? వస్తున్నా...

అతను : (దూరాన్నుంచే) శ్యామలా...శ్యామా—

శ్యా : వస్తున్నానంటే....(తలుపుతెరచిన శబ్దం) అదేమిటి, అలావున్నావేం ? దిగాలుపడిపోయి. ఏడుస్తున్నావా...ఛా ... అదేమిటి ... ఎందుకు కళ్ళుజ్యోతులయేలా ఏడుస్తున్నావు...ఊర్వశి.... అలా మాట్లాడకండా కంట తడిపెట్టుకుంటే ఎలా విజయా...సాయంత్రం బాగానే వుందిగా....

అ : అక్కణ్ణించే వస్తున్నాను శ్యామా. ఊర్వశి మనని విడిచిపెట్టి వెళ్ళిపోయింది.

శ్యా : (పట్టరాని దుఃఖంతో) ఆఖరికి నన్ను పురిడనివ్వకండా ఇంటికి తరిమివేశావు. ఊర్వశీ...విజయ్.... ఆఖరిక్షణాలలో స్పృహలోవుందా...?

అ : ఆఁ, స్పృహలోనే ఉంది. నా చెక్కిళ్ళు రాస్తూనే, నా కళ్ళల్లోకి చూస్తూనే, నా పేరు ఉచ్చరిస్తూనే కళ్ళు మూసింది. కళ్ళు మూసుకు పోతున్నా, ఎంతో ప్రయత్నంతో కళ్ళు తెరచి నావైపు చూస్తూనే నా చూపులు నీరూపాన్ని ఆ లోకంలోకి తెస్తాయి నా విజయా అంది.

శ్యా : ఎంత ప్రేమ నీవంటే ఆమెకు! విజయా, నిన్ను నేనెలా ఓదార్చగలను. నాకు బాధను భరించే శక్తి వుందికాని, బాధను తీసివేయగలశక్తి లేదు.

(తారస్థాయిలో వయొలిన్ కొంచెంసేపు విన్పిస్తుంది)

అ : ఊర్వశి వెళ్ళిపోయింది. నేనామెను మోసం చేశానా ? నేనై ఆమెను మోసం చేయలేదేమో. ఊర్వశి చేతి వ్రేళ్ళతో నా చేతి వేళ్ళను పెనవేసుకుని ఆమె ముఖంమీదకు వంగి నేను నవ్వించే కబుర్లు చెబుతే శ్యామ ఎందుకలా బాధపడేదో. విజయా, ఏదీ ఆ పాట పాడు అని నన్నడిగితే శ్యామ ఆ పాట భావానికి చేష్టలతో రూపాలు దిద్దేదెందుకో. విజయా, ప్రేమ ఆధ్యాత్మికమా భౌతికమా ? అని శ్యామల ఆ వేళ ఎందుకు అడిగింది చెప్మా, ఊర్వశి వెళ్ళిపోయింది. నేను నిజంగా ఎవరిని ప్రేమించాను....ఊర్వశినా, శ్యామలనా...అబ్బా....బుర్ర వేడెక్కి పిచ్చెత్తి

పోతూంది. ఎవరిని ప్రేమించాను. నేను ఎవరిని (ధీమాగా) ఊర్వశినే ప్రేమించాను. కాదు కాదు ...నిన్నే....నిన్నే శ్యామలా...నీ ముందు ఊర్వశి పై ఒలకబోసికొన్న ప్రేమంతా నీ కోసమే. ఛా....అబద్ధం...నన్ను విడువలేక విడువలేక విడిచి పోయిన ఊర్వశి ఆత్మ యీ మాట వింటే గిలగిల కొట్టుకోదూ....తననే ప్రేమించాననే సంతృప్తిలో చనిపోయిందే. ఊర్వశీ....(ఎలుగెత్తి) నన్ను నేను మోసగించుకుంటున్నా .... యథార్థం చెబితే ఊర్వశి స్నేహితురాలు శ్యామ ఏమనుకుంటుందో ....నన్ను గురించి...నామీద ఆమెకున్న గౌరవం పోతుందంతేగా....చపల చిత్తుడనంటుంది. చంచల మనస్సు కలవాడివని అసహ్యించుకుంటుంది. అంతేగా. ఇప్పుడే వెళ్ళి చెబుతా, శ్యామా... శ్యామా...

(మళ్ళా తారస్థాయిలో వయొలిన్)

శ్యా : (ఆనందంతో) మధూ, ఎంత నిండైన హృదయం కలవాడివి ... నిన్ను కష్ట పెట్టాను కదూ...నిద్రపోయిన అగ్నిపర్వతంలా వుండే దానిని. నీతోనేమిటి....ఎవరితోటీ మాట్లాడే దానిని కాదు. అందరూ పరిపరివిధాల అన్ని రకాలైన చూపులతోనూ నన్ను చూసేవారు. ఎవరికీ నేను అర్థం కాను. నటన అన్నారు. వారలా అనుకోడం సహజమేగా....ఎందుకంటే సహజంగా అందరిలా జీవించలేకపోయాను. ఒక వైపు నువ్వు, మరొక వైపు విజయుడు ఇద్దరూ నా గుండె ఆగిపోయేలా చేశారాయిరి...ఛా.... ఈ సమయంలో ఇద్దరూ జ్ఞాపకమొచ్చి మనస్సును కలవరపెడుతున్నారు. నీతో వుంటే విజయుడెందుకు లీలగా గోచరిస్తాడు.

(దూరాన్నుంచి)

ఏమాయెను మది
కేమాయెనె సఖి
ఎవరితో పలుకవు
అలుకతో నుందువు...

అదిగో మళ్ళా ఆ పాటే...(సీరియస్‌గా) నా మది కేమీ అవలేదు. నేను పారిజాతాన్ని. విజయా, ...(నాలుక కరుచుకున్నటుగా) అయ్యో, ఒళ్ళు తెలియకుండా ఇదేమిటి అతని పేరు అందరూ వినేలా పలుకుతున్నా....నా మధూ వినలేదుగదా...ఇద్దరి ప్రేమను హృదయంలో పదిలపరచుకోడం కష్టమబ్బా...ఇద్దరి ప్రేమను, అనురాగాన్ని భరిస్తూ బ్రతకగలనా ... మధూని మోసం చేయడంకాదూ...అతనెంత మంచివాడు. ఆ నోటా ఆ నోటా విని లోలోన మథనపడేకన్న గత జీవితపు ఛాయలేవైన వర్తమాన జీవితంపై పడి దుఃఖభాజనం చేసేముందే ఒకరితో ఒకరు హృదయాలు విప్పి చెప్పు కుంటే జీవితాలను నందనవనంగా మార్చుకోగలమన్నాడు. అని హృదయం విప్పి తన మనస్సుక్రింద నలిగిపోయిన విషయాలను చెప్పి ఏదో బరువుపోయినట్లు పెద్ద నిట్టూర్పుతో, కాంతి చిమ్మే కళ్ళతో నవ్వాడు.

నిజంగా నిన్ను మోసంచేయడం కాదు మధూ... అణిగి మణిగిపోయిన ఆవేశాలూ, ఆర్ద్రతలూ, అనురాగాలూ, అనునయాలూ అన్నీ జీవం సంపాదించుకున్నాయి, నీ స్పర్శఫలంగా....అరే, యీ అనుభవాలన్నీ నాలుకలు చాచుకు విజయుణ్ణెందుకు పల్కుతాయి. (కోపంగా) విజయుడుకాదు. మధూ. మధూ వుండగా విజయుడేమిటి మధూ నా భర్త. నా ఆరాధ్యదేవత. అగ్నిసాక్షిగా పవిత్రంగా పెళ్ళిచేసుకున్నాను....

పూర్వ స్మృతులతో పునర్జన్మ ఎత్తి వ్యక్తి జీవితం దుఃఖభాజనంగానే వుంటుందా .... ఏమో .... మధూని ప్రేమించినంతగా ప్రేమించలేదే.... ....ఎందుకీ విధంగా మనస్సుని సమాధానం చెప్పుకుని నన్ను నేనే మోసగించుకోడం....అందరూ, నా పరిస్థితులలోనున్న వారందరూ నాలాగే ఆత్మ ద్రోహం పాలవక తప్పదేమో....

ఏమైనా విజయునితో చెప్పేయాలి. నేను వివాహితనని, ఎన్నడూ నేను అతనిని మరోలా భావించలేదని లేకపోతే జీవితం యమయాతనై పోదూ....ఇప్పుడే వెళ్ళి చెప్పేస్తా....విజయా.... విజయా....

(తలుపు చప్పుడవుతుంది)

విజ : శ్యామా....శ్యామా....

శ్యా : ఎవరది ? నువ్వా....

వి : ఔను శ్యామా....

శ్యా : (సీరియస్‌గా) యీ సమయంలో ఎందు కొచ్చావు...

వి : శ్యామా....నా మనస్సులో నున్నది నీకు చెప్తే గాని నా మనస్సు శాంతించదు. ఊర్వశి....

శ్యా : అక్కడ ఆపేయి. ఊర్వశి చనిపోయిందిగా.... ఆమె ఆత్మకథ ఆమె ఆత్మలోనే గుప్తంగా వుండి పోయింది. అదృష్టవంతురాలు.

వి : ఇప్పుడు నాకు తెలిసింది శ్యామా....ఆమెను కాదు నేను ప్రేమిస్త నిన్ను. నిన్ను శ్యామా....

శ్యా : హుం....చపలచిత్తుడా....మిడత జీవితం అల వాటు చేసుకున్నావు...యీనాడు ఆమె గతిస్తే ఆ ప్రేమ నావైపు మరలించావా...విజయా నీ హృదయంలోకి ఒక్కసారి చూసుకో...ఏం.... ఎవరిని ప్రేమించావు ... ఇంతకాలం నన్నా ఊర్వశినా....ఊర్వశి ఆత్మకు ద్రోహం చేయక నా జీవితానికి చిచ్చుపెట్టక, కులాసాగా మరొకమ్మా యిని ప్రేమలూ, గీమలూ పెట్టుకోక సంసార పక్షంగా వివాహం చేసుకు జీవించు. వెళ్ళు....

**(తలుపు దభాలున వేసి కుమిలి కుమిలి ఏడుస్తుంది)**

అబ్బా, ఎంత కఠినంగా ప్రవర్తించాను...నా విజయునిపట్ల. విజయా, చపల చిత్తుడవు నీవు కాదు నేను. నేనే నీకా దిగ్భ్రమ కల్గించాను. నువ్వు అమాయకుడవు. హృదయ పూర్తిగా ఊర్వశిని నీ ఆరాధ్య దేవతగా భావించావు. నేనే, నీ మనస్సు కలవరపరచాను.

**(విషాద సంగీతం)**

ఎవరు....ఊర్వశీ...ఎందుకలా కోపంగా చూస్తు న్నావు. నన్ను నేను మోసగించుకుంటున్నానా.... నేను మోసకత్తెనా....ఔను. ఊర్వశీ నువ్వు బ్రతికి వుంటే విజయుణ్ణి పెళ్ళిచేసుకుని ఆదర్శంగా మీరిద్దరూ జీవించేవారు. నాకు యీర్ష్యా .... ఛా ఎందుకు? మిమ్మల్నిద్దర్నీ చూసి నేనెందుకు అసూయపడతాను. నేనూ మరొకరిని పెళ్లి చేసుకుని హాయిగా ఉండేదాన్ని, నిజమే ఊర్వశీ. నీవు చెప్పింది అక్షరాలా నిజం... నేను పెళ్లి చేసుకోకుండా ఉండి నీ ఆనందమయ జీవితం చూసి యేడ్చేదాన్నేమో ...నీ తోటి అబద్ధం చెప్పను.... నేనూ విజయుణ్ణి ప్రేమించాను. కాని ఇప్పుడు నాకు వివాహమైంది. నా మనస్సులోని పాత గాయాలు మానలేదు. **(ఏడుస్తుంది.)**

మ : **(నవ్వుతూ)** శ్యామా, శ్యామా, ఏమిటదికలవ రిస్తున్నావు...

శ్యా : **(తనలోని రహస్యాన్ని దాచుకుందామనే ప్రయత్నంతో కొంచెం కంగారుతో.)** అబ్బే...ఏం లేదు మధూ... మిమ్మల్ని ఏమైనా కేకలేసి నిద్ర మేల్కొల్పానా...

మ : నాకు తెలుసులే **(లాలనగా అంటాడు.)**

శ్యా : **(చాలా కంగారుతో)** ఏమిటి మధూ...

మ : నిన్ను లోన బాధిస్తున్న విషయాలు ఒక్కొక్క ప్పుడు పట్టుతప్పి పీడ కలల రూపంలో పైకి వచ్చి ప్రక్కవారిని కూడా కలవర పెడతాయి. చూశావా...నేనెప్పుడైనా నీకు అటువంటి కలల చేత నిద్రాభంగం కలిగించానా?

శ్యా : లేదుమధూ....నీకు కలలు రావా....

మ : ఎందుకు రావు...

శ్యా : మరి నిన్ను బాధ పెట్టవా అవి....

మ : నన్నెందుకు బాధపెట్టాలి... నేనేదీ దాచుకో లేదుగా....

శ్యా : **(దుఃఖంతో)** మధూ....ఎందుకా కలలు అలా వస్తాయో నాకే తెలియడంలేదు. పిచ్చి ఎత్తిం చేస్తున్నా యీ కలలు....అబ్బా....**(ఏడుస్తుంది.)**

మ : అటువంటి కలలు రాకుండా వుండడానికి ఒక్కటే మందుంది...

శ్యా : **(ఆత్రంగా)** ఏమిటది....?

మ : ఏదీ మనస్సులో పదిలంగా దాచకుండా వుండ డమే....

శ్యా : అదేమిటి మధూ ... మానవుని బ్రతుకులో కొంత స్వంతముంటుందంటావుగా___

మ : నిజమే....ఆ స్వంతమనే బ్రతుకులో దాచబడినవి ఉన్నాయిగా....దాచకూడనవి దాచ యత్నిస్తే నే ఒకానొక సంఘటన ఫలితంగా అవి కట్లు తెంచుకు

మనస్సును చీకాకుపరచి బ్రతుకులను నిష్కార ణంగా దుఃఖంపాలు చేస్తాయి శ్యామా....

శ్యా : (దీనంగా) మధూ ....

మ : ఏం .... ఇప్పుడర్థమైందా....

శ్యా : (ఏడుస్తూ) అర్థమైంది మధూ ....

మ : పోయి పడుకుంటూ శ్యామా ....

శ్యా : (లాలనతో) నిద్రపాడుచేశాను.... చెడ్డదాన్ని.

మ : (నవ్వుతూ) నేను నిద్రపోతేగా ....

శ్యా : నిజంగా ! ....

మ : (నవ్వుతాడు)

శా : (తనలో) పాదుకల .... విజయుణ్ణి కాని, ఊర్వశిని కాని తలవనైనా తలవలేదే .... అతను ప్రక్కనుండగానే రావాలీ....పీడకల మధ్యాహం రాకూడదూ .... ఇప్పుడు నేను ఏది చెప్పినా నమ్మరే.... పోనీ యదార్థం చెప్పేస్తే .... చెప్పడ మెలాగ .... మొగాళ్ళంటే ఇట్టే చెప్పేస్తారు. గొప్పగాకూడా చెబుతారు. గుదిబండలా దిగజార దీస్తూన్న యీ విషయం కాస్తా చెప్పేస్తే నా గుండె తేలికవుతుందే. అతను చెప్పినది నేను నమ్మలేదూ .... అలాగే నేను చెప్పినదీ ఆయన నమ్మాలి. అమ్మో, ఆడది నమ్ముతుందికాని మొగ వాడు ఆడది చెప్పినది నమ్మినట్లు నటించినా అను మాన పిశాచంతో పీడించబడతాడు, మధూ అందరి మగవారిలాంటివాడుగాడు .... ఆఁ .... ఎవరుచూశారు .... తనని గురించి నాకు చెప్ప డంలో ఏదో ఎత్తే వుండాలి. వెర్రిబాగులదానిలా నా రహస్యాలు చెప్పేస్తే విని తర్వాత ఏం చేస్తాడో ... ఇప్పుడున్న ప్రేమ వుంటుందా? చెప్పకపోయినా ఉండదేమో .... అయ్యో నా తలతిరిగిపోతూంది. నాకు ఏదారీ కనిపించడం లేదు. (ఏడుపు)

మ్యా : నిద్రపట్టడం లేదా...? (నవ్వుతాడు).

శ్యా : (తెప్పరిల్లి తనలో) ఏమైనా చెప్పను, చెప్పను. నావల్ల తప్పుంటే తప్పు ఒప్పు కోవాలిగాని, లేకుంటే ఎందుకు, నేనేం చేశానని .... నేనేం చేయలేదు. నా శక్తికొద్దీ మధూని ప్రేమించు కుంటాను. ఆ ప్రేమతో నా స్వంతబ్రతుకుని కూడా నింపుకొంటాను. నేనేం చేయలేదు, చెప్ప డాని కేముంది. చెప్పను. (వైలిన్ మీద తార స్థాయిలో ఒక విషాద రాగం విన్పిస్తూంది.) ★

(అలిండియా రేడియో ప్రసారితం)

# కృతజ్ఞత

మానికొండ వాస్తవ్యులు శ్రీ సూరెడ్డి అంజయ్యగారి తల్లి— శ్రీమతి సూరెడ్డి పిచ్చమ్మగారు— మహిళా సభ నర్సింగుహోమునకు రెండువేల రూపాయలు విరాళంగా యిచ్చారు. ఆ ధనంతో నర్సింగుహోమునకు ఒక రేడియో సెట్టు, పిల్లల వార్డునకు ఆరు మంచాలు, పిల్లల వినోదంకొరకు కుర్చీలు బల్ల మొదలైనవి కొన నిశ్చయమైనది. ఈ విరాళము నకు మహిళాసభ కృతజ్ఞతాపూర్వక అభివందనలు.

శ్రద్ధాంజలి:

# సర్ వేపా రామేశం

శ్రీ వేపా రామేశంగారు 1875 సం॥ రము జూలై 27న తేదీన జన్మించిరి. వీరు విశాఖపట్టణమండలి భీమునిపట్నము జిల్లా మునసబుగారుగా నుండిన రావుసాహెబు శ్రీ వేపా లక్ష్మినర్సింహంగారి ద్వితీయ పుత్రులు. వీరు ప్రాథమిక విద్యయంతయు ఎలమంచిలి, భీమునిపట్నములయందు గడపిరి. వీరు 14వ సం॥ రమున విశాఖపట్టణము హిందూ కళాశాల యందు ఎఫ్. ఎ. పరీక్షయందు ప్రథమ తరగతి యందును ఉత్తర సర్కార్లయందు ప్రథములై పట్టభద్రులైరి. 1890 సం॥ రమున మద్రాసు నగరమున బి. ఎ. తరగతిలో చేరుటకు, వచ్చిరి.

16వ యేట బి. ఎ. డిగ్రీ పరీక్షయందు మూడు భాగములయందు మొదటి తరగతియందుత్తీర్ణులైరి. గణిత శాస్త్రమందు వీరికి వచ్చిన మార్కులు మిక్కిలి కొనియాడదగినవి. తర్వాత వీరు లాకాలేజీలో చేరిరి.

రామేశం 1892లో థామ్సన్ బహుమతి, బోర్డిలియాన్ బహుమతి, బిల్డర్ బేక్ బహుమతి పొందిరి. ఈకాలమందు బి. ఎల్. చదువు 3 సం॥ రములు. అందువలన 19వ యేట, బి. ఎల్. డిగ్రీ పట్టభద్రతను మొదటి తరగతియందు పొందిరి. ఇమ్మెస్ కార్నిల్ బహుమతులు కూడా పొందిరి.

ఆకాలమందు వకీళ్ల సంఘమందు పేరెత్తి ప్రఖ్యాతి గాంచినవారు ఇతనిని గూర్చి విశేషముగా పొగడిరి. 1896లో ఇతడు శ్రీ ఎమ్. ఒ. పార్థశారధి అయ్యంగారువద్ద తన అప్రెంటీసు కోర్సు చేసుకొని న్యాయవాది వృత్తియందు చేరెను. పార్థసారధి అయ్యంగారు రామేశంగారి తండ్రిగారికి అతని కుమారుడు తనవద్ద పని నేర్చుకొనుటకు వచ్చినందులకు తాను మిక్కిలి గర్వించుచున్నానని తెల్పెను.

1896 జూన్ తర్వాత విశాఖపట్నమందు రామేశం





రామేశం దంపతులు

న్యాయవాది వృత్తి ప్రారంబించి 1900 వరకును అచ్చటనే యుండిరి. ఆకాలమందే కృష్ణా గోదావరి నదులకు రైలుమార్గమందు వంతెనలు, కలకత్తా నగర మందు ఒక రైల్వేస్టేషను నియమింపబడెను. ఒకప్పు డితని డిల్లీ జెడ్జీ ఇతని న్యాయవాది వృత్తిని మద్రాసు నకు గాని, కలకత్తాకు గాని మార్చుకొమ్మని కోరిరి, అతడు తన మకామును మద్రాసుకు మార్చెను. ఇతడు స్వతంత్ర జీవిగా నుండగోరి తన తండ్రిని ఒక పైసా అయినా పంపమని కోరలేదు, తనవద్ద విశాఖపట్న మందార్జించిన స్వల్ప ధనముతో మద్రాసులో ఈతడు న్యాయవాది వృత్తి ప్రారంభించెను.

1920వ సంవత్సరమున, టి. వి. శేషగిరి అయ్యరు జడ్జీ పదవినుండి విరమించుకొనుట, ఎస్. శ్రీనివాస అయ్యంగారు అడ్వకేటు జనరల్ పదవి వదలి నాన్ కోఆపరేటివ్ మూమెంటులో చేరుట తటస్థించెను. అప్పుడు సర్ జాన్ వాలీసు, ప్రధాన న్యాయమూర్తి ఇతనిని పిలిచి నీకు జడ్జి పదవి కావలెనా లేక అడ్వకేటు జనరల్ అయ్యేదవా యని కోర. ఇతడు జడ్జీ అయ్యెను. సర్ సి. పి, గారు అడ్వకేటు జనరలైరి. 1920 నుండి 1935 వరకు ఇతడు హైకోర్టు జడ్జీ అయ్యెను. మూడుమార్లు ప్రధానన్యాయ మూర్తిగా పనిచేసి తుదకు ప్రధాన న్యాయమూర్తి పదవినుండి విరమించుకొనిరి. ధారణా శక్తి గల్గియుండుటచేతను, ఆయన తన జీవితమందు, వేదాంత శాస్త్రము ఖగోళ శాస్త్రము, గణిత శాస్త్రము, జ్యోతి శ్శాస్త్రము, వృతు శాస్త్రము, తోటలు పెంచుట విషయముల గూర్చి విశేషముగా చదివెను. వకీలు జీవితమందు ఆయనకు విశేషముగా కేసులుండెడివి. జమీందారీ పనులేమియు లేకున్న పార్టీదారులవద్ద తనకు కావల సిన ఫీజుకంటెఎక్కువ పుచ్చుకొనకుండెను. అనేక పర్యాయములు కేసులలో ఆయన ప్రకాశంపంతులు గారికి పేరి నారాయణమూర్తిగారికి ఎదురుగా నిలచి వాదించిరి.

ఆయన స్వయముగా కొన్ని పద్ధతులు నియమములు గల్గియుండెను, తన వృత్తినుండి సాధ్యమైనంత త్వరలో వదులుకొని వెలుపలికి వచ్చెను. జడ్జిగానున్నపుడు, హిందూలా, రైతు కౌలు సమస్యలు, ఆస్తుల హక్కుల మార్పులు, నీటి పారుదల హక్కులు మొదలగునవి చక్కగా ఎరిదియుండెను. క్రిమినల్ పినల్ కోడును చక్కగా ప్రచురింపమని అతనిని కోరిరి, గాని తన యారోగ్యము చెడునని అతడాపని మానుకొనెను. అనేక సంస్థలలో సభ్యుడుగా నుండెను.

జీవితమునందు కడపటి 9సం॥ రములు ఆయన సంసారమందలి ఆర్థిక విషయములు ప్రపంచ చింతలు వదలి తనకడకు వచ్చిన వారిని ప్రేమతో చూచి తనకున్న జ్ఞానమున వారికి కావలసినది బోధించి పంపెడివాడు.

అక్టోబరు 28, 1958 ఉదయమీయన కను మూసెను. ఈయన రాసిన పుస్తకములు కొన్ని ఆంధ్రుల పంచాగము క్షేత్ర గణితము మొదలగునవి. బీదపిల్లలకై అనేక పాఠశాలలయందు ఉచిత వేతన నిధులు తన పేరట కల్పించెను. ఆంధ్ర వకీళ్ళ సంఘమునకు, ఎలమంచిలి పాఠశాలకు తన పుస్తకముల న్నియు ఇచ్చెను.



నాటిక :

# కుటుంబ విచ్ఛిత్తి

—గోరాశాస్త్రి

(చవకబారు సినిమా సంగీతపు ట్యూన్‌లాంటిది— రికార్డు నేపథ్యంలో సన్నగా వినబడుతూంటుంది)

రామదాసు : (కంఠంలో కొంచెం చిరాకుతో)

—హమ్మయ్య ! ఏలాగైతేనేం ఘటం కొంప చేరింది. దిక్కుమాలిన బజారు పనులు ప్రాణంతో దేస్తున్నాయి. (కంఠంమార్చి) అరె ! ఎంత దారుణం ! (బిగ్గరగా) ఇదిగో ! నిన్నే ! ఓయ్.

(దూరంనుండి "ఓయ్ వస్తున్నా (అని స్త్రీ కంఠం వినబడుతుంది,)

శాంతమ్మ : (ప్రవేశిస్తూ) తలుపు తీసేవుంది గదా— ఆ గావుకేక లెందుకండీ.

రామ : (చిరాగ్గా) ఆహా ! తీసేవుంది. వీధిగుమ్మంబార్లా తెరిచేశారు. హాల్లో భోరుమని దీపాలు అప్పుడే. సూర్యుడింకా సరిగ్గా అస్తమించకుండానే—

శాం : బాగుందండీ వరస. గంటాయి చీకటి పడితేనూ.

రామ : (ఇంకా అదే ధోరణిలో) మహామహా గెజిటెడ్ ఆఫీర్లకు చెల్లదు-యిలా యింత యింటెడు దీపాలూ వెలిగించేయడం. హాల్లో ఎవరూ లేరుగాని రేడియో మాత్రం వేసేశారు. మా శివమ్మ పిన్నిలాగ ఎవరూ వినకపోయినా దానిమానాన అది అరిచేస్తోంది. దర్జా అంటే అలా వుండాలి. నెల తిరిగేసరికి ఆ ఎలక్ట్రీ బిల్లు యిచ్చేస్తాడు వాడితాత సొమ్మేదో యిక్కడ దాచపెట్టినట్లు.

శాం : చాల్లెండి, అలా అరవకండి మీ పుణ్యమాయె. ఇంతకూ కూరలూ అవీ తెచ్చారా?

రామ : తప్పుతుందా? ఏపాటు తప్పినా సాపాటుతప్పదు!

శాం : హారతి కర్పూరం కొబ్బరి కాయలూ మరచిపోలేదు గద ?

రామ : లేదు, అవీ అఘోరించాను.

శాం : తమలపాకులు?

రామ : (విసుగ్గా) ఆహా అవీని. తమలపాకులు. దుంపరాష్ట్రం, గసగసాలు. మాచిపత్రి. కలబందమట్టలు. బ్రహ్మచెవుడు ముళ్ళు, కొండమీది కోతి అన్నీ తెచ్చాను. సరేనా. కొంపలో అడుగు పెట్టానో లేదో. ఏమిటీ రభస?

శాం : (నోరు నొక్కుకుంటూ,) అవవ్వ ! ఊరుకుంటారా. దయచేసి !

రామ : అలాగే ఊరుకుంటాను గాని ముందు ఆ రేడియోను ఊరుకోమను. దానిపీక నొక్కు. యీ కూరల సంచులు లోపల తగలెట్టు. కాళ్ళు పట్టుకు పోతున్నాయి. కాస్సేపు యిలా కుర్చీలో చేరబడితే గాని—

(రేడియో ఆగిపోతుంది.)

శాం : అంత అవస్థపడి నడిచిరాకపోతే, ఓ పావలా పారేసి రిక్షాఎక్కి రాలేకపోయారా?

రామ : పారేస్తావు, నీకేం, పెద్ద గెజిటెడ్ ఆఫీసరు పెళ్ళానివీ........

శాం : ఇదెక్కడి ఖర్మండీ మీతో. తక్కినవాళ్ళెవరూ మనుషులు కాదనా మీ ఉద్దేశం?

రామ : ఓ గ్లాసుడు మంచినీళ్ళు తీసుకురా పీకార్చుకుపోతోంది. ఇంట్లో వాళ్ళంతా ఎరీ?

శాం : తెస్తానుండండి.

రామ : ఉండక ఎక్కడికి పోతాను? అందుకేకదూ రిటైరై కొంపలో కూర్చున్నానూ? ఇంట్లో అందరూ ఎక్కడికి వేంచేశారంటే మాటాడవేం ? — ఓహో నువ్వూ లేవా?

శాం : ఇదండి మంచినీళ్ళు.

రామ : (గడగడా నీళ్ళుతాగేసి) హమ్మయ్య. వీళ్ళంతా ఏరంటే మాటాడవేం?

శాం : అబ్బాయీ, కోడలూ కలిసి సినిమాకెళ్ళారు.

అమ్మాయేమో పక్కింటి డాక్టరమ్మగారింటికివెళ్ళింది దాని చంటివాళ్ళిద్దరూ అన్నాలు తినేసి నిద్రపోయారు.

రామ : అల్లుడుగారూ?

శాం : ఎవర్నో వెళ్ళి కలుసుకోమన్నారుగా మీరు? సీతా రామయ్యో, జానకిరామయ్యో — అమ్మాయి యిందాకేదో చెప్పిందమ్మా - పేరు మర్చి పోయానూ. అక్కడికెళ్ళాడు.

రామ : నీ మొహం. నీదో మతిమరుపుబుర్రా. ఒక్క విషయం సరిగ్గా చెప్పలేవు. అంతా అపసంది మా లోకం. అదిగో అమ్మాయే వస్తోందిలే. ఏం రాధా? మీ ఆయన ఎక్కడికెళ్ళాడే?

రాధ : (ప్రవేశిస్తూ.)ఏం నాన్నగారూ, ఇప్పుడే వచ్చారా? బజారు పని చాలా ఆలస్యమైనట్టుందే యివాళ?

రామ : అడుగుతావు నెమ్మదిగా, చాంతాడంత లిస్టు రాసిచ్చింది మీ అమ్మ. కిరణా కొట్టుదగ్గిర నుంచుంటే వెంకటసుబ్బయ్య కనబడ్డాడు. ఒకటే బాతాఖానీ. వాడికేం— బంగారు పిచిక, పడుచు పెళ్ళాం కూడానా, జుత్తికి రంగు వేస్తున్నాడు. అది సరేగాని చంద్రమౌళి ఎక్కడికెళ్ళాడంటే మాటాడవేవే?

రాధ : మీరు చెప్పిన పనిమీదే వెళ్లారు నాన్నగారూ.

రామ : అంటే?

రాధ : బ్యాంకి ఏజెంట్ సుందరరామయ్యగారిని కలుసుకోమన్నారటగా.

రామ : మూడు రోజులునుండీ చెపుతున్నాను. ఇప్పటి బుద్ధి తిరిగిందన్నమాట. పోనీలే. అదేనా ఎంతగాదు.

శాం : ఆఁ సుందరరామయ్యగారు, ఆపేరు నాలిక మీద ఆడింది గాని చెప్పలేకపోయానే.

రామ : నువ్వు మరొకటి సరిగ్గా చెప్పి ఏడిశావూ— కాస్త అప్పుడప్పుడు ఆయన్ని వెళ్ళి చూస్తూంటే ఏదైనా పని జరగొచ్చు. బ్యాంక్ ఏజెంటంటే తమాషాలా— బోలెడంత పలుకుబడి. తలుచుకుంటే ఎక్కడైనా నౌఖరీ వేయించగలడు.

శాం : అంతా ఏడుకొండలవాడి దయ. ఆ ఘడియొస్తే గాని ఏదీ జరగదు. పోనీలెండిగాని, భోజనానికి లేస్తారా, అబ్బాయీ, కోడలూ వచ్చేదాకా ఉంటారా?

రామ : ఎక్కడికెళ్ళేరన్నావ్ వాళ్ళు? సినిమాకా?

శాం : చెప్పానుగదండీ. మళ్ళీ అదే ప్రశ్నా?

రామ : ఏ సినిమాకి?

రాధ : ఏదో ఇంగ్లీషు సినిమాకి నాన్నా. తమ్ముడికి యిష్టం లేదుగాని మరదలు బలవంతం చేసి తీసుకెళ్ళింది.

రామ : ఏం సినిమాలో ఏం లోకమో. అంతా డబ్బు దండగ. ఇంతాచేసి ఆవిడగారు కాపరానికొచ్చి నెల రోజులు తిరగలేదు— అప్పుడే యిన్ని షికార్లు.

రాధ : అదేమిటి నాన్నా, వాళ్ళకిది కొత్తా ఏమిటి? ఎప్పుడూ వెళుతూంటారుగా. ఇవాళంటే పెళ్ళయింది గాని, ఇద్దరూ ఒకే ఆఫీసులోనే పనిచేస్తున్నారు. రెండేళ్లనుండీ ఫ్రెండ్సు, తమ్ముడు ఎప్పుడు సినిమా కెళ్ళినా ఆవిడతోనేగా. మొన్నటి దాకా వసంతగారూ, అనేవాడు, ఇప్పుడు వసంతాఅంటున్నాడు. అంతేగా!

రామ : ఏమో, యిలా గొడవలన్నీనాకు మొన్నమొన్నటి దాకా. తెలియవు. పోనీలే, ఆర్జించుకుంటున్నారు. ఖర్చుపెట్టుకుంటున్నారు - మధ్య నాకెందుకొచ్చింది.

శాం : సరెలెండి. ఎవరి గొడవ వాళ్ళు పడతారు గాని, నేనడిగిందానికి జవాబు చెప్పరేం? వాళ్లొచ్చేసరికి ఏ పదో దాటుతుంది. ఉంటారా, లేస్తారా?

రామ : అప్పటిదాకా నా కెందుకు? చంద్రామౌళి వస్తాడేమో పావు గంట చూస్తాను.

♦ ♦ ♦

(దూరాన గాలిలో ఎక్కడినుండో జాజ్ సంగీతం లాంటిది వినిపిస్తుంది. దానితో కలిసి రోడ్డుమీద విన వచ్చే సంకీర్ణ ధ్వనులు. మోటారుకార్లు హారనూ, నడిచిపోయే జనసమూహమూ, వీటన్నిటినీ సూచించే బజారు ధ్వనులు. ........)

వసంత : ఏం రాజా? జవాబు చెప్పరేం?

రాజారావు : ఏవిఁటి వసంతా?

వసంత : ఏం చేద్దామని అడుగుతున్నాను.

రాజా : అంటే?

వసంత : (సాగదీస్తూ)అంటే మహానుభావా, మార్తాండ తేజా. టైము తొమ్మిదిన్నర అయిందిగదా, రిక్షా కట్టించుకొని అర్జంటుగా యింట్లోకి పారిపోదామా, లేదానడుచుకుంటూ వెళ్ళదారిలో ఎక్కడైనాఐస్క్రీమ్ తిని, కబుర్లు చెప్పుకుంటూ వెళదామా అని.

రాజా : నీ యిష్టం, నువ్వెలాగంటే అలాగే.

వసంత : అలాంటి "చిత్తం చిత్తం" జవాబుకాదు రాజా, నాక్కావలసిందీ. తొందరగా వెళ్ళిపోవాలా, కాస్త అలస్యం అయినా ఫరవాలేదా? నేనడుగుతున్న దదీ. ఎంచేతంటే, మీ నాన్నగారి తత్వం ఏమిటో నాకింకా బోధపడలేదు, ఆయన్ను చూస్తే నాకు భయం, నన్ను చూస్తే ఆయనకీ భయం లాగే వుంది. నన్ను "మీరు" అని పిలవాలో "నువ్వు" అని పిలవాలో తేల్చుకోలేక తికమక పడుతున్నారాయన. అంతా కొత్తకదూ, కొంతకాలం పోతే అన్నీ సర్దుకుంటాయి గాని-

రాజా : ఏం సర్దుకోడమో- కొంప చేరుకోవడమంటే భయం వేస్తోంది.

వసంత : ఏం?

రాజా : పొద్దున్న నాన్నగారూ, నేను కొంచెం చికాగ్గా మాట్లాడుకున్నాం. డబ్బునుగురించి.

వసంత : మీరేం చెప్పారు?

రాజా : ఏం చెప్పాను?— ఆ సంగతింకా ఆలోచించ లేదన్నాను. నీతో కూడా మాట్లాడి, ఆ తర్వాత ఎటు పడితే అలా సర్దుకోవచ్చులెండి దానికేం అన్నాను. ఇంటికెళ్లాక మళ్లీ అడుగుతారాయన. ఏం జవాబు చెప్పాలో తోచడంలేదు.

వసంత : విచిత్రంగా ఉందే పరిస్థితిఅంతా. మీ యింట్లో అడుగుపెట్టి నెల రోజులైందో లేదో నా సంపాదన సంగతి మీ కందరికీ సమస్య అయి కూర్చుందా?

రాజా ; అందరూ ఎవరు వసంతా? నాన్నగారొక్కరే అడిగారన్నాను.

వంసత : ఎలా పడితే అలా సర్దుకోవచ్చంటే ఏమటి మీ ఉద్దేశం?

రాజా : అప్పటికేదో ఓ జవాబు చెప్పాలికాబట్టి అలా అన్నాను. అందులో పెద్ద ఉద్దేశాలేం లేవు. పోనిలే గాని నడిచిపోదామా, రిక్షా పిలవమంటావా?

వసంత : నడిచే పోదాం.

రాజా : ఇప్పటికిప్పుడే కోపం తెచ్చుకున్నావా? ఛా, నేనేమన్నాననీ?

వ : సారీ. నాకు వచ్చింది కోపం కాదు. ఇంతవరకూ సరదాగా ఉన్న మనస్సు ఒక్కసారిగా బరువెక్కి పోయింది, అంతే.

రాజా : ఏం జరిగింది? వసంతా? నేనేం తప్పుమాట అన్నానూ?

వ : ఇదేమిటిది? ఇవాళ మీరన్నీ గబగబా ఊహించేసు కుంటున్నారు.... చూడండీ. రెండేళ్లుగా మనం అష్ట స్నేహితులం మాత్రమే. ఇవాళ కొత్తగా ఒక అను బంధం కల్పించుకున్నాము. నా జీవితం మీద మీకో కొత్త హోదా వచ్చిందన్నమాట. అందులోంచి నా జీతం మీద మీ నాన్నగారికి కూడా కొత్త పెత్తనం వచ్చిందన్నమాట. దాని గురించే ఆలోచిస్తున్నాను.

రాజా : అలాఅంటావేమిటి వసంతా. ఆయనమాటవింటె మనం బాగుపడతామే గాని చెడిపోముగదా?

వ : ఆ లెక్కన ఆయన మాట విని నన్ను పెళ్ళాట్టం మానెయ్యలేకపోయారా?

రాజా : అది వేరు. ఇంతకూ ఒక్కటి చెప్పుతాను విను వసంతా. తొందరపడి నువ్వు అపోహలు పెంచుకోకు. మా కుటుంబ పరిస్థితులన్నీ నీకు చెప్పాను గదా. మేమేం లక్షాధికార్లం కాదు గాని కాలక్షేపానికి ఫరవా లేదు. అలాగని డబ్బు దుబారా చెయ్యడం నాన్నగారికి యిష్టం లేదు. ఆయన కూడా రిటైరై పోయారా, కొంచెం జాగ్రత్తగా ఉండకపోతే ఎలా చెప్పూ. అక్కయ్య సంసారం బాధ్యత కూడా మా నెత్తిమీదే పడిందా. వాళ్ళూ యిద్దరు పిల్లలూ, ఐదేళ్లయి యిక్కడే ఉంటున్నారు. బావని చూశావుగా, అదో రకం మనిషి. ఉద్యోగం లేదు, దమ్మిడీఆస్తిలేదు —

వసం : మళ్ళీ అవన్నీ ఏకరవు పెట్టడం దేనికీ? ఏడాది ఏడాదినుంచి మీ సంసారం గొడవలు కాస్తో కూస్తో నాకూ తెలుసుగా. అప్పుడప్పుడూ చెపుతూ వచ్చారు.

రాజా ; అవుననుకో. ఐనా నీకిప్పుడో కొత్త హోదా వచ్చిందిగా. - అంచేత——

వస : కొత్త హోదా వచ్చింది మీకుగాని నాక్కాదు. అవునుగాని. రాజా, ఈ విషయాలన్నీ అర్జంటుగా యిప్పుడే మాటాడేసుకోవాలా? ఒద్దు. నా కలల్ని యింత త్వరలోనే చెరిపేయకండి. కనీసం ఒక్క అర్నెల్లపాటు హాయిగా బతుకుదాం, వెధవ డబ్బు గొడవ ఎత్తకండి. కావలిస్తే మీ యింటి ఖర్చంతా నేను భరిస్తాను. మా నాన్నగారూ రిటైరుయారు గాని యిలాంటి బెంగలు ఆయనకేంలేవు. నాడబ్బు ఆయన ఒక కానీ అడగలేదు సరిగదా. నాకెంత కావలిస్తే అంత ఎప్పుడూ యిస్తారు ........ చూడండీ, మీరు మా కృష్ణవేణి నెరుగుదురా?

రాజా : తెలీదు. ఎవరావిడ?

వస : నాక్లాసుమేట్, మొన్న మనపెళ్ళికికూడా వచ్చింది మీరు గమనించ లేనట్లుంది. కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తోంది. కిందటేడాదే పెళ్ళి చేసుకుంది.

రాజా : ఆవిడ గొడవెందుకిప్పుడూ?

వస : ఏం లేదు. ఊరకే ఏదో జ్ఞాపకమొచ్చింది. ఒక సారి మాటల సందర్భంలో ఆవిడేమందో తెలుసా? పెళ్ళయిన కొత్తలో యిద్దరూ కలసి మూడునెలల్లో ఐదువేలు ఖర్చుచేశారుట.

రాజా : తెలివితక్కువ గదూ. ఉత్సాహంలో ముందు ఖర్చు పెట్టేసినా, తరావాత విచారించనలసి వస్తుంది.

వ : (వ్యంగ్యంగా)నిజమే. శుద్ధ తెలివితక్కువంటాను.

రాజా : అదే వసంతా. నేనూ యీ మధ్య సీరియస్‌గా ఆలోచిస్తున్నాను. అక్కయ్య చేత వేరింటి కాపరం పెట్టిద్దామని ఎంత ప్రయత్నించినా కుదరడంలేదు. బావగారి ఉద్యోగం దొరకడం——

వ : (అర్థోక్తిలో) ఇప్పుడంత అవసరమేమొచ్చిందీ? కళకళ లాడుతూ యింట్లో తిరుగుతున్న ఆడపిల్లను వేరుచేయడం దేనికి?

రాజా : అలాగంటావేవిఁటి వసంతా? ఒక కుటుంబం మొత్తాన్ని మనం మట్టుకు ఎంతకాలమని భరిస్తాం?- వాళ్ళదేదైనా వేరే ఏర్పాటు చెయ్యాలి గదా. ఇన్నాళ్ళూ రెండు జీతాలే అయితే యిప్పుడు నీ జీతం కూడా కలుస్తోందిగా

వ : (వ్యంగ్యంగా) కలుస్తోందన్నమాట.

రాజా : అంటే?

వ : ఏం లేదు చెప్పండి.

రాజా : ఇవన్నీ ఆలోచిస్తూంటే. మనమే వేరే వెళ్ళి పోదామా అనే ఆలోచన కూడా నాకు వస్తోంది. నిన్ను కూడా సంప్రదించి——

వ : దానికేం. నిదానంమీద అన్నీ ఆలోచిద్దాం. ప్రస్తుతానికి యీ గొడవ కట్టేసి యింకేమైనా మాటాడతారా? పోనీగాని మనిమిప్పుడు యింటికి వెళ్ళితీరాలా?

రాజా : బాగురది వరస. కొంప చేరుకోక ఏం చేస్తాం?

వ : ఏదైనా చెయ్యొచ్చును, ఏదైనా హోటల్లో భోంచేసి రెండో ఆట సినిమా చూడొచ్చును.

రాజా : ఒద్దులెద్దూ. కొంపకి పోదాం. ఇలాంటి తిరుగుళ్ళు అనీ నాన్నగారికి కిట్టవు.

వ : కనీసం రెండు డజన్లసార్లయినా యిద్దరం కలసి ఆఫీసునుంచే సరాసరి సినిమాకి పోయేవాళ్ళం. అప్పుడో?

రాజా : ఫస్ట్ షోకేగా. అప్పుడు కూడా చాలాసార్లు ఎక్కడికో వెళ్ళానని చెప్తుతూఉండేవాణ్ణి.

వ : నేనెప్పుడూ అలా చెప్పలేదు. మీతో కలిసి సినిమాకు వెళ్లానని అమ్మతోనూ. నాన్నగారితోనూ స్పష్టంగా చెప్పేదాన్ని. పోనీలెండి. ఎవరి అచారాలు వాళ్లవి దానికేం గాని అట్లా షాపు యింకా తెరిచే ఉంది పదండి. ఆటబొమ్మలున్నట్లున్నాయి. మీ అక్కయ్య పిల్లలకి ఓరెండు కొనుక్కుని వెళదాం.

రాజా : అర్ధరాత్రి ఆటబొమ్మలేవిఁటి వసంతా. అర్జంటుగా వాళ్లకిప్పుడు బొమ్మలెందుకూ?

వ : మీకు తెలీదు. జీవితంలో ప్రతిదీ అర్జంటే అనుకోండి. ఆ పసి పిల్లల బాల్యం కాస్తా గడిచిపోయాక మనం ఆటబొమ్మలు కొనిచ్చినా లాభంలేదు. పదండి. అన్నట్లు మరో వారం రోజుల్లో దీపావళి కదూ. అల్లా మేడమీద పిల్లలెవరో చూడండి, మతాబాలు కాలుస్తున్నారు. ఆ వెలుగులో వాళ్ళ మొహాలు ఎలా మెరసిపోతున్నాయో చూడండి.

రాజా : ఈవీధి దృశ్యాలన్నీ చూస్తూకూర్చుంటే తెల్లారి పోతుంది. త్వరగా పోదాం పద. అమ్మ కాచుకు కూర్చుంటుంది. ఆవిడ కసలే ఆయసం గుండెదడాను!

(ఒక్కసారిగా మోటారు కార్లరొదా, రిక్షా మువ్వల చప్పుళ్లూ అన్నీ ఒక్క వెల్లువలా వచ్చి అలా అలా సన్నగిల్లుతాయి.)

♦ ♦ ♦

(సన్నని రొద వినపడుతుంది. దూరాన ఎక్కడో ఉండి ఉండి కొట్టే గంటల చప్పుడు గాలిలో తేలి వస్తూంటుంది.)

చంద్రమ్మ : (కొంచెం దూరాన్నుంచి) రాధా ! రాధా ! (దగ్గరగా వచ్చి, లాలనగా) రాధా ! ఇదేమిటి రాధా ఒంటరిగా వచ్చి యిలా చీకటిలో డాబామీద పడుకున్నావు? అమ్మగారు పిలుస్తున్నారు పద,

రాధ : (వెక్కి వెక్కి ఏడుస్తూంటుంది.)

చం : ఛా అదేమిటి రాధా ప్రతిదానికీ యిలా మనస్సు కష్టపెట్టుకుంటె ఎలా? ఇలాంటి గొడవలు కొత్తా

ఏమిటి నీకు, నేనేఓర్చుకోగా లేనిది నీకెందుకు బాధ. లే. కన్నీళ్ళు తుడుచుకో.

రాధ : (ఏడుపు బరువుతోనే.) కొత్తకాదు నిజమే. కాని ఎన్నాళ్లు యిలా బాధలు? దీనికి అంతు ఎక్కడ? ఎంత దురదృష్టం కాకపోతే నన్ను కన్న అమ్మా నాన్నే యిలా ఏడిపిస్తారా నన్ను. వాళ్లకే బరువయిపోయానా నేను? (ఏడుస్తూ) నేను మిమ్మల్నేం అనడంలేదు. మీకున్నదంతా వాళ్ళకిందే ఖర్చుపెట్టారు. అప్పట్లోనే మనం వేరుగా పోయుంటే—

చంద్రమౌళి : పోనీలే రాధా. అవన్నీ తలచుకొని విచారించడం దేనికి? కడుపు చించుకుంటే కాళ్ళమీదపడుతుంది. మనబోటి నిర్భాగ్యులం యిలాంటివి పట్టించుకోకూడదు. మొండిగా బండగా గడిపేయాలి, అంతే.

రాధ : అమ్మకూడా యింత మారిపోయిందంటే నాకెంత బాధగా ఉందనీ, మొన్నటికి మొన్న - వసంతగారు పిల్లలకి ఆ బొమ్మలు తెస్తే అంత రభస జరిగింది. పరాయి పిల్ల. కొత్తగా మన యింట్లోకొచ్చింది. అ పిల్ల కున్నపాటి అభిమానం అమ్మకీ నాన్నకీ లేక పోయిందికదా. దిక్కులేక పడిఉన్నాం అనేగా యింత చులకన. (ఏడుస్తుంది.)

చంద్ర : ఛా. ఊరుకో రాధా. లే, లే, దీనికేదో మార్గం ఆలోచిద్దాం. రేపే యీ కొంపలోంచి పోదాం సరా?

రాధ : (వినిపించుకోకుండా) కోడలొచ్చిం దగ్గర్నుంచి మరీరెచ్చిపోయారు. ఆవిడ సంపాదనకూడా మనమే తినేస్తామేమోనని భయం పట్టుకున్నట్లుంది.

చంద్ర : ఆవిడకిలేదు అలాంటి బుద్ధి.

రాధ : (అదే ధోరణిలో,) వాడిసంగతి సరేసరి. అందర్నీ మించిపోయాడు వాడు. ఆశా, అభిమానం ఏకోశానా లేవు. డబ్బొక్కటే ప్రధానం, ఛీ. వెధవ డబ్బు—

చంద్ర : బుర్రపాడుచేసుకుని యిలా ఎంతసేపు ఏడుస్తావు రాధా. ఏడ్చి ఏడ్చి పిల్లలు నిద్రపోయారు. వెళ్ళు.ఒకసారివెళ్ళి వాళ్ళమొహాలుచూడు. (బాధగా) నిష్కారణంగా వాళ్ళని కొట్టేశావుగదా.

రాధ : (పెల్లుబికిన దుఃఖంతో) దిక్కుమాలిన దాన్ని యింకేంచేస్తాను? నా కడుపునపుట్టారు కాబట్టి వాళ్ళింకా దిక్కుమాలిన వాళ్ళు. ఏడవనివ్వండి (తను ఏడుస్తుంది)

(దూరంనుండి "రాధగారూ రాధగారూ" అని పిలుపు వినవస్తుంది)

చంద్ర : ఇదిగో చూడు, వసంతగారు వస్తున్నట్లుంది, బాగుండదు, లే, కన్నీళ్ళు తుడుచుకో.

రాధ : రానివ్వండి, నాకు సిగ్గేమిటి? ఆవిడ కన్నీ తెలుసు.

వ : రాధా! ఓ! మీరు కూడా యిక్కడే వున్నారా చంద్రమౌళిగారూ.

చం : అవునండీ. ఈ చీకటిలో డాబా ఎక్కేసింది. దిగమంటే దిగదు. ఏడుస్తుంది. తొంభైతొమ్మిదిసార్లు ఓర్చుకుని మింగేస్తుంది. నూరోసారి దుఃఖం వచ్చేసిందా. మరంతే.

వ : ఇలా చూడండి రాధాగారూ. ఛా. ఏవిటది? లెండి, నా మాటకూడా వినరా.

రాధ : (దుఃఖం ఆపుకుంటూ.) దుఃఖం వొస్తే ఏడవడానికి కూడా హక్కులేదా వసంతగారూ.

వ : (నొచ్చుకుంటూ) ఎంత మాట రాధగారూ. నన్ను తప్పర్థం చేసుకున్నారు మీరు- మా బంధుత్వంఅంటే కొత్తది గాని, ఏడాది నుంచి నన్నెరుగుదురు గదా, మనం బంధువులం కాము. ఫ్రెండ్స్ అనుకోండి— నామాట నమ్మండి, దుఃఖపడవలసిన పరిస్థితులు మీ కింకరావు. నేను రానివ్వను, సరేనా. లెండి.

రాధ : నాఖర్మకి మీరేం చేస్తారు వసంతగారూ?

వస : ఖర్మల్ని మారుద్దాం. మీరులెండి ముందు. కళ్ళు తుడుచుకొని కిందికి పదండి. నేను వస్తాను. .......

చంద్ర : హమ్మయ్య. తిక్క తిప్పుకుంది ఎలాగైతేనేం. థ్యాంక్స్ వసంతగారూ, ఏలాగైతేనేం రాధని కిందికి పంపింప గల్గారు. అలాగే అన్నంకూడా తినిపిస్తిరా

వసం : ఇంతకూ అసలేం జరిగింది చంద్రమౌళిగారూ?

చంద్ర : (నిస్పృహగా) ఏవుందడీ "మాతా పుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః" అన్నారు పెద్దలు!

వసం : ఆయన బట్టలు వేసుకుని ధుమధుమ లాడుతూ ఎక్కడికో వెళ్ళిపోయారు.

చంద్ర : రాజారావా?

వసం : మరే, నేనూ యిప్పుడిప్పుడే వచ్చానండీ. సాయంత్రం మాయింటికి వెళ్ళాను. మధ్యాహ్నానం నాన్నగారు ఫోన్‌చేశారు లెండి. రెండు రోజుల్లో దీపావళి వస్తోందిగదూ. కొంచెం గారాంచేసి నాన్న గారి చేత నెక్లెస్ కొనిపిద్దామని వెళ్ళాను. దీపావళికి

తప్పకుండా అక్కడికి వచ్చేయమన్నారు. సరే, అదంతా యిప్పుడెందుకుగాని ఇక్కడికొచ్చి యింట్లో అడుగు పెడుదునుగదా- వంటింట్లో కొరియా యుద్ధం జరిగిపోతూంది. విషయం ఏమిటో తెలీదు. నన్ను చూసి అందరూ తక్కుని ఆగిపోయారు. భోజనాల దగ్గర తండ్రీ కొడుకులకి ఏదో వచ్చిందనుకున్నాను. రాజారావు నడిగితే ఆయన గబగబా బట్టలేసుకుని నా వేపు కొరకొరా చూస్తూ వీధిలోకివెళ్ళారు. అత్తగారు కొంగు పరుచుకొని తాపీగా ఏడుస్తున్నారు. మీ కోసం చూస్తే మీరెక్కడా కనబలేదు——

చం : నేనే ముందు డాబా ఎక్కేశాను. అరుపులూ కేకలూ ఏడుపులూ మొత్తుకోలూ అంటే నాకు మహా చెడ్డ భయం వసంతగారూ. నేనూ జీవితంలో చాలా పోగొట్టుకున్నాను. కాని ఏ ఘట్టంలోనూ అరిచి మొత్తుకోలేదు. ఈ యింట్లో అదే నిత్యం జరిగే తంతు. ఏం చెప్పమంటారు? మీరూ చూస్తూనే ఉన్నారుగా.

వ : ఇంతకూ పోట్లాట దేనికొచ్చిదే?

చం : ఈయింట్లో మరి దేనికీ పోట్లాటలు రావు వసంత గారూ, డబ్బుకోసమే వస్తాయి. మొన్న మీరు పదిహేడు రూపాయలు పెట్టి పిల్లలకి బొమ్మలు తెచ్చినప్పుడు అత్తగారూ మావఁగారూ ఎంతలేసి మాటలన్నారో మీరే విన్నారుగా.

వ : అవునూ, ఆ గొడవ అయిపోయిందిగా. ఆ రోజు నాకూ చాలా బాధ కలిగింది. నా డబ్బు పెట్టి నేను పిల్లలికేవో సరదాగా కొంటే డబ్బు దుబారాగురించి మావఁగారు గంట లెక్చరిచ్చారు. నాకు నిజంగా అసహ్యమనిపించింది. మళ్ళీ యిందాకేం జరిగిందీ?

చం : ప్రత్యేకించి జరిగిందేదీ లేదు, పిల్లలమీద కాకి మీదా పెట్టి అత్తగారు ఏవేవో అలా అంటూంటారు. ఒకొక్కసారి రాధకి పౌరుషం వచ్చి జవాబు చెప్పు తుంది. దాంతో రగడ ప్రారంభం. పండక్కి బట్టలు కొనడంతో ప్రారంభించారు అత్తగారు. డబ్బు లేదని సణుగుడు. వాళ్లకది నిత్యం అలవాటే లెండి. చింత పండు కోసం బేడ అడిగినా ముందు లేదంటాడు మావఁగారు తరవాత సణుక్కుంటూ యిస్తారు. ఎందు లోనూ గ్రేస్ ఉండదు. దాంతో రాధకి కోపం వచ్చి అంత సణుగుతూ ఏవో కొనకపోతే మానేపేస్తే ప్రాణానికి హాయి అంది.

వ : అది నిజమే మరి. ఎవరికైనా అంతే అనిపిస్తుంది.

చం : దాంతో అత్తగారు రెచ్చిపోయి దెబ్బలాటకి దిగారు. కాకిపుండు బ్రహ్మరాక్షసి అయింది.

వ : పోనీగాని చంద్రమౌళిగారూ. ఇలా ఏన్నాళ్ళు మీకీ అవస్థ. ఈ దిగజారుడు స్థితికి ఎలా వచ్చారు మీరు? మీ జీవితం అంతా యిలా గడిచి ఉందదే?

చం : అదంతా ఓ పెద్ద కథ వసంతగారూ. కొన్ని జీవి తాలింతే. గతం తలుచుకుంటే గుండె బరువు. భవి ష్యత్తు తలుచుకుంటే భయం. మిగిలిందొక్కటే. వర్తమానం, దాన్నిగూడా కళ్ళుమూసుకుని అపస్మా రకంగా గడిపేస్తూండాలి. పోనీలెండి, ఆ గొడవ లన్నీ యిప్పుడెందుకుగాని, కిందకి పోదాం పదండి. ఇద్దరం కూర్చుని యిలా మాటాడు కుంటూంటే అందులోనూ ప్రమాదం ఉంది. యాటంబాంబులు ప్రేలవచ్చు.

వ : పరవాలేదు, ఇలాంటి వాటికి భయపడ్డం నా తత్వం లోలేదు. ఈ వాతావరణం నాకూ ఉక్కిరి బిక్కిరి గానే ఉంది.

(దూరంనుండి వసంతా, వసంతా అనే పిలుపు)

రాజా : వసంతా, ఏమిటి యిక్కడ బాతాఖానీ వేశావు? ఇప్పటికి జరిగిన గొడవలు చాలు, కిందికి వస్తావా, నీతో మాటాడాలి,

వ : వస్తూనే అంతదూకుడు దేనికండి? ఆ చెప్పేదేదో కాస్త సౌమ్యంగా చెప్పరాదూ.

రాజా : (వినిపించుకోకుండా) ఏం బావా జరిపించిన తంతు చాలక వసంతను కూర్చోబెట్టి ఉన్నవీ లేనివీ చాడీలు చెపుతున్నావా?

వ : అదేమీటండీ అలాగంటారూ? ఆయనేం చేశాడు మధ్యనా? ఈ యింట్లో ఎన్ని గొడవలుజరిగినా నిబ్బ రంగా ఉందేది ఆయనొక్కడే.

రాజా : అబ్బో, బయలుదేరాడు. శాంతమూర్తి.

చం : అనవసరంగా ఎందుకో ఉద్రేకంతెచ్చుకుంటున్నావ్ రాజారావ్. చెప్పకూడనివి నేనేవీ ఆవిడతో చెప్పలేదు.

రాజా : అయితే మంచిదేగాని- యిదిగో బావా యిప్పుడే చెపుతున్నాను విను. నిన్న లేక మొన్న యింటి

కొచ్చిన వసంతకూ నాకూ మధ్య గొడవలు తెచ్చి పెట్టకు, మమ్మల్నిలా బతకనీ.

వ : ఏవండీ : ప్లీజ్ : ఉత్తపుణ్యానికి ఎందు కంత దూకుడూ? ఎవరిని గురించి చెడుగా ఆయనేం మాటాడ లేదంటే వినిపించుకోరేం?

(దూరంనుండి అబ్బాయ్, అబ్బాయ్ అనిపిలుపు)

రాజా : సరిపోయింది. నాన్నగారుకూడా వచ్చేస్తున్నట్లుంది

రామ : (ప్రవేశిస్తూ) అబ్బా : ఈ వెధవ డాబా మెట్లు ఎక్కేసరికి ఎక్కడలేని అయాసమూ వస్తుంది. అబ్బాయ్. అర్ధరాత్రి డాబామీద యీ రంధి ఏమిటిరా? ఇన్నిమెట్లు ఎక్కించి నన్నెందుకిలా బాధ పెడుతున్నారూ?

చం : ఇది బాగుంది మావగారూ. ఇంత శ్రమపడి ఎక్కమని మిమ్మల్ని బలవంతం చేసిందెవరూ? మేమే కిందికొచ్చేస్తున్నాంగా?

రామ . రాక చస్తానా, నా సంసారాన్ని నువ్వు రచ్చకెక్కిస్తూంటే నోరు మూసుకుని మూలకూర్చోనా? రామదాసుగారి కుటుంబంలో గొడవ జరుగుతూంటే ఆ అప్రతిష్ట మోసేది నువ్వా నేనా?

రాజా : అతనికేం? అతన్నీ, అతని సంసారాన్ని మనం మోస్తున్నన్నాళ్లు మనం ఎలా పోయినా అతనికి లెక్కలేదు.... ఎవరి సహనానికైనా ఓ హద్దంటూ ఉంటుంది బావా?

రాధ : (అప్పుడే ప్రవేశిస్తూ తీవ్రంగా) ఉండదురా మరీ ? మా సహనానికీ ఓ హద్దు ఉంటుంది.

రామ : రాధా : నువ్వూ వచ్చేశావా?

రాధ : (తీవ్రంగా) రానా మరి : ఇంక మీరు బెంగపడకండి నాన్నగారూ. మీ యినపెట్టికి హారతిస్తూ హాయిగా కూర్చోండి, ఈ క్షణమే మేం యిక్కణ్ణించి వెళ్ళి పోతున్నాం.

రాజా : ఆఁ ఏమిటీ?

రాధ : ఆఁ : అవును : ఈ క్షణమే యింట్లోంచి వెడుతున్నాం. కట్టుబట్టలతో వెడుతున్నాం! సరేనా : ఒరే తమ్ముడూ : చాలా థ్యాంక్స్‌రా : నువ్వూ: నాన్నగారూ కలసి మాకు చేసిన నిర్వాకానికి చాలా థ్యాంక్స్.

చం : రాధా : ఏమిటా దూకుడు. నువ్వు కిందికెళ్ళిపో. వింటావా నా మాట.

రాధ : వినను వినను వినను. ఇప్పుడు నేనున్న స్థితిలో దేవుడు చెప్పినా వినను—

వ : రాధా : ఇలా చూడండి. నామాట వినండి, మనిద్దరం కాసేపు కిందికి పోదాం. రండి.

రాధ : వీల్లేదు వసంతగారూ, క్షమించండి. తమ్ముడు చెప్పినట్లు ఎవరి సహనానికైనా హద్దుంది. ఇందాక అమ్మ మాటలకి సిగ్గున్నవాళ్ళెవరూ యీ కొంపలో క్షణం ఉండరు—

రాజా : నిన్ను ఉండమని బలిమాలిందెవరూ?

రాధ : లేదురా నాయనా. నన్నెవరూ బతిమాలలేదు. మేమే గతిలేక యిలా మీ పంచలో పడి ఉన్నాం, సరేనా. (తీవ్రంగా) కాని ఒక్కటి జ్ఞాపకం ఉంచుకోరా అబ్బాయి. ఇవ్వాళ ప్రాజ్ఞుడయావ్. ఉద్యోగం చేస్తున్నావ్, పెళ్ళి కూడా చేసుకున్నావ్. కాని, కాని, వసంతగారిక్కూడా కొన్ని నిజాలు తెలియడం మంచిది. తల్లి తరవాత తల్లిలాగ నిన్ను చిన్నప్పట్నించి పెంచిది నేనురా అబ్బాయ్. నాన్నగారు అప్పుడు యిబ్బందుల్లో ఉంటే. అత్తవారిచ్చిన నా నగలన్నీ అమ్మి నీకు చదువు చెప్పించినది నేనురా అబ్బాయ్. కాస్తా కూస్తాకాదు. రెండువేల రూపాయలనగలు—

రామ : (నివారిస్తూ) రాధా : ఆ సోదంతా యిప్పుడు దేనికి?

రాధ : సోదె : మీకంతా సోదిగానే ఉంటుందిప్పుడు? ఉండదు మరీ. హుఁ : ఈ ప్రపంచంలో తల్లేమిటి తోడేమిటి. డబ్బు. డబ్బే ప్రధానం. బుద్ధిలేక మేము అసంగతి గ్రహించలేదు. ఆశలూ, అభిమానాలూ అవే ప్రధానం అనుకున్నాం, ఖర్మంకాలి అర్ధాంతరంగా ఆయన ఉద్యోగం పోయింది. జ్ఞాపకం ఉందా నాన్నగారూ. అప్పుడు మీరు పిలుస్తేనే యిక్కడికొచ్చాం. అప్పుడు మీరెందుకు పిలిచారూ? అభిమానం పొంగిపోయి కాదని నాకు తరవాత తెలిసింది, అప్పటికి మా ఆయనకి అంతా కలిపి ఎనిమిదివేల రూపాయలొచ్చాయి. వినండి వసంతగారూ : మీకు యివన్నీ తెలియడం ముఖ్యం. అప్పుడు నాన్నగారు యీ యిలు కడుతున్నారు. ఆ ఎనిమిదివేలూ తెచ్చి యింటి మీద గుమ్మరించారు, అడిగిన వెంటనే నిస్సంకోచంగా యిచ్చేశాడాయన, ఎందుకిచ్చారు? ఏ అభిమానం

కొద్దీ యిద్దారు?....(నిట్టూర్పు) అవన్నీ ఎవరాలో చిస్తారిప్పుడు? ఇప్పుడేమో మేమందరం బరువయి పోయాం. గతమంతా మరిచిపోయావు గదరా తమ్ముడూ. ఏరికోరి ఆర్జించే భార్యని తెచ్చుకున్నావు. మొదట వద్దన్నా డబ్బుకి ఆశపడి నాన్నగారు సరే నన్నారు. ఇప్పుడేమిటి మీరిద్దరూ వెరైపోవాలని నీ ప్రయత్నం. మమ్మల్ని గెంటేసి మీ యిద్దర్నీ యిక్కడేఉంచాలని నాన్నగారి ప్రయత్నం. ఛీ డబ్బు డబ్బు పదండి పోదాం. పిల్లల్ని లేపి, ఏ చెట్టుకిందికేనా పదండి.

వ : ఏమండీ. నిజమేనా అదంతా? .... మాటాడరేం?

చం : మాటలాడటాని కేముంది వసంతగారూ? ఇవాళ రాధకేదో పిచ్చెక్కింది. కాని నాకు అలాగే అని పిస్తోంది. యింత జరిగాక అందరూ యీ యింట్లో ప్రశాంతంగా బ్రతగల్గడం అసంభవం. పద రాధా పోదాం, గొడవల్లేకుండా, చల్లగా పోదాం పద.

వ : ఆగండి కాస్సేపు, ఏవండి, ఇదంతా నిజమేనా?

రాజా : నిజమేమిటి అబద్ధమేమిటి? ఇలాంటి యిచ్చి పుచ్చుకోడాలు ఏ సంసారాలలో ఉండవు? అంత మాత్రాన అరిచి బజారులో పడతారా?

వ : పోన్లెండి గాని మన పెళ్ళికి ముందు మనం అన్నీ ఆలోచించు కున్నప్పుడు, వేరేఉందామని నేనే అంటే అది బాగుండదన్న మీరు, వారంరోజుల నుండి వేరే వెడదామని మీరే నన్నెందుకు వత్తిడి చేస్తున్నారు?

రామ : హరి భగవాన్ : నిజమేరా అబ్బాయ్ ! నాతో ఒకటి చెప్పి లోలోపల గూడుపుఠానీ చేస్తున్నావా?

వ : తెలిసింది తెలిసింది, నాకంతా బోధపడింది. ఇంత డబ్బు వ్యామోహంగల మనుష్యులమధ్య బతకడం నాకూ కష్టమే. మొదటినుండీ నేను దేనికి భయ పడ్డానో, అదే జరగింది. నన్ను నన్నుగా ఆదరించే వాళ్ళు నాకు కావాలిగాని, నా ఆర్జనను ఆరాధించే వాళ్ళుకాదు.... సరేలెండి.... రాధగారూ, ఒక్క మాట. తండ్రీకొడుకులిద్దరూ బెల్లంకొట్టిన రాళ్ళలా ఊరుకున్నారు. నేను యీ యింట్లో అడుగు పెట్టింది మిమ్మల్ని అన్యాయం చెయ్యడానికికాదు, నేనూ ఒప్పు కుంటాను. ఈయింట్లో మీరు ఒక్కక్షణం ఉండొద్దు పదండి నాతో, నేనూ ఉండను.

రాజా : ఏమిటి వసంతా నువ్వనేది?

వ : ఏమీలేదు. ఏదో వ్యామోహంలోపడి నేను మిమ్మల్ని పట్టుకోలేదు, అది జ్ఞాపకం పెట్టుకోండి. గౌరవంగా, స్వతంత్రంగా బతకాలనే ఎప్పుడూ ప్రయత్నించాను. నాకు జీవితంలో ముఖ్యమైనది డబ్బుకాదు. హృదయం. రాధకి చోటులేని యీ యింట్లో నాకూ చోటు లేదు. పదండి రాధగారూ. మీ రుణాన్ని వాళ్లు జన్మ జన్మాలకీ తీర్చుకోలేరు మనందరం కలసి బతుకుదాం పదండి. నేనున్నాను. మీకేం భయంలేదు. మా నాన్నగారి సహాయంతో మీఆయనకు తప్పకుండా ఏదైనా ఉద్యోగం దొరుకుతుంది. పదండి.

రాధ : ఆహాహా !

వ : అలా అనకండి పదండి పోదా.

రాజా : వసంతా ! వసంతా ! వెళుతున్నావా వసంతా !

వ : (దూరంనుండి)— ఆఁ. మేమందరం వెళుతున్నాం.

♦ ♦ ♦

శా : (దీనంగా) —నాయనా ఏడుకొండలవాడా : పిల్ల లందరూ యిల్లొదిలి రెండురోజులైంది. ఏవండీ మాటాడరేం. నన్ను బతకమన్నారా, ఎందులోనైనా పడి చావమన్నారా? చెప్పరేం?

రామ : నేనసలే బెంగతో కుమిలిపోయి ఏడుస్తూంటే నువ్వొకరైపీ. అసలీ బెడదంతా నువ్వే తెచ్చి పెట్టావు సంసారం బజారునపడింది బుద్ధొచ్చిందా యికనైనా?

శా : బుద్ధి యిద్దరికీ వచ్చింది బాబూ ఆసంగాతి వొప్పేసు కున్నాంగా. మీరుకూడా కాస్త వెళ్ళి ఏసంగతీ కనుక్కు రండీ. రెండురోజులై కాలుగాలిన పిల్లిలా తిరుగు తున్నాను, మతి పోయింది.

రామ : బాగుంది వరస. అసలే కీళ్ళ నొప్పులతో నేను చస్తూంటే — నువ్వొకర్తెపీ. అబ్బాయి వెళ్ళాడుగా. అన్నీ సర్దుబాటు చేసుకుని వస్తాడు. ఇదిగో మాటలో వచ్చాడు. ఏరా అబ్బాయ్. ఏం జరిగింది.

రాజా : ఏం జరిగింది ! తలతీసి భూమిలో పెట్టేసినట్ల యింది. మా మావగారు పెట్టిన చల్లని చీవాట్లతో కడుపునిండిపోయింది, సరేలే, జరిగిందేదో జరిగింది

రామ : ఇంతకూ వసంత ఏమందిరా? అది చెప్పవేం?

రాజా : జన్మలో యింకెవరూ వేరింటి కాపరాల గొడవ ఎత్తకూడదంది. ఇంటి పెత్తనం తనూ, అక్కయ్యా

చూసుకుంటారు. మనందరం జీతాలుతెచ్చి వారిద్దరి చేతికి యిచ్చెయ్యాలట. వాళ్ళది ఎలా ఖర్చుపెట్టినా, సంసారం ఎలా దిద్దినా మనం మాటలాడకూడదట. అంటె యింటిపెత్తనం యినపెట్టె తాళం చెవులూ వారిద్దరికీ యిచ్చేయాలట.

రామ : అదీ ఒకందుకు మంచిదేరా, నాకూ ప్రాణం హాయిగా వుంటుంది. అన్నింటికీ ఒప్పుకున్నామని చెప్పరా. త్వరగా వెళ్ళరా బాబూ.

రాజా : ఇంకోటి చెప్పింది. యింకెప్పుడూ అక్కయ్య చేత కన్నీళ్ళు పెట్టించ కూడదట.

శాం : ఇంకానా నాయనా, త్వరగావెళ్ళి ఆందర్నీ తీసుకురా రా.

రామ : వాళ్ళిద్దరూ రెండు కళ్ళలా ఉండి సంసారాన్ని దిద్దుకుంటే నాకేం కావాలిరా. అర్జంటుగా వెళ్ళి తీసుకురా.

రాజా : ఇదిగో నిముషాల మీద తీసుకొస్తాను.

రామ : టాక్సిచేయించుకొనివెళ్ళి అందులోనే తీసుకురా.

శాం ; టాక్సీనా?

రామ : అదిగో అలాంటివే యింక అనకూడదు.

రాజా : అసంగతి వాళ్ళనే అడుగుతాలే అమ్మా.

రామ : నిజమేనోయ్ ! మరిచిపోయాను. (నవ్వుతాడు.)

(సంతోషాన్ని సూచించే వాయిద్యాలు)

(ఆలిండియా రేడియో ప్రసారితం)

# సంసారాలు సంతోషప్రదం చేయడం ప్రణాళిక ఆశయం

తెలివిగా సంసారాన్ని సరిదిద్దుకొనడ మంటే కుటుంబ సౌఖ్యానికి, దేశ సౌభాగ్యానికి పాటుపడటమే —

- ఆహార పదార్థాలు మొదలైనవి దుబారా చేయకండి.
- పెరటి తోట పెంచుకోండి - బజారులో కూరలు దొరకడం లేదనే బాధ ఉండదు.
- ఏదో కొంటున్నామనే భావంతో ఏ వస్తువూ కొనకండి.
- తీరిక సమయాలలో అల్లిక, కుట్టుపనివంటి వ్యావృత్తి పెట్టుకోండి.
- కుటుంబ నియంత్రణం అవలంబిస్తే, మీ సంసారం ఎంతో సుఖంగా ఉంటుంది.
- మీ పిల్లలు రేపటి ఉత్తమ పౌరులుగా తయారయేందుకు వీరి తగు శిక్షణ నివ్వాలి.
- ఎక్కువగా పొదుపుచేసి, భారత ప్రభుత్వంవారి చిన్న మొత్తాల పొదుపు పథకంలో మదుపు పెట్టండి.

## ప్రణాళికకు సహకార మివ్వండి- మీ మేలుకు మీరు కృషి చేయండి



తనుకట్టలేని గణితాన్ని పలకమీద నుంచి చెరిపినంత మాత్రాన శేషం వచ్చినట్టేనా?
కోరికల గోరువంకలని పాపపు డేగ చంపివేసింది——
ఎవరి కోసం జీవించడం—— యీ అహల్య ? ?

(పకపక నవ్వులు)

యువతి : నువ్వు వెయ్యిచెప్పు. లక్షచెప్పు. ఈ కథలో ఏదో పొరపాటుంది.

యువకుడు : ఏం పొరపాటు? అహల్య మహాపతివ్రత అని నాఉద్దేశ్యం. అర్థరాత్రి ఇంద్రునితో విహరిస్తే గౌతముడు శిలకమ్మని శపించాడు. ఇందులో పొరపాటుకి అవకాశం ఏముంది?

యువతి : అదికాదోయ్ నీవుసరిగా ఆలోచించిచూడు గౌతముడు నల్లగా జెడలుకట్టిన ముని. ఇంద్రుడు చాలా అందగాడు. న్యాయంగా అహల్య ఇంద్రుడిని ప్రేమించటంలో ఆశ్చర్యంలేదు.

యువ : ఏడిసి నట్లుంది. వివాహిత స్త్రీ అలా ప్రవర్తించటం తప్పు లేదంటావు?

యువతి : ఇదేనోయ్ మీ మగవాళ్ళతో ఒచ్చినచావు. అని నేనెక్కడ అన్నాను? ఒకవేళ ముందే ఇంద్రుడి భార్య ఎందుకు కారాదు? బ్రహ్మ మానసపుత్రిక అయిన అహల్య ఇంద్రుడిని అనేకసార్లు చూడటానికి అవకాశం లేకపోలేదు. ఆలాటప్పుడు గౌతముడు.... .......

యువకు : విలన్ కావటానికి అవకాశము లేకపోలేదు అంటావు. సరే! నీ అభిప్రాయాలు నీవి, అవి నిజం కావచ్చును కాకపోవచ్చును. ఓ పదకొండూ పాడు సినిమా మతిపోగొట్టింది. ఇక నిద్రపోదాం.

♦ ♦ ♦

(స్వప్నాల్ని సూచించే ధ్వనులు)

అహల్య : కౌశికీ గౌతములేం చేస్తున్నారు?

కౌశికి : ప్రయోగశాలలో ఉన్నారమ్మా !

అ ; (నిట్టూర్పి) ప్రయోగశాల! మృత్యుమందిరం.

కౌ : అందరూ ఆప్రయోగశాల కల్యాణ మందిరం అంటుంటే నీవలా అనటం బాగాలేదు అహల్యా.

# శిలా హృదయం

అ : కౌశికీ....ఆ ప్రయోగాల వలన అసలు ప్రయోజనం ఏమిటో మానవుడి అభ్యుదయానికి వినియోగించాల్సిన విజ్ఞానం దుర్వినియోగం అవుతున్నది. అబ్బ. భయంకరమైన ఆ శిలా ద్రావకం. (ఆగి) ప్రియసఖి ఒకవేళ ఆ శిలాద్రావకమే. నా సమస్యలన్నిటికీ సమాధానం అవుతుందేమో?

కౌ : భయంకరం, కమనీయ పుష్పాలు తేత హృదయాలూ కలిపి చేసిన ఆ మృత్యుద్రవం. నీసమస్యలకి సమాధానం అవుతుంతా? చిత్రంగామాట్లాడుతున్నావు అహల్యా,

అ : ప్రియసఖి...అందులో....నా హృదయంకూడా ఉంది గౌతముని ధీవిశేషం, నవనీత హృదయాన్ని శిలా హృదయాలు చేయగలిగిన అతని మేథాశక్తి నా ఇంద్రుడిని.... అహల్యా పరిష్వంగంలో జగమే లేదనుకొనిన గాఢ ప్రేమికుని. నాకు కాకుండా చేయటంతో ఆగలేదు....ప్రియసఖి. అందులో నా హృదయం కూడా ఉంది.

కౌ : అహల్యా. భగవతుని సృష్టిలో కనిపించిన అన్ని పుష్పాలూ ఆయన పాదాలమీద పడటం అసంభవం.

- అత -

అహల్య : అతని హృదయ సింహాసనానికి రాణిని అవుతాననుకొన్న నేను, గౌతముని శిలా హృదయానికి దాసినయినాను. ....ఆ మోహనమూర్తి చిరునవ్వు వెలుగు నా జీవిత చిత్రాన్ని దిద్దుకుందామనుకొన్న నేను గౌతముని కోపిష్టి స్వభావాని కంత వాడిపోతున్నాను, సఖీ అతడు నన్ను క్షమిస్తాడా? ఇందులో నా తప్పేముంది?

కా : స్త్రీగా జన్మించటమే నీ మొదటి తప్పు. భూప్రదక్షిణం చేసినవాడికే నిన్ను ఇస్తాననటం నీ తండ్రితప్పు. ఆలోచించకుండా భూ ప్రదక్షిణానికి వెళ్ళటం ఇంద్రుడి తప్పు. ఆవుకి ప్రదక్షిణం చేశానని దౌర్జన్యం చేసిన గౌతముడికి భయం వల్ల, నిన్ను ధారపోయించటం. పెద్దలు చేసిన తప్పు. ఇన్ని తప్పులు కలిసి నిన్ను నాశనం చేసినయ్.

అ : సఖీ. నాకు శిలాద్రావకం కావాలి.

కా : ఆత్మహత్య.... జీవితాన్ని ఎదుర్కొనటం చేత కాక చచ్చిపోవాలనుకునే వాళ్ళకన్న మూర్ఖులు లేరు. తను కట్టలేని గణితాన్ని పలకమీద నుంచి చెరిపినంత మాత్రంచేత శేషం వచ్చినట్లేనా? అలాటి ఆలోచనకూడా పాపం.

అ : (శ్లేషగా) పాపం! హృదయ విహీనమైన ఈ ధరిత్రికన్న ఆ నరకమే సుఖమేమో! అయినా నేను ఎవరికోసం బ్రతకను? ఆశాసౌధాలు గౌతముని ఈర్ష్యాగ్నిలో దగ్ధమై పోయినయ్. కోరికల గోరువంకల్ని పాపపు డేగ చంపివేసింది. చెప్పు చెలీ. నేనెవరి కోసం జీవినంచను?

కా : ఈ జీవిస్తున్న ప్రతి జీవీ. — తన కోసం తనే జీవిస్తుంది, నీవూ అంతే.

అ : కాని...ఒక్కటే కోరిక. చనిపోయే ముందు ఒకసారి అతడు కనిపిస్తే....నా నుదుట పీడకలలే వ్రాసి ఉన్నాయి. సుఖ స్వప్నాల్ను లభించవు,

కా : దేవరాజు సాహసి. కట్టుబాట్లు అతనిముందు దారపుపోగులు. నీకోసం అతడు చేయలేనిదిలేదు!

అ : ఆవిషయం నాకు తెలుసు...కాని దావాగ్ని ముందు. లలితలవంగలత యెంత సేపు జీవించ కలదు....ఒక వేళ అంత పనే జరిగితే శచిగతి ఏం కావాలి?...సఖీ,నేను స్త్రీని, నాకు ఉదయంనుంచి అనుక్షణం అమంగళాన్నే శంకిస్తుంది...అనుక్షణం అమంగళాన్నే శంకిస్తుంది.

కా : చెలీ నీ హృదయంలో అగ్ని నీ జీవిత సర్వస్వాన్నీ ధగ్ధం చేస్తుంది,

అ : ఏ విధంగా సఖీ, (నవ్వి) దేవలుడి శాపం లాగా నేనా? మూలికాద్రవంతో అతనిని వికృతరూపిగా చేసి. చూశారా నా శాప మహిమ. అన్నట్లుగానేనా? పిచ్చి లోకం! డాంభికాన్నే వాస్తవమనుకుంటుంది.

కా : ఎవరు? ఎవరా సుందర యువకుడు?

అ : (చిన్న కేకతో) ఇంద్రుడు!!

ఇంద్రుడు : అహల్యా, జీవించే ఉన్నావా? తిరిగివచ్చి జరిగిన కథ విన్నాను. మన ఇద్దర్నీ ఎవరూ విడదీయలేరు.... పద పోదాం ....అమరసుందరీ ఏమిటలా చూస్తున్నావు?

అ : సురసామ్రాట్టుకు అభివందనాలు. నీ అహల్య చనిపోయింది. ఇప్పుడు ఈ మాట్లాడుతున్న అహల్య గౌతముని భార్య....ఇది గురుకులమూ కాదు. ఈ అహల్యా ఇంద్రులు— ఆ అహల్యా ఇంద్రులూకారు?

ఇంద్ర : నీవేనా అహల్యా మాట్లాడుతున్నది? నీవు నా అహల్యవేనా? జీవితంలో ఏ యువతి కోసం త్రిలోకాధి పత్యాన్ని త్యజించటానికి సుర సామ్రాట్ వెనుతీయలేదో ఆ యువతి నీవేనా? అహల్యా నీవు నాతో రాక తప్పదు. నీవులేని స్వర్గం నాకు అవసరంలేదు, నీవులేని మందాకినీ తీరాలకన్న నీవు ఉన్న వైతరణీసైకతాలే నాకు సుఖప్రదం.

అ : —ఇంద్రాపొరపాటు. చక్రవర్తీ. యీ సంఘ నిబంధల్ని కాదని జీవించటం అంత తేలికకాదు. నీవు వెళ్లటం చాలా మంచిది.

ఇంద్ర : ఎక్కడకు వెళ్ళమంటావు? నేను వెళ్ళటానికి రాలేదు.... వెళ్లను. అహల్యా ఈ కోమల బాహువులు ఈ మనోజ్ఞవదనం, మందార మొగ్గల లాటిఈచిన్ని పెదవులు,(నిట్టూర్చి) గౌతమునివా?

అ : కావు. స్త్రీ జీవితంలో ప్రేమ ఒకసారే కలుగుతుంది. వివాహానికి ముందే కలిగి అదృష్టవశం చేత అతడే భర్తగా లభిస్తే. పతివ్రత అవుతుంది. దురదృష్టంచేత వివాహానంతరం ఆమె ప్రేమిస్తే పతిత అనిపించుకుంటుంది. లోకం ఏమనుకున్నా స్త్రీకి ఒకడే భర్త. అహల్యా ప్రియసఖుడు మహేంద్రుడొకడే. ఇక వెళ్ళండి చక్రవర్తీ.

ఇంద్ర : నేను అహల్యా శూన్య జీవితం జీవించలేను.

అ : అదిగో అటుచూడు. ఆ లతాతన్వి చూతయువకుని పరిష్వంగలోంచి తప్పించ బడ్డది. గౌతముని నిష్ఠురలీలకి, ఆ పుష్ప సుందరి కోమల జీవితం. ఆ హంస దంపతుల అన్యోన్యం. త్వరలో బలి కాబోతున్నవి. ఆ రాక్షసుని ప్రయోగాలకి ప్రకృతితో పాటు మన రక్తమూ అవసరమే. అతను వచ్చే వేళయింది. ఇక వెళ్లటం మంచిది.

ఇంద్రా : అహల్యా. ఒకప్పుడునేనెన్నో ఊహించాను. నా జీవిత హారానికి మణిగా మెరుస్తావనుకొన్నాను. నా కవితా నందవనంలో వాణిగా పలుకుతావనుకొన్నాను. ఇప్పుడు కొంచెం అడ్డం తగిలింది. అయినా ఇంద్రుడు జగజ్జేత. మహావీరుడు.

అ : ఒక స్త్రీ కోసం. నీ బాధ్యతలు వదలటం ధర్మం కాదు. నా కోసం రక్తపాతాలు జరగటం నాకిష్టంలేదు. నా జీవిత సుఖం అనాఘ్రాతంగానే రాలిపోనీ. (గద్గదంగా) శచీదేవితో ఏకశయ్యమీద ఉన్నప్పుడూ, జయంత కుమారుని ముద్దాడునప్పుడూ, ఆ మహోన్నత సామ్రాజ్యాన్ని శాశించేటప్పుడూ. ఒక్కసారి ... కేవలం ఒక్కసారి మాత్రం, ఈ అభాగ్యురాల్ని తల్చుకో....అంతే చాలు...నాకు అంతే చాలు (ఏడుపు)

ఇం : దుఃఖిస్తున్నావా అహల్యా! నీ కంటివెంట నీరు! అవును. అసమర్థుడైన ఇంద్రుడు. తన భార్యను మాయోపాయంచేత మరొకడు అపహరించినా చూస్తూ ఊరుకుంటే. నీ కంటివెంట నీరు రాక ఏమవుతుంది?

అ : ఇంద్రా, ఇక నీవువెళ్ళు. అతడికి జాలిలేదు. మనిషిని శిలగాచేసి మనసుని ఆలోచింపచేస్తూఉండే మహత్తర ద్రావకాలు అతని దగ్గర ఉన్నాయ్, వాటికి నీవు బలికావటం నేను సహించలేను.

ఇ : (నిట్టూర్చి) నన్ను ఒంటిరిగా వెళ్ళమంటున్నావా అహల్యా! గురుకులంలో చిలుక పిల్లలవలె, భరత ముని పవిత్ర పాదాలవద్ద నాట్య మయూరములవలె జీవితానికి రంగులు వేశాము. మందాకినీ తీరంలో సైకతశ్రేణిలో నీ సురసౌందర్యానికి నా ప్రణయాంజలులు సమర్పించాను...గుర్తుఉన్నదా ఆనాడు నీవు......

[అహల్య : (సంతసంగా) విరాటమూర్తికి విశ్వసుందరినై, నీ సుందరమూర్తికి ప్రేక్షకురాలనై నీ సంగీత విపంచికి మలయమారుత రాగాన్నై నీలో కలిసిపోతాను...నీలో ఒదిగిపోతాను]

ఇం : అన్నావు అదంతా మర్చిపోయి ఇప్పుడు రానంటున్నావు. నీకు గౌతముడే కావాలని ఉందనుకుంటాను,

అ : నన్ను అపార్థం చేసుకోకు. నీవే లేకపోతే ! అమరావతి అంబుధిలో కలిసి పోతుంది, ఉత్తమ ఇల్లాలు శచి ఆమె ఏంకావాలి? నామాట విను భగ్నవీణ బాగుపడదు. వాడినపూవు పునర్వికాసం చెందదు. శిలాహృదయం, చంద్రకాంత శిలకాదు. పండితుడవు నీకు నేనుచెప్పేదేమిటి, ప్రేమ కేవలం శరీరసంబంధి కాదు. మనసుకి సంబంధించినది. కాని మీ రిద్దరూ నా శరీరాన్నై కోరుతున్నారు ఇది నా దురదృష్టం. నన్ను మరచిపో. ఆఖరిసారి నిన్నుకలారా చూసుకున్నాను నాకంతేచాలు.

(ఏడుపు)

ఇం : ఇంతకన్నా నన్నూ ఎవరూ అవమానించలేరు. ఆశా ప్రవాహాలు ఇంకి పోయినయ్. నిరర్థకం యీ జీవితం.

అ : ఇంద్రా. ఈ అగ్నిద్రావకం చూశావా? ఇది మనిషిని శిల చేస్తుంది. నా జీవితకాలం మరికొన్ని ఘడియలు మాత్రమే.

కా : (వెర్రికేక)

ఇం : శిల...ఏమిటి దీని అర్థం అహల్యా క్షమించు. ఈ మాలతీలత గౌతముని ముంగిటిలో నయినా చల్లగా ఉండనీ.

గౌతముడు : చల్లగా ఉండనీ ... ఓహో అహల్యా. ప్రణయ సామ్రాజ్య చక్రవర్తికి గౌతముడు అభివందనాలు చేస్తున్నాడు.

ఇం : గౌతమమునికి దేవసామ్రాట్ అభివాదములు. నా భార్యని తీసుకు వెడదామని వచ్చాను, దేవ సామ్రాజ్ఞి పయనంకండి.

గౌ : వ్యభిచారిణికి. దేవసామ్రాజ్ఞి. భారత యువతులకు కొత్తస్మృతి !

ఇం : ధర్మస్వరూపులూ జితేంద్రియులూ అయినమీరే అన్యమనస్విని అయిన కన్యని భార్యగా స్వీకరించినప్పుడు, సురభారత యివతీ యువకులు వ్యభిచారులు కావచ్చును. తమరు స్మృతి కర్తలు. తమరు చేసినట్లు చేయడం వారివిధి.

గౌ : చక్రవర్తికి జ్ఞాపకశక్తి క్షీణించి నట్లున్నది. సురసింహాసనంతో పాటు తిలోత్తమాది అప్సరసల్ని, నందన వనాన్ని తమకి అర్పించింది. తమరిప్పుడు ఆక్షేపించిన స్మృతి కర్తలే. మర్చిపోయినారా మహారాజా.

ఇం : ఇంద్రుని సౌందర్యశ్రీకి అప్సరసల ప్రణయార్పణ సంగతి లోకవిదితం. నందనవనం ఒకరి భార్యా? మందాకినీ తీరంలో అన్నీ నందనవనాలే బహుశా అవన్నీ తమ ప్రయోగ పాండిత్యానికి ఆహుతి అయి నందన మొక్కలే మిగిలి ఉండవచ్చును! అహల్యా వెడదాం రా !

గౌ : ఆగు అహల్యా నీవు నా భార్యవు. వెళ్ళటానికి వీలులేదు. నీ శరీరంనాది.

అ : శరీరంతో వెళ్ళను మహాముని ఒక్కమాట, నీవు నా జీవిత లతను ముక్కలు చేశావు, నా కన్నెబ్రతుకును కడగళ్ళపాలు చేశావు అయినా నిన్ను క్షమిస్తాను. నేనే నశించి పోతాను. చనిపోయేముందు ఒకమనవి. ఆ లతా జీవితాన్ని తృంచకు. ఆ సుమ సుందరీ సౌభాగ్యాన్ని అంతం చేయకు. మానవుడి విజ్ఞానం అతని అభ్యుదయానికే వినియోగిస్తే ప్రపంచం జోహారు చేస్తుంది. నీవు చేసిన పొరపాటు దిద్దుకోటానికి అవకాశం లేక పోలేదు. ఇక శెలవు.

ఇం : శలవా? ఏమిటి దీనిఅర్థం.

అ : అవును నేను బ్రతుకునుంచి శలవు తీసుకుంటున్నాను. నాకు జీవితం వెగటేసింది. రామనామమే నా జీవితధ్యేయం. సుందర ప్రపంచంలో నాకు చోటులేదు. కౌశికీ శలవు. (కొన్ని ధ్వనులు)

ఇం : అహల్యా. ఏమిపని చేస్తున్నావు. గౌతమా ఆమె ఏంచేస్తోంది. కౌశికీ — కౌశికీ .... అహల్యా. (బిగ్గరగా) అహల్యా !

వాల్మీకి : గౌతమా కుశలమేనా ! ఇంద్రా నీవా? ఇదేమీ వికృత స్వరూపం!

ఇం : వికృతరూపము మనమోహిని అహల్య. గౌతముని అత్యాచార ఫలితం. నా ప్రేమ పట్టుదలల దౌర్భాగ్యశేషము. స్వార్ధపరులమైన మా శిలా హృదయాలకు అహల్య బలిఅయింది. కవిచంద్రా నీ మహా కావ్యంలో ఈ అత్యాచారానికి చోటు ఉందా? ఆమె తనవలపు వేడికి తనే నశించింది. మహాకవీ నీ రామాయణగాథలో యీ అమాయకురాలి విషాదాంత గాథకు స్థలం ఉందా? మేమిద్దరం చేసిన ఈ మహాఘోరాన్ని నీవు చిత్రించగలవా? మహాత్మా. కావ్యం లోకంలో సుస్థిరం. అహల్యకు జరిగిన ఈ అన్యాయం లోకవ్యాప్తం చేయి. ఇదేనాపార్ధన, అహల్యానీవు శిలాస్వరూపిణి అయినా నేను నిన్ను ప్రేమించటం మానలేను. (గద్గదంగా) శెలవు అభాగ్యురాలా శెలవు.

వాల్మీకి : ఎంతఘోరం. కుమారీ నీకా ఈ వికృత రూపం? నిన్ను ప్రామాణికం చేసుకొని సీతా సౌందర్యం వర్ణించాను. నిన్ను ఆదర్శం చేసుకొని ఊర్మిళాకాంత హృదయం చిత్రించాను గౌతమా!

గౌ : ఏం మహాకవీ?

వాల్మీకి : ఈమెచావుకి కారణం నీవు. నీకు నిష్కృతి లేదు. భావిచరిత్ర కారులు నిన్ను అసహ్యించుకొనేలాగు చిత్రిస్తాను, అవసరంలేదు. ఈ యుగంలో అందరికీ తెలుసు. ద్వాపరంలో ఈ ధన్యురాలి పేరు చిరస్మరణీయం చేస్తాను. అవును. భారతనారీ ఫాలతలాన కుంకుమ శోభలు వెలుగు చిమ్మినంత వరకూ సీతా సౌశీల్యగానం జగతిలో జరిగుతున్నంత వరకూ. ఆ రామనామము. ఆర్య వాటికల ప్రతిధ్వనించు వరకూ ప్రతి మానవుడూ నిన్ను ద్రోహి అనేలాగు చేస్తాను. అహల్యా పాతివ్రత్యం ఆర్య సుందరులు తరతరాల గానం చేశేలాగు చేస్తాము. మూర్ఖుడా నీమొహం చూడటమే మహా పాపం.

గౌ : ఎంతలో ఎంత అయింది! వాల్మీకి అన్నంతపనీ చేస్తాడు. ప్రతీ చరిత్రకారుడూ నన్ను ద్రోహి

అంటాడు కాబోలు. అహల్యా నీ హృదయమింత నిశ్చలమైనదని తెలిస్తే నిన్ను వివాహం ఆడక పోదును. ఇప్పుడు గత్యంతరం? (**విరామం**)అవును వాల్మీకి గర్వి. వ్రాసినది తిరిగి చూడనని అతని ప్రజ్ఞ. వాగ్దేవి తన యందున్నదని అతని అహం. వాల్మీకి నీ గర్వమే నాకు రక్ష. రేపు అర్ధరాత్రి నీ వ్రాత కొట్టివేశి తిరిగి ఇలావ్రాస్తాను. "అహల్యా ఇంద్రులు జారులు. గౌతముని శాపం వలన అహల్యా శిలగా మారింది." ఇదే కథ లోకంలో ప్రచారమయితే. కాదనిపించి వివరించినా లోకం నమ్మదు. గౌతముని దీశక్తి ముందు. ఇంద్రుని పరాక్రమం. వాల్మీకి కావ్యంకూడా. గడ్డిపోచలు! ఉత్త గడ్డిపోచలు!

కా : గౌతమా నేనిక్కడే ఉన్నాను. పాపాత్ముడా యెంత ఘోరం తలపెట్టావు. నేను వాల్మీకితో చెప్పుతాను.

గౌ : కౌశికీ ఆగు.

కా : అడ్డులే.

గౌ : యెంత సాహసం.

కా : (వెర్రికేక)

గౌ : అడ్డుతొలగింది, అహల్యా ఇంద్రులు....జారులు అహల్యా ఇంద్రులు జారులు.

యువ : కాదు. యెంతమాత్రం కాదు. నీవేద్రోహివి.

యువతి : ఏయ్ ఏమిటా కలవరింతలు. నీ వెర్రి కేకలలో నా నిద్ర కూడా చెడగొట్టావు.

యువకుడు : కల....ఎంత చిత్రమైన కల వచ్చిందను కున్నావు. నీవు చెప్పినట్టు అహల్యా ఇంద్రులు జారులు కారు. గౌతముడే ద్రోహి.

♦ ♦ ♦

యువతి : ఏం? అలాష్లేటు మార్చావు. కలలో అహల్య కనిపించిదా ఏమిటి? ఐమీన్ T. అహల్య!

యువకుడు : నీ మొహం. T. అహల్యా కాదు. అసలు అహల్యే కనిపించింది. అహల్య తప్పేంలేదు. ఇంద్రుడి తప్పు అసలేలేదు. తప్పంతా గౌతముడిది.

యువతి : సర్లే, రచయితవుగా రేప్పొద్దున ఒక నాటకం వ్రాద్దువుగాని ఇప్పుడు నిద్రపో.

యువకుడు : ఎంత చిత్రమైన కల ఇలాంటి కలలు రచయితలు తప్ప అందరూ భావించలేరు అవునా?

యువతి : అవును.

(ఆకాశవాణి హైదరాబాదు కేంద్ర సౌజన్యంతో)

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME AND FREE DISPENSARY

### STATISTICS

| *Year* | *Out-Patients* | *In-Patients* | *Deliveries* |
|---|---|---|---|
| 1952 | 2,815 (From September) | — | — |
| 1953 | 8,124 | 73 (From July) | 25 (From August) |
| 1954 | 17,848 | 1,023 | 438 |
| 1955 | 35,272 | 2.246 | 999 |
| 1956 | 38,715 | 3,464 | 1,238 |
| 1957 | 50,734 | 4,793 | 1,563 |
| 1958 | 51,765 | 5,489 | 1,825 |

*( From January to December '58 )*

**OUT-PATIENT REGISTER**

| | |
|---|---|
| No of Surgical cases treated | 714 |
| ,, ,, Medical ,, ,, | 13,763 |
| ,, ,, Ante-natal ,, ,, | 3,683 |
| ,, ,, Post-natal ,, ,, | 1,333 |
| ,, ,, E.E.N.T. ,, ,, | 1,038 |
| ,, ,, Gyneac ,, ,, | 2,022 |
| ,, ,, Dental ,, ,, | 91 |
| Total No. of New patients | 22,643 |
| ,, ,, ,, Old patients | 29,122 |
| Grand total | 51,765 |

**ADMISSION REGISTER**

| | |
|---|---|
| No. of Patients admitted for deliveries | 2,310 |
| ,, ,, Medical cases treated | 907 |
| ,, ,, Post-Natal ,, ,, | 51 |
| ,, ,, Gyneac ,, ,, | 397 |
| ,, ,, Surgical ,, ,, | 14 |
| ,, ,, Babies admitted as Lodgers | 1,810 |
| Grand total | 5,489 |

**IN-PATIENT MATERNITY REGISTER**

| | | |
|---|---|---|
| No. of Normal deliveries | | 1,713 |
| ,, ,, Abnormal deliveries | | |
| Forceps | 103 | 112 |
| Version | 4 | |
| Ext. Breech | 1 | |
| Cranotomy | 1 | |
| Manual removal of Placenta | 2 | |
| Embryotomy | 1 | |
| Grand Total | | 1,825 |

**Mrs. V. LAKSHMI PARVATHI**
*Secretary and Convener*

**Dr. M. PAVANA BAI**
*Medical Superintendent.*

Edited, Printed & Published by Mrs. K. Lakshmi Raghuram, B.A., at the Andhra Mahila Press, Mylapore, Madras 4. Manager and Associate Editor: Ramalakshmi Arudra.